Hazrath Ayesha Siddiqua (R)
(Telugu)

# హజ్రత్ ఆయిషా సిద్దీకా

## (రజి అల్లాహు అన్హా)

*మూలం:*

**ఇబ్నె అబ్దుష్షకూర్**

*అనువాదం:*

**ఎస్.ఎం. ఖాద్రి**

అనంత కరుణామయుడు అపార కృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో

# హజ్రత్ ఆయిషా సిద్దీకా

## (రజి అల్లాహు అన్హా)

## సంస్కరణోద్యమం వెలిసింది

నేటికి పదునాల్గు వందల ఏండ్ల క్రిందటి మాట. దైవధిక్కారాంధకారంలో మునిగి ఉంది ప్రపంచం. బహుదైవారాధన భావాలు బుద్ధిని, మేధను దట్టంగా చుట్టుకున్న వేళ అది. మానవాళి దైవజ్ఞాన కాంతికి నోచుకోలేదు. మనిషికి దైవం అంటే ఏమిటో తెలియదు. పరలోకం పట్ల విశ్వాసం అంటే అసలే తెలీదు. ప్రపంచమే సర్వం. ఇక్కడి భోగభాగ్యాలే శాశ్వతం అనుకున్నాడు మనిషి. అతనికి ఓ లక్ష్యం అంటూ, ఓ ధ్యేయం అంటూ లేవు. కళ్ళెం లేని గుర్రంలా, ముకుత్రాడులేని ఒంటెలా జీవితాన్ని గడిపేవాడు. మనోవాంఛలే వారికి దైవాలు. రాళ్ళూ రప్పలే ఆరాధ్యులు. ఒకచోట దేవతల్ని, దిక్పాలకుల్ని ఊహించుకొని పూజించడం జరిగితే మరోచోట ప్రజలు చనిపోయిన తమ తాత ముత్తాతల సమాధుల్ని పూజించేవారు.

మానవుడు ఇలా రుజుమార్గం నుండి, మానవతా మార్గం నుండి తప్పిపోయాడు. బలవంతుడు బలహీనుడ్ని అణచివేసేవాడు. ఎడతెగని యుద్ధాలు, ఘర్షణలు సర్వసామాన్యమయ్యాయి. అమాయక ప్రజల్ని, కులం-మతం, జాతి-తెగ, వర్ణం-వర్గం అనే విద్వేష పునాదులపై హతమార్చేవారు. భూమి మానవ రుధిరధారలతో, ఆక్రందనలతో మరుభూమిగా తయారయ్యేది. క్రూరులయిన రాజులు, కర్కశులైన పాలకులు, భోగపరాయణులైన సంపన్నులు, మత నాయకులు- వీరిందరి చేతుల్లో స్త్రీ మూర్తి నలిగిపోయేది. ఒకచోట ఆమెను దేవదాసీగా మార్చితే, మరో చోట బానిసగా అమ్మేవారు. అందమయిన

స్త్రీలను రాజ ప్రాసాదాలకు చేర్చేవారు. కూతురు పుడితే సజీవంగా పూడ్చిపెట్టే వారు. చనిపోయిన భర్త చితిపై భార్యను సజీవ దహనానికి గురిచేసేవారు. స్త్రీ మానానికి, ఏమాత్రం విలువ లేకుండేది, ఆమెకెలాంటి హక్కులుగాని, సంఘంలో ఎలాంటి స్థానంగాని లేకుండేది. సేవకురాలిగానే పుట్టి తన జీవితమంతా సేవకురాలిగానే గడపవలసి వచ్చేది. మగవాని చేతుల్లో ఆడది ఆట బొమ్మగా ఆడవలసి వచ్చేది.

## మహిళోద్ధారకుడు వచ్చాడు

చివరికి స్త్రీ జాతి విమోచన కర్త, మహిళోద్ధారకుడు, సమాజ సంస్కర్త, అంతిమ దైవప్రవక్త మహనీయ ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వసల్లం) వచ్చారు.

ఆయన పాతికేళ్ళ వయస్సులో నలభయి ఏళ్ళ వితంతువును పెళ్ళాడి స్త్రీ గౌరవాన్ని ఆకాశానికి ఎత్తాడు.

## ప్రపంచ మహిళల్లారా, మీకిక భయంలేదు

వితంతువులారా, ఎందుకమ్మా బాధపడతారు, మీ దుఃఖాలను కడతేర్చే వాడు వచ్చాడు! తల్లీ, ఇక నీవు సగర్వంగా తలెత్తుకొని తిరుగు. నీ కాళ్ళక్రింద స్వర్గం ఉందని ప్రకటించాడమ్మా!

చెల్లీ! బాధపడకు, నీవిప్పుడు ఇంట్లో ఆదరణీయ సభ్యురాలవు. నీవు పురుషునికి బానిసవు కావు, విలాస వస్తువు అంతకన్నా కావు. నీవు నీ భర్తకు మనశ్శాంతివి, అతని కంటికి చలువవు. అక్షరాలా అతని అర్ధాంగివి. అతని ఇంటికి యజమానురాలివి. ఆ ఇంటికి నీవు సంరక్షకురాలివి, మహారాణివి.

అమ్మడూ, నీ పుట్టుక నీ తండ్రికి అవమానకరం కాదు, గర్వకారణం. నీ పోషణ పుణ్యప్రదం. ఇకపై నిన్నెవరూ సజీవంగా పూడ్చి పెట్టరు, గొంతు నులిమి చంపివెయ్యరు. అనాథ బాలికలారా! మీరిప్పుడు అనాథలు కారు. మిమ్మల్ని పెంచి పోషించేందుకు ఎన్నో చేతులు ముందుకు వస్తున్నాయి.

వనితల్లారా! మీరు ఇకపై అమ్ముడు సరుకు కాదు. ఆదరణీయ సమాన స్థానం మీది. పురుషులకు సమాన హక్కుదారులు మీరు. మీకు ఆస్తిహక్కు

ఉంది. వారసత్వంలో హక్కు ఉంది. మీ స్వేచ్ఛా స్వాతంత్ర్యాల మానమర్యాదల రక్షణాభారం సమాజానిది. ఇక మీరు సగర్వంగా తలెత్తుకు తిరుగగలరు.

## సంస్కర్త

స్త్రీ మూర్తికి ఆమె నిజస్థానం కల్పించిన మహనీయుడాయన. ఆయన గొప్ప సంస్కర్త. సంపూర్ణ విప్లవోద్యమ నాయకుడు. నైతికత ప్రమాణాల అత్యున్నత శిఖరాలను చూపడానికి వచ్చాడాయన. ప్రపంచానికి వినూత్న నాగరికతలను అందజేయడానికి వచ్చాడాయన. సరయిన దైవోపాసనా పద్ధతినే కాదు, సరయిన జీవన విధానాన్నీ నేర్పాడాయన. ఆ జీవన విధానమే ఇస్లాం- ఆది నుండి మానవాళి అనుసరిస్తూ వస్తున్న నిజధర్మం, ప్రకృతిధర్మం.

## ఇస్లాం సందేశం- ఆయిషా (ర)

మహనీయ ముహమ్మద్ నిజధర్మ సందేశాన్ని తన కుటుంబంలోని వారికి వినిపించిన తరువాత తన మిత్రుడు అబూబక్ర్ (ర)కు వినిపించారు. ఆ సందేశామృతాన్ని గ్రోలగానే ప్రాణమిత్రుని చేతిపై చేయి వేసి అబూబక్ర్ (ర) సహజధర్మాన్ని స్వీకరించారు. విన్నంతనే ప్రవక్త మహనీయుని దైవదౌత్యాన్ని ధృవీకరించి 'సిద్దీఖ్'గా బిరుదు పొందారు. ఆనాటి నుండి అబూబక్ర్ సిద్దీఖ్ (ర) గారి గృహం విశ్వాసకాంతితో వెలుగొందసాగింది. ఆయన భార్య ఉమ్మెరూమాన్, ఆయన కుమార్తె అస్మా (ర) కూడా ఈ ధర్మాన్ని స్వీకరించారు. ఇక హజ్రత్ ఆయిషా (ర) అయితే ఇస్లాం ఒడిలోనే కళ్ళు తెరిచారు.

హజ్రత్ ఆయిషా ఓ ఉల్లేఖనంలో ఇలా తెలిపారు:

"నాకు తెలివి వచ్చినప్పటి నుండి నా తల్లిదండ్రులు ఇస్లాం ధర్మాన్ని అనుసరిస్తూ ఉండగా చూశాను. మహాప్రవక్త (స) ఉదయం, సాయంకాలాల్లో మా ఇంటికి రాని రోజంటూ లేదు." (బుఖారి)

## వీరంతా స్త్రీ మూర్తులే

ప్రప్రథమంగా ఇస్లాం పిలుపును అందుకుని, స్వీకరించి మహాప్రవక్త ముహమ్మద్ (స)కు జీవితాంతం చేదోడువాదోడుగా నిలిచింది ఓ మహిళే.

ఆమె ఎవరో కాదు, దైవప్రవక్త సతీమణి. విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఖదీజతుల్ కుబ్రా (ర)యే.

దైవవాణి అవతరణ ప్రారంభం అయినప్పుడు, స్వాంతన వచనాలు పలికి మహాప్రవక్త (స)కు ధైర్యం చెప్పి ఆయన్ని 'వరఖా బిన్ నౌఫిల్' వద్దకు తీసుకొని వెళ్ళింది ఆ మాతృమూర్తే. దైవమార్గంలో తన ఆస్తి అంతా ధారబోసినదీ ఆ మహిళామణియే.

జైనబ్ బిన్త్ ముహమ్మద్ (స), దైవప్రవక్త (స) కుమార్తె! ఈమె అవిశ్వాసులైన అత్తవారింట ఇస్లాం స్వీకరించిన కారణంగా పడని పాట్లంటూ లేదు.

రుఖయ్యా బిన్త్ ముహమ్మద్ (స) కూడా మహాప్రవక్త కుమార్తే. భర్త ఉస్మాన్ (ర) వెంట అబిసీనియాకు వలసపోయి అష్టకష్టాలు అనుభవించారు.

ఫాతిమా (ర) ప్రవక్త మహనీయుని ముద్దులపట్టి. అఖ్బా బిన్ ముయీత్ అనే ఓ సత్యతిరస్కారి ఒంటె ప్రేవులు తెచ్చి నమాజ్ చేస్తున్న ప్రవక్త మహనీయుని (స) వీపుపై పెట్టినప్పుడు, ఆమె కన్నీరు మున్నీరుగా ఏడుస్తూ తన సుకుమార హస్తాలతో దాన్ని తండ్రి వీపుపై నుండి దింపిన సహనవతి.

మరో ఫాతిమా (ర) ఖత్తాబ్ కుమార్తె, ఉమర్ చెల్లి. అన్న ఆగ్రహావేశాలతో తననూ, తన భర్తనూ చితకబాదినా జంకకుండా ఆయన్ని ఇస్లాం వైపునకు మరల్చడానికి కృషిచేసిన ఏమాత్రం దృఢవిశ్వాసిని.

దైవమార్గంలో వీరమరణం పొందిన తొలిజీవి ఎవరు? ఓ స్త్రీ మూర్తి. బానిస మహిళ!. అమ్మార్ తల్లి, యాసిర్ భార్య అయిన హజ్రత్ సుమయ్యా (ర). ధర్మవనాన్ని తన నెత్తుటి మడుగుతో పోషించిన వీరవనిత.

## తోడ్పాటు పోయింది

పాతికేళ్ళపాటు ప్రవక్త మహనీయునికి తోడునీడగా, సుఖదుఃఖాల భాగస్వామినిగా, సహచరిణిగా, ధర్మమార్గ అనుయాయునిగా అలరారిన విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఖదీజా (ర) ప్రవక్త మహనీయునికి పదేళ్ళ దౌత్యకార్యంలో తన శక్తిసామర్థ్యాలేకాదు, ధనసంపత్తితో కూడా సహకరిస్తూ ఇహలోకం వీడిపోయారు. దైవదౌత్యకార్యంలోని బాధాకర ఘట్టాల్లో ఆమె ప్రేమైక సహచర్యం ఆయన హృదయాంతరాళాల్లో ఉపశమనాన్ని కలిగిస్తూ ఉండేది.

ఆమె అమృతమయ ప్రేమ, నిస్వార్థసేవల కారణంగా తనకంటే పదిహేనేళ్ళ పెద్ద అయినప్పటికీ, ఆమె 65 సంవత్సరాల వయసులో మరణించేవరకు ఆయన మరో పెళ్ళి ప్రస్తావన తేలేదు.

మదీనా నగరంలో ఓ క్రొత్త సమాజం, ఓ క్రొత్త నాగరికతా సంస్కృతులు ఏర్పడుతున్న తరుణంలో స్త్రీ పురుషులు ఉభయుల పాత్ర సమపాళ్ళలో ముందుకు రావలసి ఉంది. దైవం తన అంతిమ ప్రవక్తను ఆయన నాయకత్వంలో ఏర్పడే సత్సమాజాన్ని ప్రపంచ ప్రజల కోసం ఓ ఆదర్శంగా నిలిపి ఇహపరాల సాఫల్యా మార్గాన్ని సూచించదలిచాడు. కాబట్టి మహాప్రవక్త మాటల్ని, చేతల్ని, ప్రతి కదలికను- ఇంటా బయటా- చక్కగా విడమర్చి ప్రజలకు చూపే అవసరం ఏర్పడింది. ఆదర్శమూర్తి ముహమ్మద్ (స) కుటుంబ జీవితం, సామాజిక జీవితం- ఓ తండ్రిగా, సోదరునిగా, భర్తగా ప్రజల ముందుకు రావలసి ఉంది. ఈ దినచర్యల్ని అధ్యయనంచేసి వాటిని ఉన్నవిఉన్నట్లుగా ప్రజల ముందు పెట్టేందుకుగాను సత్యసంధత కలిగిన కొందరు వ్యక్తుల అవసరం ఏర్పడింది.

## ఉన్నత వ్యక్తిత్వం

అల్లాహ్ అంతిమ దైవప్రవక్త(స) కోసం అలాంటి వ్యక్తిత్వాలను ముందే ఎన్నుకున్నాడు. వీరిలో విజ్ఞతా వివేచనలు, అవగాహనా శక్తి, సమస్యల్ని విశ్లేషించి పరిష్కరించే నైపుణ్యం గల స్త్రీమూర్తి హజ్రత్ అయిషా(ర). ఈమె మహాప్రవక్త (స)కు ప్రాణమిత్రుడయిన హజ్రత్ అబూబక్ర్ (ర)గారింట్లో పుట్టి ఇస్లామీయ వాతావరణంలోనే పెరిగారు.

హజ్రత్ ఆయిషా(ర) జీవితానికి, మహాప్రవక్త (సఅసం) జీవితంతో విడదీయరాని బంధం ఉంది. మహాప్రవక్త(సఅసం) పవిత్ర జీవితచరిత్రను పూర్తిగా అధ్యయనం చేయడానికి, ఆయిషా (ర) గారి జీవితచరిత్రను కూడా చదవాలి; ఎక్కడయితే అంతిమ దైవప్రవక్త(స) అడుగుజాడలు కానవస్తాయో, అక్కడే హజ్రత్ ఆయిషా(ర) అడుగుజాడలూ కానవస్తాయి. చివరికి మహప్రవక్త (స) మదీనా వచ్చి ఏ చోటయితే, ఏ గదిలోనైతే తొమ్మిదేళ్ళు హజ్రత్ ఆయిషా (ర)తో కాపురం చేశారో ఆ చోటే, ఆ గదే ఆయనకు అంతిమ విశ్రాంతిమందిరం అయింది.

# పూర్వరంగం

హజ్రత్ ఖదీజా (ర) మరణానంతరం ఓ రోజు హజ్రత్ ఉస్మాన్ (ర) సతీమణి హజ్రత్ ఖౌలా (ర) మహాప్రవక్త (స) సన్నిధికి వెళ్ళి, "దైవప్రవక్తా! తమరు మళ్ళీ పెళ్ళి చేసుకోరా" అని అడిగారు. దానికి ప్రవక్త మహనీయులు(స) "ఎవరైనా ఉన్నారా?" అని అడిగారు.

"మీరు కన్య కావాలనుకుంటే కన్య, వితంతువు కావాలనుకుంటే వితంతువు సిద్ధంగా ఉన్నారు" అంటూ బదులిచ్చారు ఖౌలా.

"కన్య ఎవరూ, వితంతువు ఎవరు?" అని అడిగారు ప్రవక్త (సఅసం).

"తమకు అతి ప్రియమైన వారు హజ్రత్ అబూబక్ర్ సిద్దీఖ్ (ర) కుమార్తె, కన్య ఆయిషా. మిమ్మల్ని దైవప్రవక్తగా విశ్వసించి, మీ మార్గాన్ని అనుసరిస్తున్న వితంతువు 'జమ్‌అ' కుమార్తె సౌదా" జవాబిచ్చారు ఖౌలా.

"అయితే ఆ రెండు చోట్లా సంబంధం మాట్లాడు" పురమాయించారు దైవప్రవక్త(సఅసం).

ఖౌలా (ర) మొదట హజ్రత్ అబూబక్ర్ (ర) ఇంట ఆయన సతీమణి హజ్రత్ రూమాన్ ఒక్కరై ఉండగా కలుసుకొని మాట్లాడారు. "రూమాన్! అల్లాహ్ మీకు ఎన్ని శుభాలనిచ్చాడమ్మా!" అని అన్నారు.

"ఏమిటా శుభాలు" అనడిగారు ఉమ్మె రూమాన్ ఏమీ అర్థంకాక. "మీ ఆయిషా సంబంధం కోరి దైవప్రవక్త (స) నన్ను మీ దగ్గరకు పంపించారు."

"అమ్మాయి ఆయిషా దైవప్రవక్త కోసం ధర్మసమ్మతం అవుతుందంటావా! ఆమె ఆయనకు సోదరుని కుమార్తె కదా" అంటూ సందేహాన్ని బయటపెట్టారు ఉమ్మె రూమాన్.

ఖౌలా ఈ విషయాన్ని మహాప్రవక్త(స)కు వినిపించారు. దానికి ఆయన, "అబూబకర్ నాకు ధార్మికంగా సోదరుడేకాని బంధుత్వం రీత్యా ఆయన కుమార్తె నాకు ధర్మసమ్మతమే అని చెప్పు" అని చెప్పి పంపారు ఖౌలా(ర)ను.

హజ్రత్ అబూబక్ర్‌కు ఇదే మాటను వినిపించారు ఖౌలా. హజ్రత్ అబూబక్ర్ ఆమెను కొంచెం ఆగమని చెప్పి బయటకు వెళ్ళిపోయారు. ఆయన బయటకు వెళ్ళిన తరువాత, ఉమ్మె రూమాన్ (ర) ఖౌలాతో, 'ముత్ఇమ్ బిన్ అదీ' తన కుమారుని కోసం ఆయిషాను అడిగాడు. దైవసాక్షిగా చెబుతున్నాను. అబూబక్ర్ ఎప్పుడూ ఆడినమాట తప్పలేదు. అందుకే ఆయన అక్కడికి వెళ్ళారు" అని చెప్పారు.

హజ్రత్ అబూబక్ర్ 'ముత్ఇమ్ బిన్ అదీ' ఇంటికి వెళ్ళినప్పుడు ఆయన దగ్గరనే ఆయన భార్య కూడా కూర్చుని ఉంది. అబూబక్ర్‌ను చూడగానే, "అబూబక్ర్ ఒకవేళ మేము మీ అమ్మాయినే గనక పెళ్ళి చేసుకొని వస్తే మా అబ్బాయిని కూడా ధర్మభ్రష్టునిగా చేస్తావేమో అని భయంగా ఉంది" అని పలికింది. దానికి అబూబక్ర్ ముత్ఇమ్‌ను చూసి, "ఈమె చెప్పేదే నీ అభిప్రాయం కూడానా?" అని అడిగారు.

"అవును. ఈమె సందేహం నిజమే గదా" అని అన్నాడు ముత్ఇమ్. ఈ సమాధానం విన్న హజ్రత్ అబూబక్ర్ (ర) అక్కడి నుండి బయలుదేరి సరాసరి ఇంటికి వచ్చేశారు.

ముత్ఇమ్‌తో చేసిన వాగ్దాన బంధం నుండి అల్లాహ్ ఆయనకు ఈ విధంగా విముక్తినిచ్చాడు. ఇంటికి రాగానే వేచి ఉన్న ఖౌలాతో నువ్వు వెళ్ళి దైవప్రవక్త(స)ను వెంటబెట్టుకొని రా అని చెప్పి పంపేశారు. మహాప్రవక్త (స) తన ఇంటికి రాగానే అబూబక్ర్ (ర) హజ్రత్ ఆయిషా (ర) నికాహ్ ఆయనతో చేసివేశారు. అప్పుడు ఆమె వయస్సు ఆరేళ్ళు.

ఆ తరువాత ఖౌలా బయలుదేరి, జమ్ఆ కుమార్తె సౌదా (ర) ఇంటికి వెళ్లారు.

"ఎంత అదృష్టవంతురాలివమ్మా సౌదా నువ్వు. అల్లాహ్ నీపై తన శుభాలను వర్షింపజేస్తున్నాడు" అని పలికారు. సౌదా (ర)కు విషయం అర్థం కాలేదు. "ఏమిటీ నీవనేది" అని ప్రశ్నించారామె. "మహాప్రవక్త (స) తన కోసం నీ సంబంధం మాట్లాడమని నన్ను పంపించారు" అన్నారామె జవాబుగా.

"మా నాన్నగారిని అడిగి చూడు. ఆయనేమంటారో" అన్నారు సౌదా.

సౌదా (ర) తండ్రి చాలా వృద్ధుడు. ఖౌలా ఆయన దగ్గరకు వెళ్ళారు. అజ్ఞాన కాలంనాటి పద్ధతిలో ఆయనకు సలాం చేసి తనను పరిచయం చేసుకున్నారు. "ముహమ్మద్ బిన్ అబ్దుల్లాహ్ (స) తన కోసం మీ అమ్మాయిని అడగమని పంపారండి" అని అన్నారు.

"జోడీ అయితే బాగానే ఉందిగాని అసలు ఆమె ఏమంటుందో తెలుసుకున్నావా?" అని అడిగాడు జమ్అ. సౌదా కూడా ఈ సంబంధాన్ని ఒప్పుకొంటోంది అని ఖౌలా చెప్పగా ఆమెను పిలిపించి ఆమె ఇష్టాయిష్టాలను తెలుసుకున్నాడు జమ్అ. ఆ వెంటనే మహాప్రవక్త(స)ను తన ఇంటికి పిలిపించుకొని వారిద్దరి నికాహ్ చేశాడు సౌదా తండ్రి. ఆ తరువాత హజ్‌యాత్ర నుండి తిరిగి వచ్చిన సౌదా (ర) సోదరుడు అబ్‌ద్ బిన్ జమ్అ, సౌదా పెళ్ళి దైవప్రవక్త(స)తో జరిగినందుకు ఎంతో ఉగ్రుడై తన నెత్తి మీద దుమ్ము పోసుకున్నాడు. అయితే ఆయన ఇస్లామ్ స్వీకరించిన తరువాత ఈ విషయం గురించి చెబుతూ, "నేనెంత మూర్ఖుడ్ని! అప్పుడు నా సోదరి వివాహం దైవప్రవక్త(స)తో జరిగినప్పుడు నా నెత్తిన దుమ్ము పోసుకున్నాను!" అని విచారం వ్యక్తం చేసేవాడు.

(ఇమామ్ అహ్మద్, తిబ్రాని, ఇబ్నెజరార్, బైహఖి.) సీరతె సర్వరె ఆలం, సంపుటి-2 సౌజన్యంతో)

## హజ్రత్ ఆయిషా(ర)తో నికాహ్- కొన్ని విమర్శలు

ఇక్కడ హజ్రత్ ఆయిషా (ర) నికాహ్ ప్రస్తావన వచ్చింది కాబట్టి, అంతిమ దైవప్రవక్త(స)తో జరిగిన ఈ నికాహ్‌పై వచ్చిన కొన్ని ఆక్షేపణలు, విమర్శలకు జవాబివ్వడం సబబుగా తోస్తోంది.

ఆ విమర్శల్లో ఒకటి, 50 ఏళ్ళ వయస్సులో ఓ ఆరేళ్ళ బాలికను పెళ్ళి చేసుకోవడం, (ఆ తరువాత నాలుగయిదేళ్ళకుగాని కాపురానికి వెళ్ళలేదు హజ్రత్ ఆయిషా) 18 ఏళ్ళ ప్రాయంలోనే ఆమెను వితంతువుగా వదలి వెళ్ళడం, అందునా ఖుర్‌ఆన్ ప్రకారం ఆమెకు ఎవ్వరితోనూ నికాహ్ జరిగే వీలు లేకపోవడం

అన్యాయం కాదా? (దైవం క్షమించుగాక) ఓ తొమ్మిదేళ్ళ అమ్మాయిపై దాంపత్య జీవన భారం వేయడం తగునా? అన్నది.

నిజానికి ఇలాంటి ఆక్షేపణలు, విమర్శలూ ఉద్భవించేది, దైవప్రవక్త (స) ఆయిషా (ర)ల నికాహ్‌ను కేవలం సాధారణ స్త్రీపురుషుల నికాహ్‌గా చూసినందువల్లనే. అలాకాక మహనీయ ముహమ్మద్ (స) దేవుని ప్రవక్త, మానవుని వ్యక్తిగత, సామూహిక జీవితంలో సార్వజనీన విప్లవాన్ని తెచ్చి సమాజాన్ని ఆ విప్లవానికనుగుణమైన బాధ్యత ఆయన భుజస్కంధాలపై ఉందనే విషయాన్ని దృష్టిలో ఉంచుకుని, అదే విధంగా హ(జత్ ఆయిషా (ర) అసాధారణ యువతి కాదు, ఆమెను ఓ ప్రవక్తకు, అందునా అంతిమ దైవప్రవక్త(స)కు భార్యగా, ఆ విప్లవోద్యమంలో భాగస్వామినిగా, ప్రవక్త తరువాత చాలా కాలం వరకు విశ్వాసులకు, వారి మహిళలకు మార్గదర్శకురాలిగా ఉండవలసిన అవసరాన్ని దృష్టిలో ఉంచుకుని మరీ గమనించాలి. ఆమె మేధాసంపత్తి కలిగిన యువతి. తన మేధాశక్తి, గతిశీల వ్యక్తిత్వం, సమస్యల్ని అర్థం చేసుకునే చాకచక్యం, వాటిని పరిష్కరించే నైపుణ్యం, కొత్తగా రూపుదాల్చుతున్న విప్లవసమాజానికి ఎంతో అవసరం.

ఆ మహా పురుషునికి భార్యగా, చేదోడువాదోడుగా నిలిచి, ఆయన కార్యసిద్ధి కోసం కృషి చెయ్యవలసిన అవసరమూ ఎంతో ఉంది. బాల్యావస్థలోనే ఆమె ప్రజ్ఞాపాటవాల్ని గుర్తించడం అల్లాహ్‌కు తప్ప మరెవరికి సాధ్యం? కాబట్టే దైవప్రవక్త (స) కోసం అల్లాహ్‌యే ఆమెను ఎంచుకున్నాడు అనడం సబబు. ఓ ఆరేళ్ళ బాలిక మహాప్రవక్త (స) సాన్నిధ్యంలో శిక్షణ పొంది ఇస్లామీయ సమాజ నిర్మాణంలో ఎలాంటి మహోన్నత సేవలందించగలదో అల్లాహ్‌కు బాగా తెలుసు.

పోతే, దాంపత్య జీవితానికి సంబంధించిన అంశంలో రెండు మాటలు చెప్పడం అవసరం.

తన పాతికేళ్ళ నిండు యవ్వనంలో తనకన్నా పదిహేనేళ్ళ పెద్ద అయిన వితంతువును పెళ్ళాడి యాభై ఏళ్ళ వయస్సు వరకు, ఆ ఒక్క భార్యతోనే దాంపత్య జీవితం సాగించిన మనిషి, ఆమె మరణానంతరం వయసుమళ్ళిన మరో వితంతువును పెళ్ళాడి ఆమెతోనే నాలుగయిదు సంవత్సరాలు కాపురం చేసిన

వ్యక్తి, ఆ తరువాత 55 ఏళ్ళ వయస్సులో అకస్మాత్తుగా దాంపత్యానికి నవ యవ్వన యువతి కావాలని అంటాడా? (దైవం మన్నించుగాక). ఆనాడు సమాజంలో ఆయనకు ఉన్న గౌరవం, మర్యాదల దృష్ట్యా ఆయన కోరుకుంటే ఎందరు కన్యల్ని సంతోషంగా స్వయంగా వారి తల్లిదండ్రులే తెచ్చి వివాహం చేసేవారు కారా? కాని ఆయన ఆ పెద్ద వయస్సులో చేసుకున్న ఆ ఒక్క కన్య తప్ప ఇతర వివాహాలన్నీ వితంతువులతోనో, విడాకులు పొందిన మహిళలతోనో జరిగాయి. ఈ యదార్థం చాలదా సత్యం తెలుసుకోగోరే విమర్శకుల కనువిప్పుకు?!

ఇక 'అన్యాయం' మాటకు వస్తే, ఇందులోనూ విమర్శకులు కేవలం స్థూలదృష్టితోనే విమర్శిస్తారని ద్యోతకమవుతుంది.

మానవాళికి ఒనగూడే ఓ మహోన్నత ప్రయోజనానికై, అందునా అది సర్వకాల సర్వావస్థలో సకల ప్రపంచానికి లభించవలసినదయితే ఆ కార్యసిద్ధి కోసం లక్షలాది మంది తమ ధనప్రాణాలను సయితం త్యజించవలసి వచ్చినా లేక కేవలం ఓ మహిళ యవ్వనం మాత్రమే అంకితం కావలసి వచ్చినా అది ఎంత ధన త్యాగమయినా, ప్రాణ త్యాగమయినా, యవ్వన త్యాగమయినా ఈ త్యాగాలను అన్యాయం అనగలమా? అందునా ఆ యవ్వనం త్యాగమయినా దాంపత్య సుఖాల వరకు మాత్రమేకాని ఇతరత్రా కాదు. కాని మరోవైపు, కుటుంబ జీవితంలోని అన్ని రకాల బాదరబందీల నుండి విముక్తి పొంది, తన పూర్తి జీవితాన్ని ఇస్లామీయ జీవిత విధానాన్ని సవివరంగా స్త్రీ పురుషులందరికీ బోధించడానికే అంకితం చేయగలిగారు. ఆ మహోన్నత వ్యక్తిత్వం అందజేసిన సేవలను అంచనావేయడం ఎవరి తరం? ఒకవేళ హజ్రత్ ఆయిషా (ర)యే దైవప్రవక్త(స)కు సతీమణి కాకపోతే, ఆమె ఉత్సాహం ఉత్తేజం సన్నగిల్లిన నడివయస్సు మహిళే అయితే మహాప్రవక్త (స) బోధించిన, ఆచరించిన అనేక ఆంతరంగిక, ధార్మిక ఉపదేశాలను ఆకళింపు చేసుకొనే వీలు లేకపోయేది. ముస్లిం సమాజం ఎంతో నష్టపోయేది. హజ్రత్ ఆయిషా (ర) ఒక్కరే మహాప్రవక్త (స) బోధించిన 2210 ప్రవచనాలను ఉల్లేఖించారు: ఈమె కేవలం హదీసుల్ని ఉల్లేఖించడమే కాదు, ధార్మిక నియమాలను, ఖుర్ఆన్ వ్యాఖ్యానాన్ని అందజేశారు.

ఖుర్ఆన్, హదీసుల వెలుగులో సమస్యల్ని పరిష్కరించేవారు. ధార్మికతీర్పు (ఫత్వా)లను ఇచ్చేవారు. ముస్లిం మహిళల్లో ఆమె ఒక్కరే ఆనాడు ధార్మికతీర్పులు చేప్పే మహిళగా గుర్తించబడ్డారు. గొప్ప గొప్ప సహాబీలు (ప్రవక్త అనుచరులు) ఆమె వద్దకు వచ్చి సమస్యల పరిష్కారం అడిగేవారు. అంతేకాదు హజ్రత్ ఉమర్, హజ్రత్ ఉస్మాన్ (ర) లాంటి ఖలీఫాలు సయితం కొన్ని సమస్యల పరిష్కారం కోసం ఆమె దగ్గరకు రావడం జరిగేది. మదీనాలో అనాడు ప్రజల విశ్వాసం చూరగొన్న ధర్మవేత్తల్లో ఆమె కూడా ఒకరు. ఇలాంటి అమూల్యమయిన సామూహిక ప్రయోజనాల ముందు ఆమె యవ్వనంలోనే వితంతువు కావడం వల్ల జరిగిన నష్టానికి విలువెంత?

తొమ్మిదేళ్ళ ప్రాయంలోనే హజ్రత్ ఆయిషా (ర) కాపురానికి పోవడాన్ని విమర్శించేవారు, ఇస్లాం ప్రకృతి సిద్ధమయిన ధర్మం అనే విషయాన్ని మరచి పోతున్నారు. సహజంగా ఏ బాలిక తన శారీరక పెరుగుదల ద్వారా యువతిగా కనబడుతుందో ఆమె తన భర్త దగ్గరకు వెళ్ళి కాపురం చేయడం ధర్మసమ్మతం, బుద్ధికి అందే విషయం. కేవలం అసహజమయిన, అనైతికతా ప్రాతిపదికగా తయారైన చట్టం మాత్రమే నికాహ్ (పెళ్ళి) కోసం ఓ అబ్బాయికి, అమ్మాయికి వయస్సు నిర్ణయిస్తుంది.

ఇలాంటి చట్టం, ధర్మసమ్మతమైన దాంపత్య సంబంధాలపైన్నే నిషేధం పెట్టగలదుగాని, పెళ్ళికాని స్త్రీ పురుషుల పరస్పర అక్రమ సంబంధాలపై మాత్రం ఎలాంటి నిషేధం పెట్టలేదు. ఈ విషయం ఇంతమట్టుకే ఆగిపోదు. ఇలాంటి చట్టాల్ని చేసేవారికి తాము నిర్ణయించిన 'పెళ్ళివయస్సు' రాని పురుషులకు, స్త్రీలకు నడుమ పరస్పరం ఉండే లైంగికసంబంధాలపై ఎలాంటి నిషేధం పెట్టాలని తోచదు. ఎలాంటి ఆక్షేపణలను లేవనెత్తరు. సరికదా ప్రాక్టికల్‌గా తొమ్మిది, పదేళ్ళ బాలబాలికలు విశృంఖలంగా లైంగిక కార్యకలాపాల్లో లీనమై, తత్ఫలి తంగా ఏ కన్య అయినా తల్లిగా మారితే, వీరంతా ఆమెకే సానుభూతి చూపిస్తారు. అప్పుడు ఎలాంటి విమర్శగాని, ఆక్షేపణగాని, పెళ్లీడుకంటే ముందే తల్లి అయిన అమ్మాయిపైగాని, ఆమెను తల్లిగా మార్చిన అబ్బాయిపైగాని విమర్శనాస్త్రాలు సంధించరు.

ఇలాంటి నీచమైన నైతిక విలువలు కలిగి ఉన్నవారు, ఏ బాలురు లేక ఏ బాలికలైతే శారీరకంగా ఎదిగారో వారికి పెళ్ళి చేయడం ధర్మసమ్మతమనీ, దాని కోసం ఓ ప్రత్యేక వయస్సు అవసరం లేదనే ఇస్లామీయ సహజచట్టాన్ని ఏ ముఖం పెట్టుకొని విమర్శించగలరు? పెళ్ళి కోసం చట్టబద్ధంగా వయస్సును నిర్ణయించటం అంటే వారి దృష్టిలో, ఆ వయస్సు కంటే ముందు ధర్మసమ్మతంగా పెళ్ళి చేసుకోవటం కుదరదు, పెళ్ళికాకుండా మాత్రం ఎంతైనా చెడు తిరుగుళ్ళకు పాల్పడవచ్చు అనేకదా వీరి భావం? (సీరతె సర్వరె ఆలం: వాల్యూమ్-2)

## దైవప్రవక్త - మదీనాలో

నిన్నటిదాకా మక్కాలో వెలిగిన దైవదౌత్య జ్యోతి, నేడు మదీనాలో వెలుగు విరజిమ్ముతోంది. అక్కడి చెట్టుపుట్టలు సయితం ఆ సత్యధ్వజవాహకుణ్ణి దర్శించు కుంటున్నాయి. యస్రిబ్ (మదీనా) వాసులు తమ అదృష్టానికి సంబరపడి పోతున్నారు. ఎవరి ఆగమనశుభవార్త శతాబ్దాల తరబడి నుండి ఇవ్వబడుతూ వచ్చిందో ఆ మహానాయకుడు నేడు మదీనా నగరంలో ప్రత్యక్షం అయ్యాడు.

మదీనా నగరానికి వచ్చిన తరువాత, మహాప్రవక్త ముహమ్మద్ (స) ముందుగా తన స్వంత ఇంటి నిర్మాణం గురించి కాకుండా దైవగృహ నిర్మాణం గురించి ఆలోచించారు.

హ(జత్ అనస్ బిన్ మాలిక్ (ర) ఇలా తెలిపారు:

"దైవప్రవక్త (స) మదీనాకు వచ్చి మదీనా నుంచి కొన్ని మైళ్ళ దూరంలో ఉన్న బనూ అమ్ర్ బిన్ అవుఫ్ వాడలో విడిదిచేశారు. పదునాల్గు రాత్రులు ఆయన అక్కడే ఉన్నారు. ఆ తరువాత బనూనజ్జార్ నాయకుల్ని పిలిపించారు. వారంతా ఖడ్గధారులై ఆయన ముందుకొచ్చి నిలుచున్నారు. ఈ రోజు కూడా ఆ దృశ్యం నా కళ్ళకు కట్టినట్లు కనబడుతోంది. దైవప్రవక్త (స) తన ఒంటెపై కూర్చొని ఉన్నారు. అబూబక్ర్ (ర) ఆయన వెనుకనే కూర్చున్నారు. బనూనజ్జార్ సర్దారులు వృత్తాకారంలో నిలబడి వారిద్దరిని తమ సంరక్షణలోనికి తీసుకున్నారు. అలా దైవప్రవక్త (స) (బనూ అమ్ర్ బిన్ ఔఫ్ వాడ నుండి బయలుదేరి) అబూ అయ్యూబ్ అన్సారి (ర) ప్రాంగణంలోకి అడుగుపెట్టారు. ప్రవక్త మహనీయులు(స) ఎక్కడ నమాజు వేళయితే అక్కడ నమాజు చేయడం పరిపాటి. ఆయన మేకల

కొట్టంలో కూడా నమాజు చేశారు. ఆ తరువాత దైవం తరఫున మస్జిద్ నిర్మించే ఆజ్ఞ ఇవ్వబడింది. అప్పుడు ఆయన బనూనజ్జార్ సర్దారులందరిని పిలిపించారు. వారంతా హాజరైన తరువాత "బనూ నజ్జార్ సర్దారుల్లారా! మీరు ఈ తోటను నాకు అమ్మేయండి" అని అన్నారు. దానికి సర్దారులంతా "లేదు దైవప్రవక్తా! దైవసాక్షి! మేము దీని విలువను మీ దగ్గర నుండి కాక దైవం నుండే తీసుకుంటాం" అని అన్నారు.

హజ్రత్ అనస్ (ర)గారి ఉల్లేఖనం ప్రకారం ఆ తోటలో ఖర్జూరపు చెట్లూ ఉన్నాయి, బహుదైవారాధకుల గోరీలూ ఉన్నాయి. మరికొంత భూమి బీడుగా పడిఉంది. దైవప్రవక్త (స) ఆ ఖర్జూరపు చెట్లను కొట్టించారు. బహుదైవారాధకుల గోరీలను పెరికివేయించారు. శిథిలాలు త్రవ్వించి భూమిని చదును చేయించారు. ఖిబ్లా దిశ వైపు ఖర్జూరపు దుంగల్ని వరుసగా పెట్టించి రాతి గుమ్మాల్ని పెట్టించారు. మస్జిద్ నిర్మాణ సమయంలో ప్రజలు ప్రార్థనతో కూడిన ఈ గీతం ఆలపిస్తూ ఉండేవారు. "ఓ అల్లాహ్! శుభం అంటే పరలోక శుభమే. దేవా! అన్సార్, మహాజిర్లకు సహాయం చెయ్యి." (ముస్లిమ్)

## స్వర్గలోక మహారాణిగారి గృహం

దైవగృహ నిర్మాణం పూర్తి అయిన తరువాత ఆ దైవగృహమైన 'మస్జిదె నబవీ' ప్రక్కనే మహాప్రవక్త (స) కోసం రెండు గదులు నిర్మించారు. వాటిలో ఒకటి ఉమ్ముల్ మోమినీన్ హజ్రత్ ఆయిషా (ర) గారి గది. రెండోది ఉమ్ముల్ మోమినీన్ హజ్రత్ సౌదా (ర) గారి గది.

ఆ ఇళ్ళు పచ్చి ఇటుకలవి. ఖర్జూరపు తడికలపై మట్టి పూసి రెండు గదులు వేరుచేయడం జరిగింది. పై కప్పు కూడా ఖర్జూరపు ఆకులదే. తలుపులపై పరదాగా గొంగళ్ళు వేయబడ్డాయి. (ఇబ్నె సఅద్)

ఈ ఇళ్ళు ఆరేసి మూరల వెడల్పు, పదేసి మూరల పొడవు కలిగి ఉన్నాయి. పైకప్పు ఒక మనిషి నిలబడి అందుకునేంత ఎత్తు మాత్రమే ఉండింది. (ఇబ్నె సఅద్)

ఆ ఇళ్ళలో రాత్రులు దీపాలు వెలిగేవి కావు. (బుఖారి)

మొట్టమొదట రెండే గదులు తయారయ్యాయి. ఆ తరువాత ఇతర సతీమణులు వస్తున్న కొద్ది మరికొన్ని గదులు తయారవుతూపోయాయి.

చివరి రోజులలో మహాప్రవక్త (స)కు తొమ్మిది మంది సతీమణులు ఉన్నారు. వారంతా వేరు వేరు గదుల్లోనే ఉండేవారు. ఆ గదుల్లో వరండాలుగాని, వాకిళ్ళుగాని లేవు. అదే విధంగా ఇతర అవసరాలకు వేరుగా ఇంకే గదులూ లేవు. ప్రతి గది పొడవు వెడల్పులు ఆరేడు మూరలకంటే ఎక్కువగా లేవు. ఇక గోడల విషయానికొస్తే అవి మట్టితో తయారై ఎంత బలహీనంగా ఉండేవంటే వాటి బీటల ద్వారా లోనికి ఎండ వస్తూ ఉండేది. కప్పు ఖర్జూరపు మట్టలతోను, ఆకులతోను కప్పబడింది. వర్షం నుండి రక్షణ పొందడానికి అక్కడక్కడ గొంగళ్ళు చుట్టబడి ఉండేవి. ఆ కప్పుల ఎత్తు విషయానికి వస్తే ఒక మనిషి నిలబడి చేతితో తాకేఅంత ఎత్తు మాత్రమే ఉండేవి. ఇంటి ద్వారాలకు పరదాగాని లేక ఒక రెక్కగల తలుపుగాని ఉండేది.

(అదబుల్ ముఫ్రద్, బుఖారి–సీరతున్నబి సంపుటం. 2)

ఆ హుజ్రాలే (గదులే) కాకుండా పై అంతస్తు లా వారి మీద నుంచి గది కూడా ఉండేది. దాన్ని హదీసుల్లో 'మష్రబా' అని చెప్పబడింది. ఆపై గదిలో ఏముండేది? ఓ చాప, ఖర్జూరపు పీచుతో నిండిన ఓ తోలుదిండు, అక్కడక్కడ కొన్ని చర్మాలు వ్రేలాడుతూ ఉండేవి. (బుఖారి–సీరతున్నబి, సంపుటం–2)

ప్రవక్త(స) ఇంటి ఆస్తి అంతా ఓ మంచం, ఓ చాప, ఓ పక్కచుట్ట, ఖర్జూరపు పీచుతో నిండిన ఓ దిండు, పిండి, ఖర్జూరాలు నిలువ ఉంచుకోడానికి రెండు మట్టికుండలు, ఓ నీళ్ళపాత్ర, నీళ్ళు త్రాగే గ్లాసు మాత్రమే. హజ్రత్ ఆయిషా (ర) ప్రవచనం ప్రకారం, నలభైయేసి రోజులదాకా ఇంట్లో దీపం కూడా వెలిగేది కాదు. (ముస్నద్ తియాలసీ)

## హజ్రత్ ఆయిషా (ర) గారి హిజ్రత్

మహాప్రవక్త (స) తమ భార్యాపిల్లలను పిలుచుకొని రావడానికి హజ్రత్ జైద్ బిన్ హారిసా(ర)ను, అబూ రాఫె (ర) అనే తన బానిసను మక్కాకు పంపించారు. హజ్రత్ జైద్ (ర) తన వెంట సయ్యిదా ఫాతిమా జహ్రా (ర),

సయ్యిదా ఉమ్మె కుల్సూమ్ (ర), ఉమ్ముల్ మోమినీన్ హజ్రత్ సౌదా (ర)లను వెంట పిలుచుకు వచ్చారు.

హజ్రత్ అబూబక్ర్ (ర) తన భార్యాపిల్లల్ని వెంటబెట్టుకొని రావడానికి అబ్దుల్లా బిన్ అర్‌ఖీత్‌ను మక్కాకు పంపించారు. అబ్దుల్లా హజ్రత్ అబూబక్ర్ సిద్దీఖ్ (ర) కుటుంబాన్ని వెంటబెట్టుకొని మక్కా నుండి మదీనా బయలుదేరారు. ఈ కుటుంబంలో హజ్రత్ అబూబక్ర్ భార్య ఉమ్మె రూమాన్(ర), హజ్రత్ ఆయిషా (ర), ఆమె సోదరి హజ్రత్ అస్మా (ర) కూడా ఉన్నారు. ఈమె జుబైర్ బిన్ అవ్వామ్ (ర) భార్య. అప్పుడు ఆమె గర్భవతి. అంటే హజ్రత్ అబ్దుల్లా బిన్ జుబైర్ (ర) పుట్టబోతున్నారన్న మాట.

హజ్రత్ ఆయిషా (ర) ఉల్లేఖనం ప్రకారం, ఆమె, ఆమె తల్లి ఉమ్మె రూమాన్ (రజిఅన్) ఒంటెపై కూర్చున్నారు. అకస్మాత్తుగా ఆ ఒంటె బెదిరి పోయింది. ఉమ్మె రూమాన్(ర) తల్లి భయపడి, "ఆమె నా కుమార్తె, నవ వధువు, (వధువు అంటే ఉమ్ముల్ మోమినీన్ హజ్రత్ ఆయిషా (ర) అన్నమాట. ఆమె ఇంకా కాపురానికి వెళ్ళలేదు) అని కేకలు పెట్టారు. దాంతో ఆ ఒంటె నిమ్మళించింది.

హజ్రత్ ఆయిషా (ర) గారి మరో ఉల్లేఖనంలో ఇలా ఉంది: "మా తల్లి, అయ్యో! నా కూతురు నవవధువు అని కేకలు పెట్టగానే 'ఒంటె పగ్గాల్ని వదిలేయండ'ని ఓ అదృశ్యవాణి విన్పించింది. ఆమె వెంటనే పగ్గాలు వదిలేశారు. దైవాజ్ఞతో ఒంటె శాంతించింది; మాకు రక్షణ చేకూరింది." (సీరతె హల్‌బియా)

## తాత్కాలిక నివాసం

"హజ్రత్ ఆయిషా సిద్దీఖా (ర) తమ బంధువులతో బనూ హారిస్ బిన్ ఖజ్‌రజ్ వాడలో దిగారు. ఏడెనిమిది నెలలు తమ తల్లి హజ్రత్ ఉమ్మె రూమాన్ (ర) దగ్గరే ఉన్నారు." (అబూ దావూద్)

## హజ్రత్ ఆయిషా (ర) కాపురానికి

హిజ్రత్ జరిగిన సంవత్సరమే హజ్రత్ ఆయిషా (ర) మహాప్రవక్త (స) ఇంట కాపురానికి వెళ్ళారు. హజ్రత్ ఆయిషా (ర) ఇలా ఉల్లేఖించారు: "కాపురానికి

వెళ్ళే రోజు మా ఇంటికి దైవప్రవక్త (స) వచ్చారు. వారి చుట్టూ అన్సార్ స్త్రీ పురుషులు చేరారు. అప్పుడు నేను ఊయలలో ఊగుతున్నాను. మదీనా వచ్చిన తరువాత నేను జబ్బు పడడం వల్ల నా తల వెంట్రుకలు చెల్లాచెదురుగా ఉన్నాయి."

హ[జత్ బరా (ర) ఉల్లేఖించారు: "ఓ రోజు నేను హ[జత్ అబూబక్ర్(ర) ఇంటికెళ్ళాను. అప్పుడు హ[జత్ ఆయిషా(ర) తండ్రి హ[జత్ అబూబక్ర్(ర) తన కుమార్తెని ముద్దాడి అమ్మా భయపడకు అని ధైర్యం చెప్పారు."

హ[జత్ ఆయిషా సిద్దీఖా (ర) ఇలా ప్రవచించారు: "ఈ వ్యాధి వల్ల నా వెంట్రుకలు చెదరిపోయి చిందరవందరగా ఉన్నాయి. వాటిని మా తల్లి దువ్వి జడవేశారు. తరువాత నా ముఖం కడిగారు. ఆ తరువాత నన్ను పట్టుకొని నడిపిస్తూ తలుపు దగ్గరకు వచ్చి నా శ్వాస బాగా ఆడడం వలన నిలబడిపోయారు. నా ఉఛ్వాసనిశ్వాసాలు కాస్త స్థిమితపడిన తరువాత నన్ను లోనికి తీసుకొని వెళ్ళారు. అక్కడ మా ఇంట్లో బల్లపై దైవప్రవక్త (స) కూర్చుని ఉండడం, ఆయన చుట్టూ చాలామంది అన్సార్ స్త్రీపురుషులు గుమిగూడి ఉండడం చూశాను. నా తల్లి నన్ను దైవప్రవక్త (స) ప్రక్కన కూర్చోబెట్టి 'ఈయన నీ భర్త, అల్లాహ్ నిన్ను ఆయనతో, ఆయనను నీతో సుఖంగా ఉంచుగాక!' అని చెప్పి వెళ్ళిపోయారు. అప్పుడే అందరూ బయటకు వెళ్ళిపోయారు. దైవప్రవక్త (స) ఆ రోజు మా ఇంట్లోనే నాతో గడిపారు."

'ఇస్తీయాబ్' గ్రంథంలోను హ[జత్ ఆయిషా (ర) ఉల్లేఖనం ఒకేలా ఉంది: "ఓసారి హ[జత్ అబూబక్ర్ (ర) దైవప్రవక్త(స)ను ఉద్దేశించి, 'దైవ ప్రవక్తా! మీరు మీ సతీమణిని కాపురానికి ఎందుకు తీసుకెళ్ళరూ?' అని అడిగారు. దానికి దైవప్రవక్త(స), 'మహ్ర్ ధనం లేదు గనక' అని బదులిచ్చారు. అప్పుడు హ[జత్ అబూబక్ర్(ర) పన్నెండున్నర 'ఓకయా' (ధనం)లను సమర్పించారు. ఆయన ఈ సొమ్మును మా ఇంటికి పంపించేశారు. ఆ తరువాత నేనుంటున్న ఈ ఇంట్లోనే గడిపారు నాతో. ఈ ఇంటిలోనే దైవప్రవక్త (స) పరమదించారు. ఇందులోనే ఆయన్ని ఖననం చేయడం జరిగింది."

## నీ ఆగమనం ఎంత శుభదాయకం!

మరో ఉల్లేఖనంలో హజ్రత్ ఆయిషా (ర) ఇలా ఉల్లేఖించారు:

"కాపురానికి వెళ్ళేనాడు నేను కొందరు చెలికత్తెలతో ఊయల ఊగుతున్నాను. అప్పుడే మా తల్లిగారు వచ్చి బిగ్గరగా పిలిచారు. ఆమెకు ఏం కావాలో నాకు అర్థం కాలేదు. నా రెక్క పట్టుకొని గది తలుపు దాకా తీసుకొనివచ్చి ఆగారు. ఉచ్ఛ్వాసనిశ్వాసాలు స్థిమితపడిన తరువాత నా తల, ముఖం కడిగి గది లోనికి ప్రవేశించారు. అక్కడ కొందరు అన్సారీ స్త్రీలు కూర్చుని ఉన్నారు. వారు నన్ను చూడగానే, 'నీ ఆగమనం శుభదాయకమగుగాక!' అంటూ దీవించారు. అప్పుడు మా తల్లిగారు నన్ను ఆ స్త్రీలకు అప్పజెప్పారు. వారు నన్ను సింగారించారు. ఆ తరువాత చాష్త్ సమయంలో దైవప్రవక్త (స) నన్ను చూశారు. మా తల్లిగారు నన్ను ఆయనకు అప్పజెప్పారు. అప్పుడు నా వయసు తొమ్మిదేళ్ళు."

(సీరతె హల్బియా)

## నికాహ్

హజ్రత్ ఆయిషా సిద్దీఖా (ర) ఇలా అన్నారు: "దైవప్రవక్త (స) షవ్వాల్ నెలలో నన్ను నికాహ్ చేసుకున్నారు. షవ్వాల్ నెలలోనే నాతో కాపురం పెట్టారు. దైవప్రవక్త(స) భార్యలలో అదృష్టవంతురాలు, దైవప్రవక్త(స) దృష్టిలో ప్రియమయిన వారు నాకంటే ఇంకెవరూ లేరు." (ముస్లిం)

## మహ్ర్

అబూ సల్మా బిన్ అబ్దుర్రహ్మాన్(ర) ఇలా అంటున్నారు: "నేను ఆయిషా (ర)ను 'ప్రవక్త భార్యాల మహ్ర్ ఎంత ఉండేదని" అడిగాను. హజ్రత్ ఆయిషా (ర) జవాబుగా, 'ప్రవక్త భార్యల మహ్ర్ పన్నెండు 'ఓకియాల'పై అర 'నష్' ఉండేది' అని అన్నారు. 'నష్ అంటే ఏమిటో తెలుసా?' అని నన్నడిగారు. 'తెలీదు' అన్నాను నేను. 'నష్ అంటే సగం ఓకియా అని అర్థం. ఇవన్నీ కలిపి అయిదు వందల దిర్హంలు అవుతాయి. ఇదే దైవప్రవక్త (స) తమ భార్యలకిచ్చిన మహ్ర్' అని అన్నారు ఆమె."

# వలీమా

హజ్రత్ ఆయిషా (ర) ఉల్లేఖనం ప్రకారం, "ఆమెతో తొలిరేయి గడిపిన సందర్భంగా దైవప్రవక్త (స) ఎలాంటి వలీమా చేయలేదు. అయితే హజ్రత్ సఅద్ బిన్ ఉబాదా (ర) దగ్గర నుండి ఓ పాత్రలో పాలు కానుకగా వచ్చాయి. అందులో నుండి దైవప్రవక్త (స) కొంత తాగిన తరువాత మిగిలింది ఆమె తాగేశారు." (సీరతె హల్‌బియా)

హజ్రత్ ఆయిషా (ర) స్నేహితురాలు హజ్రత్ అస్మా (ర) బిన్తె యజీద్ ఇలా చెబుతున్నారు: "నేను అప్పుడక్కడనే ఉన్నాను. దైవప్రవక్త (స) పాత్రలో నుండి కొంచెం పాలు త్రాగి మిగిలింది హజ్రత్ ఆయిషా(ర)కు అందించబోగా ఆమె సిగ్గుపడ్డారు. అప్పుడు నేను ఆమెతో, 'దైవప్రవక్త (స) ఇచ్చిన కానుకను వాపసు చేయకు' అన్నాను. అప్పుడు ఆమె సిగ్గుపడుతూ దాన్ని తీసుకొని కొంచెం పాలు తాగి పాత్ర కింద పెట్టేశారు. దానికి దైవప్రవక్త (స) 'నీ స్నేహితురాళ్ళకు కూడా ఇవ్వు' అన్నారు. దానికి నేను, 'దైవప్రవక్తా(స) ఇప్పుడు నాకు ఆకలిగా లేదు' అని అన్నాను. అప్పుడు దైవప్రవక్త(స) 'అబద్ధమాడకు, మనిషి పలికే ఒక్కొక్క అసత్యం రాయబడుతూ ఉంటుంది' అని అన్నారు." (ముస్నదె అహ్మద్)

# సులైమాన్ (అ)గారి గుర్రం

హజ్రత్ ఆయిషా సిద్దీఖా (ర) దైవప్రవక్త (స) వద్దకు కాపురానికి వచ్చినప్పుడు ఆమె ఆటబొమ్మలూ ఆమె దగ్గరే ఉన్నాయి. హజ్రత్ ఆయిషా (ర) ఉల్లేఖనం ప్రకారం, దైవప్రవక్త(స) దగ్గరకు వచ్చిన తరువాత ఆమె తన బొమ్మలతో ఆడుకునేవారు. తరచూ దైవప్రవక్తే (స) బాలికల్ని పిలిపించి హజ్రత్ ఆయిషా(ర) దగ్గరకు ఆటలాడుకునేందుకు పంపేవారు.

హజ్రత్ ఆయిషా (ర) ఇలా ఉల్లేఖిస్తున్నారు: "ఓసారి దైవప్రవక్త (స) తబూక్ లేక హునైన్ యుద్ధం నుండి తిరిగి వచ్చారు. అప్పుడు గాలి అతి వేగంగా వీస్తోంది. అకస్మాత్తుగా గాలి ఉధృతికి ఇంట్లోని నా ఆటబొమ్మల పైనున్న వస్త్రం లేచిపోయింది. బొమ్మల ఆకారాలు కనబడ్డాయి. దైవప్రవక్త(స) వాటిని

చూసి 'ఇవేమిటీ' అని అడిగారు. నేను, 'ఇవి నా బొమ్మలండీ' అన్నాను. ఆ బొమ్మల్లో ఓ గుఱ్ఱం నిలబడి ఉంది. దానికి రెండు రెక్కలు ఉన్నాయి. దైవప్రవక్త (స) 'ఈ గుఱ్ఱానికి రెక్కలేమిటీ?' అని అడిగారు. దానికి నేను, 'హజ్రత్ సులైమాన్ (అ)గారి గుఱ్ఱానికి రెండు రెక్కలుండేవి అన్న విషయం మీరు వినలేదా?' అని అన్నాను. ఇది విన్న దైవప్రవక్త(స) ఫక్కున నవ్వేశారు. ఆ నవ్వుకు ఆయన మునిపల్లు బయటకు తొంగి చూశాయి. (సీరతె హల్బియా)

## నా బాల్యం

హజ్రత్ ఆయిషా (ర) ఇలా అంటూ ఉండేవారు: "ఖమర్ సూరాలోని 'బలిస్సాఅతు మౌఇదుహుం వస్సాఅతు అద్హా వ అమర్ అనే ఆయత్ అవతరించినప్పుడు నేను ఆడుకుంటున్నాను." (బుఖారి)

## నా వస్త్రాలు

ఇతర భార్యలకు ఏ వస్త్రాలుండేవో ఆ వస్త్రాలే హజ్రత్ ఆయిషా (ర)కూ ఉండేవి. ఈ విషయంలో ఆమె ఇలా సెలవిచ్చారు: "ప్రవక్త భార్యలందరికీ ఒక్కొక్క జత బట్టలే ఉండేవి." (బుఖారి)

దైవప్రవక్త (స) కారుణ్య ఛాయలో మన మాతృమూర్తి హజ్రత్ ఆయిషా (ర) ఇలా జీవితం గడిపారు. నేడు ఇలాంటి జీవితాన్ని ఊహించగలమా మనం?

## ఒక్కోసారి నెల రోజులదాకా పొయ్యి రాజుకునేదే కాదు

ఉమ్ముల్ మోమినీన్ హజ్రత్ ఆయిషా (ర) ఇలా చెబుతున్నారు: "మేము అంటే (ప్రవక్త ఇంటి వారం) ఒక్కోసారి నెల రోజుల వరకు పొయ్యి రాజేసేవారం కాదు. ఖర్జూరాలు తిని, నీరు తాగి అలా రోజులు గడిచిపోయేవి." మరో ఉల్లేఖనం ప్రకారం, "ఎప్పుడయినా ఎవరయినా మాంసం పంపినప్పుడు తప్ప." (ముస్లిం)

ఉర్వా (ర) ఇలా ఉల్లేఖిస్తున్నారు: "హజ్రత్ ఆయిషా (ర) నాతో, ఓ మేనల్లుడా! దైవసాక్షి! మేము రెండు నెలల్లో మూడు నెలపొడుపుల్ని చూసేవారం.

దైవప్రవక్త (స) ఇండ్లలో ఆ కాలంలో అగ్నే మండేది కాదు. నేనడిగాను, మరెలా జీవితం గడిచేదని. హజ్రత్ ఆయిషా (ర) ఇలా అన్నారు: 'రెండు నల్లటి వస్తువులు తప్ప, (అంటే ఖర్జూరం, నీరు). అయితే మా పొరుగున ఉండే కొందరు అన్సారీల దగ్గర పాడి ఒంటెలుండేవి. వారు అప్పుడప్పుడు వాటి పాలు దైవప్రవక్త(స)కు పంపించేవారు, దైవప్రవక్త(స) ఆ పాలను తాగడానికి మాకిచ్చేవారు." (ముస్లిం)

## గోధుమ రొట్టె కడుపు నిండా తినలేదు

ఉమ్ముల్ మోమినీన్ హజ్రత్ ఆయిషా(ర) ఇలా అన్నారు: "మదీనాకు వచ్చిన తరువాత దైవప్రవక్త(స) ఇంటివారు ఎప్పుడూ వరుసగా మూడు రోజులపాటు గోధుమ రొట్టె కడుపునిండా తినలేదు." మరో ఉల్లేఖనం ప్రకారం, "ప్రవక్త ఇంటివారు రెండు రోజులు కూడా గోధుమ రొట్టె కడుపు నిండా ఎప్పుడూ తినలేదు. ఒక్కోరోజు కేవలం ఖర్జూరాలు తినే గడపవలసి వచ్చేది." (ముస్లిం)

## ఇంట్లో నీరు తప్ప ఏదీ ఉండేది కాదు

ఓసారి ఓ వ్యక్తి దైవప్రవక్త (స) దగ్గరకు వచ్చి, నేను చాలా ఆకలిగొని ఉన్నాను అన్నాడు. దైవప్రవక్త (స), తన భార్యలలో ఒకరి దగ్గరకు ఏదైనా తినడానికి ఉంటే పంపమని కబురుచేశారు. ఇంట్లో నీరు తప్ప ఏమీ లేదని జవాబొచ్చింది. దైవప్రవక్త(స) తన రెండో భార్య దగ్గరకు కబురు పంపారు. అక్కడ నుండి కూడా అదే సమాధానం వచ్చింది. ఇలా ఎనిమిది తొమ్మిది ఇండ్ల నుండి కూడా నీరు తప్ప ఏమీ లేదని సమాధానం వచ్చింది. (ముస్లిం)

## ఇంట్లో తినడానికి ఏమీ లేదు

తరచూ ఇలా జరిగేది. దైవప్రవక్త(స) ఉదయం పూట తన భార్యల ఇండ్లకు వెళ్ళి తినడానికి ఏదయినా ఉంటే పెట్టండి అని అడిగేవారు. అక్కడ ఏమీ ఉండకపోయేది. అప్పుడు దైవప్రవక్త(స) "సరే, ఈ రోజు నేను ఉపవాసం పాటిస్తాను" అని అనేవారు. (ముస్నద్ అహ్మద్)

## పట్టు వస్త్రాలు, బంగారు ఆభరణాల వాడకంపై నిషేధం

దైవప్రవక్త(స) కుటుంబీకులు, ఆయన ఇంట్లో పెంపకానికి ఉన్నవారిపై, పట్టు వస్త్రాలు, జరీ వస్త్రాలు, బంగారు ఆభరణాలు ధరించడంపై ఆక్షేపం ఉండేది. "ఒకవేళ మీకు ఇవన్నీ స్వర్గంలో లభించాలని కోరుకుంటే ప్రపంచంలో వాటిని ధరించకండి" అని దైవప్రవక్త (స) చెప్పేవారు. (సీరతున్నబి-సంపుటం-2)

## ఖర్చుల ఏర్పాటు

ప్రవక్త మహనీయుని(స) శ్రీమతుల కోసం, బనూనజీర్‌కు చెందిన ఖర్జూర వనంలో భాగం ఏర్పాటు చేయబడింది. ఆ ఫలసాయం అమ్మబడగా వచ్చిన ఆదాయం సంవత్సరం ఖర్చులకు సరిపోయేది. ఖైబర్ జయించబడిన తరువాత ప్రవక్త(స) భార్యల కోసం సంవత్సరానికి ఒక్కొక్కరికి ఎనభై విస్కల ఖర్జూరం, ఇరవై విస్కల ఒట్లు (ఔ) ఏర్పాటయింది. విస్క్ అంటే అరవై 'సాఅ'లకు సమానం.

హ॥జత్ ఉమర్ (ర) పాలనాకాలంలో కొందరు ప్రవక్త(స) శ్రీమతులు (వారిలో హ॥జత్ ఆయిషా (ర) కూడా ఉన్నారు.) ఫలసాయానికి బదులు భూమే తీసుకున్నారు. (బుఖారి,సీరతున్నబి, సంపుటం-2)

## దాంపత్య జీవితపు తొమ్మిదేళ్ళు

"మీ భార్య ఎడల మంచిగా మెలిగేవాడే మీలో ఉత్తముడు. నేను నా భార్య ఎడల మీ అందరికంటే మేలయినవాడిని." (బుఖారి)

## ఇంటి పనులు

అస్వద్ బిన్ యజీద్, హ॥జత్ ఆయిషా (ర)ని అడిగారు, దైవప్రవక్త (స) తమ గృహంలో ఏమి చేస్తుండేవారని. ఆమె ఇలా అన్నారు: ఆయన వారి శ్రీమతి (ఆ రోజు ఎవరి వద్దయితే ఉండేవారో) గారి పని చేసిపెట్టేవారు. అజాన్ పిలుపు వినగానే వెళ్ళిపోయేవారు. (బుఖారి)

## పతి సేవ

హ(జత్ ఆయిషా (ర) ఇలా అన్నారని అస్వద్ ఉల్లేఖిస్తున్నారు: "నేను దైవప్రవక్త(స)కు నాకు లభించే మేలయిన సువాసనలను పులిమేదాన్ని. ఆ సువాసన మెరుపు ఆయన (స) తలపై, గడ్డంపై గోచరించేది. (బుఖారి)

హ(జత్ ఆయిషా (ర) ఇలా అన్నారని ఉర్వా బిన్ జుబైర్ (ర) ఉల్లేఖించారు: "నేను రుతుస్రావంలో ఉన్నప్పుడు కూడా దైవప్రవక్త (స) తలను దువ్వేదాన్ని." (బుఖారి)

## నిజమయిన ప్రేమ

హ(జత్ ఆయిషా (ర) ఇలా అంటారు: "నేను రుతుస్రావ పరిస్థితిలో ఉన్నప్పుడు ఏ పదార్థాన్నయినా తాగి ఆ పాత్రనే దైవప్రవక్త (స)కు అందించేదాన్ని. నేను నోరు పెట్టి తాగిన చోటనుండే దైవప్రవక్త (స) నోరు పెట్టి దాన్ని త్రాగేసేశారు. అప్పుడప్పుడు హైజ్ (రుతుస్రావ) పరిస్థితిలోనే ఎముకపై ఉన్న మాంసాన్ని తిని ఆ ఎముకనే దైవప్రవక్త(స)కు అందించేదాన్ని. ఆయన ఆ ఎముకను నేను నోటితో పీకి తిన్న ప్రదేశం నుండే తాము కూడా తినేవారు." (ముస్లిమ్)

## భార్య విశ్రాంతికి ఆటంకం ఉండదు

హ(జత్ ఆయిషా (ర) ఇలా అంటున్నారు: "దైవప్రవక్త (స) రాత్రి పూట నమాజు చేస్తున్నప్పుడు నేను ఆయన ఎదురుగా ఖిబ్లా వైపు గోడకు, ఆయనకు మధ్య అడ్డంగా పడుకొని ఉండేదాన్ని. తరువాత ఆయన విత్ర్ నమాజ్ చేయడానికి ఉపక్రమించేటప్పుడు నన్ను మేల్కొలిపేవారు. అప్పుడు నేను లేచి విత్ర్ నమాజ్ చేసేదాన్ని." (ముస్లిం)

## భర్త సామరస్యము

హ(జత్ ఆయిషా (ర) ఇలా అన్నారు: నేను దైవప్రవక్త (స) ఎదురుగా పడుకొని ఉండేదాన్ని. నా కాళ్ళు ఖిబ్లా వైపు (సజ్దాచేసే చోట) ఉండేవి. దైవప్రవక్త (స) నమాజులో సజ్దా చేసేటప్పుడు నా కాళ్ళను మెత్తగా స్పర్శించేవారు. అప్పుడు

నేను నా కాళ్ళను దగ్గరకు లాక్కొని ముడుచుకునేదాన్ని. తిరిగి ఆయన లేచి నిలబడగానే కాళ్ళుచాపి పడుకునేదాన్ని. ఆ రోజుల్లో మా ఇండ్లలో దీపం వెలిగేది కాదు." (ముస్లిమ్)

# పండుగ రోజు

హజ్రత్ ఆయిషా (ర) ఇలా ప్రవచిస్తున్నారు: "ఈదుల్ ఫిత్ర్ రోజునో లేక ఈదుల్ అజ్హా రోజునో ఓసారి హజ్రత్ అబూబక్ర్ (ర) నా ఇంటికి వచ్చారు. అప్పుడు హజ్రత్ ముహమ్మద్ (స) నా దగ్గరనే ఉన్నారు. ఆయన వద్ద ఇద్దరు అన్సార్ బాలికలు బుఅస్ యుద్ధంలో చదివిన కవితలు రాగయుక్తంగా పాడుతూ ఉన్నారు. హజ్రత్ అబూబక్ర్ (ర) (ఆ బాలికలతో), "షైతానుకు సంబంధించిన ఈ పాటేనా మీరు పాడేది?" అని గద్దించారు. అప్పుడు మహాప్రవక్త (స), ఆయన్ను ఉద్దేశించి, "అబూబక్ర్! పాడనివ్వు. ప్రతి జాతికి పండుగ అనేది తప్పక ఉంటుంది. ఈ రోజు వారి పండుగ రోజు కదా!" అన్నారు. (బుఖారి)

# ఈద్ వేడుకలు

హజ్రత్ ఆయిషా (ర) ఇలా చెప్పారు. "దైవప్రవక్త(స): ఓసారి నా దగ్గరకు వచ్చారు. అప్పుడు నా దగ్గర ఇద్దరు బాలికలు ఉన్నారు. వారు బుఅస్ యుద్ధ వివరాలను (పాట రూపంలో) వినిపిస్తున్నారు. దైవప్రవక్త (స) పడకపై మేనువాల్చి ముఖం అటుగా తిప్పుకున్నారు. అప్పుడు అబూబక్ర్ (ర) వచ్చి వారిని మందలిస్తూ దైవప్రవక్త(స) సన్నిధిలో ఈ షైతాన్ పాటలేమిటి? అన్నారు. అప్పుడు దైవప్రవక్త(స) ఆయన వైపు తిరిగి పోనీండి అన్నారు. దైవప్రవక్త(స) మరో పనిలో నిమగ్నులయిన తరువాత నేను వెళ్ళిపొమ్మని వారికి సైగ చేశాను. వారు బయటకు వెళ్ళి పోయారు. ఆనాడు పండుగ రోజు. ఆ రోజు నీగ్రోలు డాలు, ఈటె వగైరాలతో ఆటలాడే వారు. నేను దైవప్రవక్త (స)తో ఆట చూడాలని అన్నానో లేక ఆయనే నన్ను అడిగారో నాకు గుర్తులేదు. వారి ఆట చూడదలచు కున్నావా అని ఆయన (స) నన్ను అడిగారు. అవును అన్నట్లు నేను తలూపిన మీదట ఆయన నన్ను తన వెనకాల నిలబెట్టుకున్నారు. నా చెంప దైవప్రవక్త(స) చెంపకు ఆనుకొని ఉంది ఆ సమయంలో.

దైవప్రవక్త(స) ఆ నీగ్రోలతో 'బనీ అర్ఫదా! ఇంకా ఆడండి' అని మాటిమాటికి అనేవారు. నేను చాలా సేపు నిలబడి బాగా అలసిపోయాను. అప్పుడు ఆయన 'ఇక చాలా?' అని అన్నారు.

"చాలని నేనన్నప్పుడు దైవప్రవక్త(స) వెళ్ళిపొమ్మని సెలవిచ్చారు నాకు." (బుఖారి, ముస్లిం)

## అనుగ్రహ తీరుతెన్నులు

ఓసారి హజ్రత్ ఆయిషా (ర) దైవప్రవక్త (స)తో సంభాషిస్తూ మాటల్లో మించిపోయారు. అప్పుడే హజ్రత్ అబూబక్ర్ (ర) వచ్చేశారు. ఆయన ఈ అధిక ప్రసంగాన్ని సహించలేక ఉగ్రుడయిపోయి కుమార్తెను దండించడానికి చెయ్యి పైకెత్తారు. దైవప్రవక్త (స) వెంటనే ఆమెకు అడ్డం వచ్చారు. హజ్రత్ అబూబక్ర్(ర) వెళ్ళిపోయిన తరువాత దైవప్రవక్త(స) ఆయిషా (ర)తో "చూశావా నిన్ను నేను ఎలా రక్షించానో!" అని అన్నారు. (అబూదావూద్)

## ఆయిషాను పిలువకుంటే నేనూ రాను

హజ్రత్ అనస్ (ర) ఇలా ఉల్లేఖిస్తున్నారు: దైవప్రవక్త (స) పొరుగున ఓ ఫార్సీ (ఈరాన్ దేశస్థుడు) ఉంటూ ఉండేవాడు. అతడు పులుసు కూర బాగా వండుతాడు. ఓ రోజు అతడు భోజనం వండి దైవప్రవక్త (స)ను భోజనానికి పిలువడానికి వచ్చాడు. దైవప్రవక్త (స) ఆయిషా(ర) వైపు చూపిస్తూ మరి ఈమె? (ఈమెను కూడా వెంట తీసుకొనిరానా) అని అన్నారు. ఆ ఈరానీ వ్యక్తి వద్దు అన్నాడు. దానికి దైవప్రవక్త (స) "ఈమె రాకుంటే నేను కూడా రాను" అని అన్నారు. ఆ ఫార్సీవ్యక్తి వెళ్ళిపోయాడు. కాస్సేపటికి తిరిగి పిలువడానికి వచ్చాడు. దైవప్రవక్త (స) మళ్ళీ అదే మాటన్నారు. అతడు మళ్ళీ వెళ్ళిపోయాడు. మూడోసారి అతడు వచ్చి ప్రవక్త (సఅసం)ను పిలిచాడు. దైవప్రవక్త(స) తిరిగి అదే మాట అన్నారు. అప్పుడతను మంచిది రండి అన్నాడు (హజ్రత్ ఆయిషా (ర) కూడా వెళ్ళారు). దైవప్రవక్త (స) ఆయిషా (ర)ను వెంట తీసుకొస్తాను అనడానికి కారణం ఆమె చాలా ఆకలితో ఉన్నారు. ఇక ఫార్సీ వ్యక్తి వద్దు అనడానికి కారణం అతని

దగ్గర అప్పుడు ఇద్దరికి సరిపడినంత భోజనం లేకపోవడమే. ఫార్సీ వ్యక్తి ఆమెకు భోజనం వండిన తరువాత మూడోసారి హజ్రత్ ఆయిషా(ర)ను కూడా పిలవడానికి వచ్చాడు. అప్పుడు దైవప్రవక్త (స), హజ్రత్ ఆయిషా (ర) కలసి ఫార్సీవ్యక్తి ఇంటికి భోజనానికి వెళ్ళారు. (ముస్లిమ్)

## ఆయిషా(ర)! ఇది ఆనాటి సమాధానం

"ఓ యుద్ధానికి హజ్రత్ ఆయిషా (ర) దైవప్రవక్త (స) వెంట వెళ్ళారు. దైవప్రవక్త (స) తన సహాబీలను ముందుకు వెళ్ళండని ఆదేశించారు. తరువాత ఆయన హజ్రత్ ఆయిషా(ర)ను ఉద్దేశించి, "ఇద్దరం పరుగెత్తి చూద్దాంరా ఎవరు గెలుస్తారో" అన్నారు. హజ్రత్ ఆయిషా (ర) బక్కగా ఉండటం వలన ఈ పరుగుపందెంలో దైవప్రవక్త (స)ను దాటేసి ముందుకు వెళ్ళిపోయారు.

కొన్నేళ్ళ తర్వాత అలాంటి మరో సందర్భం వచ్చింది. హజ్రత్ ఆయిషా(ర) ఇలా అంటున్నారు: "అప్పుడు నేను కాస్త లావుగా ఉండడం వల్ల దైవప్రవక్త (స) నన్ను పరుగుపందెంలో మించిపోయారు. అప్పుడు ఆయన నాతో ఆయిషా! ఇది ఆనాటి పందేనికి సమాధానం (తెలుసా?)" అన్నారు. (అబూదావూద్)

## ఓర్పు, సహనం

హజ్రత్ ఆయిషా (ర) ఇలా తెలియజేస్తున్నారు: దైవప్రవక్త (స) తన అనుచరులతో ఉన్నప్పుడు ఓసారి నేను ఆయన కోసం భోజనం తయారు చేశాను. హజ్రత్ హఫ్సా (ర) నాకంటే ముందే భోజనం పంపింది. నేను జువైరియాతో, 'నీవు పోయి ఆ భోజనాన్ని కింద పడేయి' అని చెప్పాను. హఫ్సా భోజనం తీసుకొనివచ్చి ఆయన ముందు ఉంచింది. జువైరియా ఆ భోజనపాత్రను పక్కన పడేసింది. పాత్ర బోర్లపడటంతో భోజనం చిందరవందర అయింది. దైవప్రవక్త (స) ఆ భోజనాన్ని, పాత్రలో మిగిలి ఉన్నదాన్ని నేల మీద ఓ చోట ప్రోగుచేశారు. అందరు కలిసి దాన్ని తిన్నారు. ఆ తరువాత నేను నా భోజనాన్ని ఆయన (సఅసం) దగ్గరకు పంపించాను. దైవప్రవక్త (స) ఆ పాత్రను హఫ్సా (ర) దగ్గరికి పంపించారు. పంపిస్తూ, పాత్రను పాత్రకు బదులుగా తీసుకో, ఈ పాత్రలో

ఉన్నది తినమని చెప్పి మరీ పంపారు. ఇంత జరిగినా నేను, దైవప్రవక్త (స) ముఖారవిందంపై దాని ప్రభావం ఏమీ చూడలేదు. (కన్జుల్ ఆమాల్)

## పతి సేవా భాగ్యం

1. హజ్రత్ ఆయిషా (ర) తన భర్త హజ్రత్ ముహమ్మద్ (స)గారి పనులను తన చేతుల మీదనే నెరవేర్చేవారు. దైవప్రవక్త(స) పడకను తన చేతులతో వేసేవారు. ఆయన బట్టలను తానే ఉతికేవారు. (బుఖారి)

పడుకునే సమయంలో మిస్వాక్ (పల్లుదోము పుల్ల)ను, నీళ్ళను ఆయన తలాపున పెట్టేవారు. (ముస్నదె అహ్మద్)

మిస్వాక్‌ను శుభ్రంగా కడిగి ఉంచేవారు. (అబూదావూద్)

2. ఇంట్లో 'బరీరా' అనే ఓ పని మనిషి ఉండేది. కాని ఆమె స్వయంగా పిండి విసిరేవారు. పిండిని కలిపి వంట చేసేవారు. (బుఖారి, అబూదావూద్)

3. దైవప్రవక్త (స) ఖుర్బానీ కోసం పంపించే ఒంటెల ఖులాదా (మెడ త్రాళ్ళను) ఆమె స్వయంగా పేనేవారు. (ముస్నద్ అహ్మద్)

4. దైవప్రవక్త(స) ఇషా నమాజు చేసి హుజ్రా (పాక)లో ప్రవేశించేవారు. మిస్వాక్ చేసి వెంటనే నిద్రించేవారు. రాత్రి ఆఖరుఝామున మేల్కొని తహజ్జుద్ నమాజ్ చేసేవారు. కొంత రాత్రి గడిచిపోయిన తరువాత హజ్రత్ ఆయిషా(ర)ను మేల్కొలిపేవారు. ఆమె మేల్కొని నమాజులో కలిసిపోయేవారు. ఆ తరువాత విత్ర్ చదివేవారు. (ముస్నద్ అహ్మద్)

## ప్రవక్త మహనీయుల(స) దైనందిన కార్యకలాపాలు

హజ్రత్ ఆయిషా (ర) హజ్రత్ అబ్దుల్లాహ్(ర)తో ఓ రోజు ఇలా చెప్పారు: "ఓరోజు నా వంతు రాత్రినాడు దైవప్రవక్త (స) వచ్చారు. ఆయన దుప్పటి తీసి ప్రక్కన పెట్టారు. చెప్పులు తీసి కాళ్ళ దగ్గరనే ఉంచుకున్నారు. తన అంగవస్త్రంలోని ఓ భాగం పరుచుకొని కొంచెం సేపు పడుకున్నారు. నేను నిద్రపోయాను అని భావించి ఉంటారు అనుకుంటా! మెల్లగా తన దుప్పటిని ఎత్తుకున్నారు. కాళ్ళకు చెప్పులు చప్పుడు చేయకుండా వేసుకున్నారు. మెల్లగా తలుపు తీసి బయటకు

వెళ్ళి చప్పుడు కాకుండా తలుపు దగ్గరకు వేశారు. నేను వెంటనే లేచి 'దుపట్టా' (ఓణిలాంటి పై వస్త్రం) అందుకొని పైన కప్పుకున్నాను. తహ్‌బంద్ బిగించి దైవప్రవక్త(స) వెనుకనే బయలుదేరాను. ప్రవక్త మహనీయులు(స) బఖీ శ్మశానం దగ్గరకు చేరుకొని నిలబడ్డారు. చాలా సేపటి వరకు అలానే నిలబడి మూడుసార్లు దుఆ కోసం చేతులు పైకెత్తారు. ఆ తరువాత వెనుదిరిగారు. నేనూ వెంటనే బయలుదేరాను. దైవప్రవక్త(స) వడివడిగా నడిస్తే నేనూ వడివడిగా నడిచాను. ఆయన మరీ త్వరగా నడిస్తే నేనూ అంతే చేశాను. ఆయన రాక ముందే నేను ఇంట్లో ప్రవేశించి పడకపై పడుకున్నాను. ఆయన లోనికి వచ్చి, బాగా రొప్పుతున్నావేమిటి (ఎందుకు వణుకుతున్నావు) అని నన్నడిగారు. ఏమీ లేదని నేను సమాధానమిచ్చాను. "చెప్పదలచుకుంటే చెప్పు. లేకున్నా సర్వం ఎరిగిన ఆ దైవం నాకు తెలియజేస్తాడులే" అని అన్నారు. "దైవప్రవక్తా! నా తల్లిదండ్రులు మీకై అర్పణం" అని జరిగిన విషయం అంతా చెప్పేశాను. దైవప్రవక్త (స) అంతా విని అయితే నా ముందు ఓ నీడ కనబడింది అది నీవేనన్న మాట అని అన్నారు. అవును అన్నాన్నేను. దైవప్రవక్త(స) నా ఎదురు రొమ్ముపై గ్రుద్దారు. దాంతో నాకు కొంత బాధవేసింది. అప్పుడన్నారు, "దైవం, దైవప్రవక్త(స) నీకు అన్యాయం చేస్తారనుకున్నావా? అని." నేనన్నాను, "ప్రజలు దాచేదేదైనా దేవునికి బాగా తెలుసు." దైవప్రవక్త ఇలా అన్నారు: 'నేను పడుకున్నప్పుడు జిబ్రీల్ వచ్చి నన్ను పిలిచారు. ఆయన నీకు కనబడకుండా ఉండాలని తలిచారు. నేను కూడా ఆయన కనబడకపోవడమే మంచిదని అనుకున్నాను. ఎందుకంటే అప్పుడు నీవు పై ఉడుపులు తీసేసిఉన్నావు. ఆయన నీ ఎదురుగా రాలేదు కూడా. (అదీగాక) నీవు పడుకున్నావు, భయపడతావని నిన్ను లేపడం మంచిది కాదనుకున్నాను. బఖీ శ్మశానికి వెళ్ళి అక్కడున్న వారికై మన్నింపు దుఆ చేయమని నీ ప్రభువు ఆదేశిస్తున్నాడని జిబ్రాయీల్ చెప్పారు. (అందుకే నేను బఖీ వెళ్ళి దుఆ చేశాను)."

"దైవ ప్రవక్తా! మరి నేను వెళ్ళి అక్కడ ఏమనాలి (ఏమని దుఆ చేయాలి?) అని ఆయిషా(ర) అడిగినప్పుడు, నీవు వెళ్ళి ఇలా పలుకు అన్నారు ఆయన:

**"అస్సలాము అలా అహ్‌లిదియారి మినల్ మోమినీన వల్ ముస్లిమీన వయర్‌హముల్లాహుల్ ముస్తఖ్దిమీన మిన్నావల్ ముతఅఖ్ఖిరీన్. వ ఇన్నా ఇన్షా అల్లాహు బికుమ్ లలాహిఖూన్."**

అర్థం: ఓ గృహవాసులారా! విశ్వాసులారా, ముస్లింలారా! మీపై శాంతి కలుగుగాక. అల్లాహ్, మా ముందు వెళ్ళిన వారిని మా వెనుక వచ్చే వారిని కరుణించుగాక. దైవ చిత్తమయితే మేమూ మీతో వచ్చి చేరుతాం. (ముస్లిమ్)

## దైవమార్గంలో ఖర్చుపెట్టిందే మిగిలుండేది

హ్రజత్ ఆయిషా (ర) ఇలా అంటున్నారు: "మేము (ఓసారి) ఓ మేకను జిబహ్ చేశాము. దైవప్రవక్త (స) నాతో ఇందులో మిగిలిందేమిటి అని అడిగారు. (అంటే ప్రజలకు దానం చేసిన తరువాత ఇంకేం మిగిలి ఉంది అని). తల తప్ప ఇంకేమీ మిగలలేదు అని నేనన్నాను. దానికి ఆయన (సఅసం) తల తప్ప అంతా మిగిలి ఉంది అన్నారు. (అంటే దైవమార్గంలో ఏదైతే దానం చేశారో అదే మిగిలి ఉంది అని భావం)." (ముస్లిమ్)

## దీనుల్ని ప్రేమించు

హ్రజత్ అనస్ (ర) ఉల్లేఖిస్తున్నారు: దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు. "ఓ ప్రభూ నన్ను నిరుపేదగా బ్రతికుండనీ, నిరుపేదగానే మరణింపజెయ్యి, నిరుపేదలతో పాటే నన్ను ప్రళయం నాడు లేపు." ఇది విన్న హ్రజత్ ఆయిషా (ర) అడిగారు, "దైవప్రవక్తా! మీరు ఇలా ఎందుకు దుఆ చేస్తున్నారు?" అని. దైవప్రవక్త (స) ప్రవచించారు. 'నిరుపేదలు ధనవంతులకంటే నలభై ఏళ్ళు ముందుగా స్వర్గంలో ప్రవేశిస్తారు. ఆయిషా! నిరుపేద అడిగిందాన్ని కాదనకు. ఏమీలేకపోయినా సగం ఖర్జూరమయినా సరే దానంచెయ్యి. ఆయిషా! పేదలను ప్రేమించు. వారిని దగ్గరకు చేర్చుకో. అల్లాహ్ ప్రళయంనాడు నిన్ను దగ్గరకు చేర్చుకుంటాడు." (తిర్మిజీ)

## నన్ను చేరుకోదలిచావా!

దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారని హ్రజత్ ఆయిషా (ర) ఉల్లేఖించారు: "(ఆయిషా!) నీవే గనక నన్ను చేరుకోదలిస్తే, నన్ను కలుసుకోదలిస్తే బాటసారి ఎంతైతే చద్దిమూట తీసుకొని వెడతాడో నీవు కూడా ఈ ప్రపంచం నుండి అంతే తీసుకొని వెళ్ళు. ధనవంతులతో అంత చనువుగా ఉండకు. వస్త్రాన్ని, అందులో మాసికలు పడనంత వరకు వేరుచేయకు. (తిర్మిజీ)

## ధనవంతులతో కలసిమెలసి ఉండకు

హజ్రత్ ఆయిషా సిద్దీకా (ర) ప్రవచిస్తున్నారు. "నేను దైవప్రవక్త (స) దగ్గర కూర్చుని దుఃఖిస్తున్నాను. అప్పుడు దైవప్రవక్త- నీవెందుకు దుఃఖిస్తున్నావు? నీవు నన్ను కలుసుకోదలచుకుంటే నీ దగ్గర ఈ ప్రపంచసొత్తు ఓ బాటసారి దగ్గరుండే బత్తెం అంతుంటే చాలు. (చూడు) ధనవంతులతో కలసిమెలసి ఉండకు అని అన్నారు." (కన్జుల్ ఆమాల్)

## దీనులను ఆదరించు

హజ్రత్ ఆయిషా(ర) ప్రవచిస్తున్నారు: "నా దగ్గరకు ఓ దీనురాలైన స్త్రీ వచ్చింది. ఆమె దగ్గర నాకు కానుకగా ఇవ్వడానికి ఏదో ఉంది. ఆమెపై నాకు జాలి వేసింది గనుక ఆమె నుండి ఆ కానుకను తీసుకోవడం నాకు నచ్చలేదు. దానికి దైవప్రవక్త (స) ఆ కానుకను నీవు ఎందుకు స్వీకరించలేదు, బదులుగా ఇంకేదైనా ఇచ్చేస్తే బాగుండేది కదా, దాన్ని నీవు అల్పమైనదిగా భావించావని అనుకుంటున్నాను. ఆయిషా! మర్యాద, ఆదరణ పాటించు. నిశ్చయంగా అల్లాహ్ మర్యాద, ఆదరణలను పాటించే వారిని ప్రేమిస్తాడు, అహంకారులతో శతృత్వం వహిస్తాడు. (హుల్యతుల్ అవులియా)

## ఆయిషా! నేను గనక కోరితే...

హజ్రత్ ఆయిషా (ర) ఇలా ప్రవచిస్తున్నారు: "నా దగ్గరకు ఓ అన్సారి స్త్రీ వచ్చి దైవప్రవక్త (స) పడకను చూసింది. అందులో పాత మాసిక వేసి ఉంది. ఓ పాత దుప్పటి ఉంది (అది చూసివెళ్ళి) ఆమె నా దగ్గరకు ఓ పడకను పంపింది. అందులో ఉన్ని నింపబడి ఉంది. ఆ తరువాత దైవప్రవక్త (స) వచ్చి ఆయిషా! ఇదేమిటి? అన్నారు. దైవప్రవక్తా! ఫలానా అన్సార్ స్త్రీ నా దగ్గరకు వచ్చింది. ఆమె మీ పడకను చూసి వెళ్ళి దీన్ని పంపించింది అన్నాన్నేను. దానికి దైవప్రవక్త(స), ఆయిషా! దాన్ని త్రిప్పి పంపించు. దైవసాక్షి! నేను గనక కోరుకుంటే అల్లాహ్ నా వెంట వెండి బంగారాల పర్వతాలనే నడిపిస్తాడు అని అన్నారు."

(బైహఖి)

## అస్మా ఉల్ హుస్నా (దైవనామాల) ద్వారా దుఆ

దైవప్రవక్త (స) ఓ రోజు ఇలా అన్నారని హజ్రత్ ఆయిషా (ర) ఉల్లేఖిస్తున్నారు: "ఆయిషా! అల్లాహ్ నాకు ఓ నామాన్ని సూచించాడు, దాని ద్వారా చేసిన దుఆను ఆయన స్వీకరిస్తాడు. దాన్ని గురించి నీకేమైనా తెలుసా? అని అడిగారు. అప్పుడు నేను-

దైవప్రవక్తా! నా తల్లిదండ్రులు మీకై అర్పణం. నాకు ఆ దుఆ ఏదో నేర్పించరా? అని అడిగాను, దానికి ఆయన, ఆయిషా! నీ కోసం అది సరైంది కాదు అన్నారు. తరువాత నేను ఓ మూలకు వెళ్ళి కొంచెం సేపు అలానే కూర్చున్నాను. ఆ తరువాత లేచి దైవప్రవక్త (స) తలను ముద్దాడి, దైవప్రవక్తా! నాకు ఆ దుఆను నేర్పించరా? అని అడిగాను. ఆయన- లేదు ఆయిషా! నీకిది సరైంది కాదు. నీకు నేను ఆ దుఆను నేర్పితే నీవు ఇహలోకపు ఏ వస్తువునైనా అడుగుతావు. ఇది నీకు తగదు అని అన్నారు."

హజ్రత్ ఆయిషా(ర) ఇంకా ఇలా అన్నారు: "దాని తరువాత నేను వెళ్ళి వుజూ చేశాను. రెండు రకాత్‌ల నమాజ్ చేసి ఇలా వేడుకున్నాను.

**"అల్లాహుమ్మ ఇన్ని అద్‌ఊకల్లాహ వ అద్ ఊర్‌రహ్మాన్ వ అద్‌ఊకల్ బర్రరహీమ వ అద్‌ఊక బ అస్మాయికల్ హుస్నా కుల్లహామా అలిమ్‌తు మిన్‌హా వమాలమ్ ఆలమ్- అన్‌తగ్ ఫిర్‌లీ వతర్‌హమ్‌నీ."**

**భావం:** ఓ అల్లాహ్! నేను నిజంగా నిన్ను అల్లాహ్ అనే పిలుస్తున్నాను. నిన్ను రహ్మాన్ అని పిలుస్తున్నాను. నిన్ను మంచివాడని, రహీమ్ అని పిలుస్తున్నాను. నిన్ను నీ అన్ని మంచిపేర్లతో పిలుస్తున్నాను. వీటిలో నాకు తెలిసినవి తెలియనివి కూడా ఉన్నాయి. తద్వారా నువ్వు నన్ను మన్నించు, కరుణించు.

ప్రవక్త (స) నా ఈ దుఆకు నవ్వేశారు. ఆ తరువాత "ఆ నామం, నీవు దుఆలో పలికిన నామాల్లోనే ఉంది అని దైవప్రవక్త (స) అన్నారు."

## హజ్రత్ ఆయిషా(ర) కోసం ప్రవక్త (స)దుఆ

హజ్రత్ ఆయిషా (ర) ఉల్లేఖించారు: "నేను ఒక్క రోజు దైవప్రవక్త (స)ను ఆనందంతో ఉండగా చూసి, దైవప్రవక్తా! నా కోసం దుఆ చెయ్యండి అని విన్నవించుకున్నాను. అప్పుడు ఆయన ఇలా దుఆ చేశారు:

"అల్లాహుమ్మగ్ఫిర్‌లి ఆయిషత మా తఖద్దమ మిన్ జంబిహావమా తఅఖ్ఖర వమా అసర్రత్ వమా ఆలనత్."

**భావం:** "ఓ అల్లాహ్! ఆయిషా గతంలో చేసిన పాపాలను, తరువాత జరిగే పాపాలను, ఆమె గుప్తంగా చేసిన పాపాలను, బహిరంగంగా చేసిన పాపాలను అన్నిటినీ మన్నించు."

ఈ దుఆ విని హజ్రత్ ఆయిషా (ర) ఆనందం పట్టలేక ఒడి వైపు వంగే అంతగా విరగబడి నవ్వారు. ఇది చూచి మహాప్రవక్త (స) ఆయిషా! నా ఈ దుఆ నిన్ను బాగా సంతోషపరిచినట్లుందే అన్నారు. అవును దైవప్రవక్తా! మీ దుఆ నన్ను సంతోషపెట్టకపోవడానికి నాకేమైందని అన్నారు ఆయిషా.

దైవ సాక్షి! ఈ దుఆయే నా పూర్తి ఉమ్మత్ (సమాజం) కోసం ప్రతి నమాజులోను చేయబడుతోంది అన్నారు దైవప్రవక్త (స). (అల్‌బజార్)

హజ్రత్ ఆయిషా (ర) జీవితంలో సంభవించిన సంఘటనలే కొన్ని దైవాజ్ఞల అవతరణకు కారణమయ్యాయి. నూర్, అహ్జాబ్, తహ్రీమ్ సూరాలు ఇలాంటివే. దీనివల్ల ఇస్లాం సామాజిక జీవితానికి, శిక్షాస్మృతికి సంబంధించిన చట్టాలు తెలిశాయి. హజ్రత్ ఆయిషా (ర) ప్రతి సంఘటనను ఉన్నది ఉన్నట్లుగానే చెప్పారు. అందులో ఎలాంటి హెచ్చుతగ్గులు చేయలేదు. మరే విషయాన్ని దాచనూ లేదు. దీనివల్ల ఆమె సత్యసంధత తెలుస్తోంది.

వీటిలో మొదటిది 'ఇఫ్క్' సంఘటన. రెండోది తహ్రీమ్ సంఘటన. మూడోది 'ఈలా' సంఘటన (భార్యలకు దూరంగా ఉండడం). నాల్గోది తఖీయర్ (అంటే ఏ భార్య అయినా తన కోరిక మేరకు ప్రపంచాన్నో, పరలోకాన్నో ఎంచుకోవడం). ఇప్పుడు మనం ఇఫ్క్ సంఘటన గురించి తెలుసుకుందాం.

## ఇఫ్క్ సంఘటన

దైవప్రవక్త (స) సతీమణి హజ్రత్ ఆయిషా సిద్దీకా (ర) గారిపై అపనింద మోపినవారు కపటవిశ్వాసుల నాయకుడు అబ్దుల్లా బిన్ ఉబై, అతని మిత్రుడు జైద్ బిన్ రిఫాఅ. (ఇతడు రిఫా బిన్ జైద్ అనే యూదుని కొడుకై ఉండవచ్చు).

## అమాయకులైన ముస్లిములు

1. హజ్రత్ హస్సాన్ బిన్ సాబిత్ (ర)
2. హజ్రత్ మిస్‌తహ్ బిన్ అసాష్ (ర)
3. హజ్రత్ హమ్నా బిన్తె జహష్ (ర)

పై ముగ్గురు విశ్వాసులే. అయితే పొరపాటున తమ బలహీనతల వల్ల అపవాదు సంఘటనలో చిక్కుకున్నారు.

## అపనింద మోపినవారి పర్యవసానం - హదీసు వెలుగులో

దైవప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు. శీలవతులైన స్త్రీలపై అపనింద మోపడం 'మేఖిఖాత్' అనబడే ఏడు ఘోర పాపాలలో ఒకటి. (మేఖిఖాత్ అంటే వినాశకర హేతువులు అని అర్థం). తిబ్రాని హదీసులో హజ్రత్ హుజైఫా (ర) ఉల్లేఖనం ప్రకారం శీలవతి అయిన స్త్రీపై అపనింద వేయడం వంద సంవత్సరాల పుణ్యకార్యాల ఫలాన్ని నాశనం చేయడానికి చాలు అని దైవప్రవక్త (స) ప్రవచించారు. (తఫ్‌హీముల్ ఖుర్‌ఆన్, నూర్ సూరా)

## కపటుల ధ్యేయం

1. దైవప్రవక్త (స), హజ్రత్ అబూబక్ర్ సిద్దీఖ్ (ర) గార్ల గౌరవాన్ని దెబ్బతీయడం.

2. ఇస్లామీయ నైతిక విలువలను కించపరిచే ప్రయత్నం చేయడం.

3. ఇస్లామీయ సమాజంలో అశ్లీలాన్ని ప్రచారం చేయడం.

4. ముస్లిముల నడుమ విచ్ఛిన్నత, వేర్పాటువాదాన్ని పుట్టించి జాతి దురభిమానాన్ని రేకెత్తించడం.

## కఠిన పరీక్ష

విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఆయిషా సిద్దీకా (ర), ఆమె తండ్రి హజ్రత్ అబూబక్ర్ సిద్దీఖ్ (ర) గార్లకు దైవప్రవక్త (స) దగ్గర ఉన్న విలువ,

ఔన్నత్యం, ఆయన హృదయంలో వారి ఎడల గల గౌరవం కారణంగా కపట విశ్వాసులకు కంటకప్రాయం అయింది. ఎలాగైనా సరే పుణ్యాత్ములయిన ఈ వ్యక్తుల గౌరవంపై దెబ్బతీసి వారి విలువను, గౌరవాన్ని మంటగలపాలి అన్న ఆలోచనతో సతమతమవుతూ ఉండేవారు కపటులు. కాబట్టి ఇఫ్క్ సంఘటనలో అపర షైతాను, కపటవిశ్వాసుల నాయకుడు అయిన అబ్దుల్లా బిన్ ఉబైకి మంచి అవకాశం దొరికింది. అప్పుడు హజ్రత్ ఆయిషా (ర)కు దైవవాణి అవతరించి ఆమె సచ్ఛీలం గురించి సాక్ష్యం ఇచ్చేటంత కాలం వరకు ఆమె ఓ పెద్ద కఠిన పరీక్షకు గురికావలసి వచ్చింది.

## అపవాదు సంఘటన

ఉర్వా బిన్ జుబైర్, సయీద్ బిన్ ముసయ్యిబ్, అల్ఖమా బిన్ వఖ్ఖాస్, ఉబైదుల్లా బిన్ అబ్దుల్లా, ఉత్బా బిన్ మస్ఊద్ అనేవారు హజ్రత్ ఆయిషా(ర) ద్వారా, ఈ అపవాదు పుట్టించినవారి గురించి ఉల్లేఖించారు. ఈ నలుగురిలో ప్రతి ఒక్కరూ హదీసు ఒక భాగాన్ని వివరించారు. ఒకరికంటే మరొకరికి ఆ హదీసులో అధికభాగం గుర్తుంది. కాబట్టి అందరి వివరణలు సరైనవే. అందువల్ల ప్రతిఒక్కరు ఉల్లేఖించిన పదాలను ఒకే వరుసలో కూర్చడం జరిగింది. ఇందులో ఒకరి వివరణ మరొకరి వివరణను ధృవపరుస్తోంది. వారి వివరణ ఇలా ఉంది:

హజ్రత్ ఆయిషా (ర) ఉల్లేఖించారు: దైవప్రవక్త (స) ఎప్పుడైనా సుదూరప్రయాణానికి బయలుదేరే ముందు తమ భార్యల్లో ఎవరిని వెంట తీసుకు వెళ్ళాలో చీటివేసి తెలుసుకునేవారు. చీటిలో ఎవరి పేరొస్తే ఆమె ఆయన వెంట బయలుదేరేది. ఒకసారి ఓ యుద్ధానికి బయలుదేరే ముందు ఆయన చీటి వేస్తే నా పేరు వచ్చింది. కాబట్టి దైవప్రవక్త (సఅసం) వెంట నేను బయలుదేరాను. అప్పటికే పరదా ఆదేశాలు అవతరించివున్నాయి. అంచేత నేను పరదా పాటిస్తూ ఒంటెపై అంబారీలో ఎక్కి కూర్చున్నాను. అలా మేము బయలుదేరి వెళ్ళాము. దైవప్రవక్త (స) ఆ యుద్ధం ముగించుకుని తిరుగుప్రయాణంలో, రాత్రిపూట ఓ చోట విడిదిచేశాక తిరిగి బయలుదేరడానికి ఆదేశం ఇచ్చినప్పుడు విడిది నుండి నేను బహిర్భూమికి చాలా దూరం వెళ్ళి ఉన్నాను. తిరిగివచ్చి నా మెడలో చేయి వేసి చూస్తే నా 'ఖజ్రుఫ్' (యమన్ దేశపు హారం) తెగి ఎక్కడో పడి

పోయిందని గ్రహించాను. దానికోసం వెదుక్కుంటూ వెనక్కి వెళ్ళాను. అలా వెదకడంలో నాకు ఎంతో సమయం పట్టింది. నన్ను ఒంటెపై ఎక్కించే బాధ్యత తీసుకున్న వ్యక్తి నేను కూర్చునే అంబారీని ఎత్తి ఒంటెపై పెట్టేశారు. నేను అంబారీలోనే ఉన్నానని ఆయన అనుకున్నారు.

ఆ కాలంలో స్త్రీలు సాధారణంగా తేలిగ్గా ఉండేవారు. ఎందుకంటే మేము తినే ఆహారం సాదాగా, క్రొవ్వు పదార్థాలు లేకుండా ఉండేది. అదే కాకుండా నేను అప్పుడు చిన్నపిల్ల అవడం వల్ల అంబారినీ ఒంటెపై పెట్టేటప్పుడు ఆయనకు అది తేలిగ్గా వున్న సంగతి స్ఫురించలేదు. కాబట్టి ఆయన ఒంటెను లేపి బయలుదేరారు. సైనిక పటాలం బయలుదేరి వెళ్ళిన తరువాతగాని నాకు నా హారం దొరకలేదు. అప్పుడు పిలిచేవాడుగాని, పలికేవాడుగాని అక్కడ ఎవరూ లేరు. వారు నేను లేనని తెలుసుకొని నన్ను వెదకడానికి ఇటురావచ్చనే తలంపుతో ఆ ప్రదేశానికి వచ్చి కూర్చున్నాను. అంతలోనే నాకు నిద్ర పట్టింది.

హజ్రత్ సఫ్వాన్ బిన్ ముఅత్తల్ ఎప్పుడూ పటాలం వెనుక ఉండేవారు. ఆయన ప్రాతఃకాల సమయంలో నేనున్న ప్రదేశానికి వచ్చి ఎవరో ఇక్కడ నిద్ర పోతున్నారని చూసి నన్ను గుర్తుపట్టగలిగారు. పరదా ఆదేశాలు రాకముందు ఆయన నన్ను చూసి ఉన్నారు కాబట్టి గుర్తుపట్టగలిగారు. నేను ఆయన నోట ఇన్నాలిల్లాహి వ ఇన్నా ఇలైహి రాజిఊన్ అనే మాటలు వెలువడటం విని మేల్కొన్నాను. ఆయన్ను చూడగానే నా దుప్పటితో ముఖం దాచుకున్నాను. దైవసాక్షి! మా మధ్య ఎలాంటి సంభాషణా జరుగలేదు. కేవలం ఆయన నోట విన్న 'ఇన్నాలిల్లాహ్' అనే మాటలు తప్ప. ఆయన తన వాహనం (ఒంటె) నుండి దిగి దాన్ని కూర్చోబెట్టారు. నేను లేచి నిలబడి ఆ వాహనంపై ఎక్కి కూర్చున్నాను. ఆయన దాని ముందు నడిచి వెళుతూ నన్ను తీసుకొని వెళ్ళారు. మధ్యాహ్న సమయంలో బాగా ఎండగా వున్నప్పుడు మేము విడిది చేసివున్న పటాలాన్ని చేరుకోగలిగాము.

ఆమె ఇలా అంటున్నారు: ఎవరైతే నాశనం కావలసి ఉందో అతడు అపవాదువేసి నాశనం అయ్యాడు. ఇంకెవరైతే ఈ అపవాదును అధికంగా ప్రచారం చేశాడో అతడు అబ్దుల్లా బిన్ ఉబై బిన్ సలూలే. ఆ దుష్టుని ముందు అపవాదు

గురించిన ప్రస్తావన వచ్చినప్పుడు అతడు ఎంతో ఆసక్తితో దీన్ని వివరించేవాడు. దాన్ని ప్రజలు యదార్థమేనని నమ్మేలా చిత్రించేవాడు. ఎంతో ఏకాగ్రతతతో వినేవాడు, చెప్పేవాడు.

ఉర్వా (ర) ఇలా ఉల్లేఖించారు: హజ్రత్ హస్సాన్ బిన్ సాబిత్, హజ్రత్ మిస్తహ్ బిన్ అసాష్, హజ్రత్ హమ్నా బిన్తె జహష్‌లు తప్ప ఇంకెవరి పేర్ల గురించి నాకు తెలియదు. దైవవాణి చెప్పినట్లు అబ్దుల్లా బిన్ ఉబై నాయకత్వంలో ఓ వర్గం ఉండేది. అయితే హజ్రత్ ఆయిషా (రజిఅన్), తన ఎదుట హస్సాన్ బిన్ సాబిత్‌ను (ఇతరులు) దూషించడాన్ని సహించలేకపోయేవారు. నా తల్లిదండ్రులు, నా గౌరవం, నా సర్వస్వం దైవప్రవక్తకై అర్పింతును, నా గౌరవం అందులోనే ఉంది'' అని హస్సాన్ అనేవారని హజ్రత్ ఆయిషా(ర) చెబుతుండేవారు.

హజ్రత్ ఆయిషా సిద్దీఖా (ర) ప్రవచనం ఇలా ఉంది: "మేము మదీనా నగరానికి చేరిన తరువాత ఒక నెల వరకు నేను వ్యాధిగ్రస్తురాలిగా ఉన్నాను. అప్పుడు ప్రజల్లో అపవాదు గురించిన చర్చ ఏమి జరిగిందో నాకు ఏమాత్రం తెలియదు. కాని అనుమానం నా బాధను ఇనుమడింపచేసింది. దైవప్రవక్త (స) నేను జబ్బుపడక ముందు నా ఎడల కనపరచిన వైఖరిలో మార్పు వచ్చినట్లు గమనించాను. నా వ్యాధి కాలంలో దైవప్రవక్త (సఅసం) నా దగ్గరకు వచ్చేవారు, సలామ్ చేసేవారు, పరిస్థితి అడిగి తెలుసుకునేవారు, వెళ్ళిపోయేవారు. అయితే ఈ విషయం నన్ను అనుమానంలో పడవేసేది. అంతేకాని బయట పుకార్ల తుఫాను ఎలా ఉండిందో తెలిసేది కాదు. కొంత స్వస్థత చేకూరిన తరువాత 'మిస్తహ్' తల్లి వెంట కాలకృత్యాలు తీర్చుకోడానికి బయటకు వెళ్ళాను. అప్పుడు మేము సాధారణంగా రాత్రి పూట బయటకు పోయేవాళ్ళము. మా ఇంటి దగ్గర మరుగుదొడ్లు లేనప్పటి మాట అది. అరబ్బుల అలవాటు ప్రకారం దానికోసం వారు బయట అడవిలోనికి వెళ్ళేవారు. ఇండ్ల దగ్గర మరుగుదొడ్లు కట్టడం ఇబ్బందిగా ఉండేది.

నేను మిస్తహ్ తల్లి వెంట బయటకు వెళ్ళాను. మిస్తహ్ అబీ అర్హమ్ కుమార్తె. అబీ అర్హం అబ్దుల్ ముత్తలిబ్ కొడుకు. ఈమె తల్లి సగీర్ బిన్ ఆమిర్

కుమార్తె, ఇంకా అబూబక్ర్ (ర) గారి తల్లి కూడా. ఈమె కుమారుని పేరు మిస్తహ్ బిన్ అసాస. మిస్తహ్ వెంట తిరిగి ఇంటికి బయలుదేరేటప్పుడు, ఆమె కాలు దుప్పటిలో చిక్కుకొని పడిపోయారు. పడిపోయి 'మిస్తహ్ నాశనం' గాను అని దూషించారు. "మీరు ఎంత చెడ్డ మాట అన్నారు? బద్ర్ యుద్ధంలో పాల్గొన్న యోధుణ్ణి మీరు తిట్టేది?" అన్నాను నేను. దానికి ఆమె, "అమ్మా! వాడేమన్నాడో నీకు తెలియనట్లున్నదే!" అన్నది. ఏమన్నాడని నేనడగ్గా నాపై అపనింద వేసిన వారి గురించి చెప్పారామె. అప్పటి నుండి నా ఆరోగ్యం బాగా దెబ్బతిన్నది. నేనింటికి వచ్చిన తరువాత దైవప్రవక్త (స) వచ్చివున్నారు. సలాం చేసి నా ఆరోగ్యం ఎలా ఉందని తెలుసుకున్నారు. అప్పుడు నేను ఆయనతో విన్నవించు కున్నాను. నన్ను నా పుట్టింటికి పోయే అనుమతి ప్రసాదించమని. నేను నా తల్లిదండ్రుల ద్వారా ఈ వార్తలోని నిజనిజాలు తెలుసుకోగోరి అలా అడిగాను. ఆయన అనుమతి ప్రసాదించారు.

నేను నా పుట్టింటికి వెళ్ళి అమ్మా! ప్రజలు అనుకునేదేమిటి అని అడిగాను. దానికి ఆమె "అమ్మాయ్! దీని గురించి బాధపడవద్దు. దైవసాక్షి! ఇది జరుగుతూనే ఉంటుంది. ఎందుకంటే ఏ స్త్రీ అయితే అందంగా ఉంటుందో, ఆమె భర్త ఆమెను అధికంగా ప్రేమిస్తాడో సవతులు సాధారణంగా మోసం చేయజూస్తారు" అని అన్నారు. నేను ఆశ్చర్యంగా 'సుబ్హానల్లా' అన్నాను. ప్రజలు ఇలాంటి మాటలు కూడా మాట్లాడుతున్నారా అని అడిగాను. ఆ తరువాత నేను రాత్రంతా ఏడుస్తూ ఉండిపోయాను. నా కన్నీరు ఆగలేదు. తెల్లారిందాకా నాకు నిద్ర పట్టలేదు. నేను ఏడుస్తూనే ఉన్నాను.

దైవప్రవక్త (సఅసం) అలీ బిన్ అబూతాలిబ్‌ను, ఉసామ బిన్ జైద్‌ను పిలిపించారు. అప్పటికి నా గురించి దైవవాణి అవతరించలేదు కాబట్టి భార్యను వదిలేయడానికి వారిద్దరిని సంప్రతించి సలహాలు తీసుకొనే ఉద్దేశ్యంలో వారిని పిలిపించారు. అప్పుడు, దైవప్రవక్త(స) సతీమణి సచ్ఛీలం గురించి బాగా తెలుసు కాబట్టి ఉసామ (ర) 'దైవప్రవక్త (స) సతీమణి గురించి మంచి తప్ప మాకు ఏమీ తెలియదు" అని అన్నారు. హ|జత్ అలీ (ర) "దైవప్రవక్తా! అల్లాహ్ మిమ్మల్ని

ఇరకాటంలో పెట్టడు, ఆమెకాక వేరే స్త్రీలు చాలా మంది ఉన్నారు. తమరు ఆ అమ్మాయి (హ్జ్రత్ బరీరా)ని అడగండి. ఆమె ఉన్నది ఉన్నట్లు తమకు తెలియజేయగలదు" అన్నారు.

ఆ తరువాత దైవప్రవక్త (స) బరీరాను పిలిపించి "బరీరా! నీవు అనుమానమైన విషయాన్ని దేన్నైనా చూశావా?" అని అడిగారు.

ఆమె ఇలా విన్నవించుకుంది, "మిమ్మల్ని సత్యమొసగి ప్రభవింపజేసిన దేవుని సాక్షి! నేను అనుమానాస్పదమైన ఏ విషయం చూళ్ళేదు. ఆమె ఓ బాలిక, పిండి కలుపుతూనే నిద్రపోతుంది. మేక వచ్చి ఆ పిండిని తినేసినా మేల్కోదు." ఆ తరువాత దైవప్రవక్త (స) లేచి నిలబడ్డారు. అబ్దుల్లా బిన్ ఉబైను నిందించారు. కాబట్టి మెంబరుపై కూర్చుని ఆయన ఇలా ప్రవచించారు. "ముస్లిములారా! నా భార్య గురించి నన్ను బాధపెట్టిన ఆ వ్యక్తికి ప్రతిక్రియ ఎవరు చేస్తారు? దైవసాక్షి! నేను నా భార్యలో మంచి తప్ప మరేదీ చూడలేదు. అంతేగాక ఏ వ్యక్తి గురించి జనం చెబుతున్నారో అతనిలో కూడా నేను మంచి తప్ప మరేదీ చూడలేదు. అతను నాతో కలిసే నా ఇంట ప్రవేశిస్తాడు...."

దీనికి బనీ అబ్దుల్ అష్హల్ సోదరుడు సఅద్ బిన్ ముఆజ్ నిలబడి, "దైవప్రవక్తా! మీకు జరిగిన అన్యాయానికి తగిన శాస్తి నేను చేస్తాను. వాడు ఔస్ తెగకు చెందినవాడయితే అతని తల నరికేస్తాను, వాడు ఖజ్రజ్ తెగవాడై మా సోదరుల్లోని వాడైతే మీరు ఏ విధంగా ఆజ్ఞాపిస్తే అదే విధంగా శిక్షిస్తాను" అని అన్నారు. ఆ తరువాత ఖ్జ్రజ్ తెగ నుండి ఒకాయన లేచి నిలబడ్డారు. ఎందుకంటే హస్సాన్ తల్లి, ఆయన పినతండ్రి కూతురు అదే తెగకు చెందినవారు. ఆయన ఎవరో కాదు ఖజ్రజ్ సర్దారు సఅద్ బిన్ ఉబాదా (ర)యే.

హ్జ్రత్ ఆయిషా (ర) ఉల్లేఖనం ప్రకారం, ఆయన పుణ్యాత్ముడే. అయితే ఆ పరిస్థితిలో పాత పౌరుషం ఆయన్ను ఊపివేసింది. ఆయన సఅద్ బిన్ ముఆజ్ను ఉద్దేశించి, "దైవసాక్షి! నీవు చెప్పేది సరైనది కాదు. నీవు అతడ్ని చంపవు, చంపలేవు కూడా. అతనే మీ తెగకు చెందినవాడయి ఉంటే నీవు చంపడానికి సిద్ధపడవు" అని అన్నారు. ఉసైద్ బిన్ హుజీర్ నిలబడ్డారు. ఆయన సఅద్ బిన్ ముఆజ్గారి పినతండ్రి కొడుకు. ఆయన సఅద్ బిన్ ఉబాదాను

ఉద్దేశించి "నీవు చెప్పేది తప్పు, మేము తప్పకుండా అతణ్ణి చంపగలం. కపటులకు కొమ్ముకాస్తూ నీవిలా మాట్లాడుతున్నావు. కాబట్టి నీవు కూడా కపట విశ్వాసివనే అర్థమవుతోంది" అన్నారు. దీనిపై ఔస్, ఖజ్రజ్ తెగల వారు దిగ్గున లేచి పరస్పరం ఎదురెదురుగా నిలబడ్డారు. ఒకరితోనొకరు తలపడే ప్రమాదం ఏర్పడింది. దైవప్రవక్త(స) వేదికపైనే కూర్చుని అందరిని నిశ్శబ్దంగా ఉంచేందుకు ప్రయత్నించారు. చివరికి అందరూ మాట్లాడకుండా కూర్చున్నారు.

హజ్రత్ ఆయిషా (ర) ఉల్లేఖనం ఇలా ఉంది: "నేను ఆ రోజంతా రోదిస్తూనే ఉండిపోయాను. నా కన్నీరు ఆగడంగాని, నాకు నిద్రపట్టడంగాని జరగలేదు. నా తల్లిదండ్రులు కూడా నా గురించి చాలా బెంగగా ఉన్నారు. నేను ఏడుస్తూనే రెండు రాత్రులు, ఒక పగలు గడిపాను. నా కన్నీరు ఆగనే లేదు. అలా ఏడుస్తూ ఏడుస్తూ నా హృదయం బ్రద్దలై పోతుందా అనే అనుమానం కలిగింది నాకు. ఆ సమయంలోనే నా తల్లిదండ్రులిద్దరూ నా దగ్గరకు వచ్చారు. నేను అప్పటికి ఏడుస్తూనే ఉన్నాను. అప్పుడే ఓ అన్సారి స్త్రీ నా దగ్గరకు రావడానికి అనుమతి కోరింది. ఆమెకు అనుమతి లభించింది. నా దగ్గరకు వచ్చి ఆమె కూడా దుఃఖించడం ప్రారంభించింది. ఆ సమయంలోనే దైవప్రవక్త (స) నా దగ్గరకు వచ్చి సలాం చేసి కూర్చున్నారు. దైవప్రవక్త (స) నాపై అపవాదు చేయబడినప్పటి నుండి నా దగ్గర కూర్చోలేదు. ఒక నెల గడచిపోయింది. దైవవాణి అవతరణ కూడా జరగలేదు. బహుశా నా గురించి ఏదైన ఆదేశం వస్తుందని ఆశగా ఉన్నాను. దైవప్రవక్త (స) కూర్చునే కలిమా షహాదత్ చదివారు. అప్పుడు ఆయన ఇలా అన్నారు. 'ఆయిషా! నీ గురించి నాకు ఈ వదంతి అందింది. నీవేగనక శీలవతివి అయితే త్వరలోనే అల్లాహ్ నిన్ను నిర్దోషిగా ప్రకటిస్తాడు. నీవేగనక పాపం చేస్తే పశ్చాత్తాప హృదయంతో అల్లాహ్‌ను మన్నించమని వేడుకో. దాసుడు తన పాపాన్ని ఒప్పుకొని తౌబా చేసుకుంటే అల్లాహ్ ఆ తౌబాను స్వీకరిస్తాడు.'

హజ్రత్ ఆయిషా (ర) ఉల్లేఖనం ఏమిటంటే, దైవప్రవక్త (స) ఇలా అన్న తరువాత నేను నా తండ్రి గారితో, మీరే దైవప్రవక్త(స)కు సమాధానం చెప్పండి అన్నాను. మా తండ్రిగారు 'దైవసాక్షి! దైవప్రవక్త (స)కు ఏం సమాధానం చెప్పాలో

నాకు అర్థం కావడం లేదు' అన్నారు. ఆ తరువాత మా అమ్మగారిని దైవప్రవక్త(స)కు సమాధానమివ్వమని అడిగాను. ఆమె కూడా, 'దైవసాక్షి! దైవప్రవక్తకు ఏం సమాధానం చెప్పాలో నా మెదడుకు అందడం లేదు' అన్నారు. అప్పుడు స్వయంగా నేనే విన్నవించుకోదలిచాను. అప్పటికి నేను బాలికనే. దైవగ్రంథం కూడా నేను ఎక్కువగా చదవలేదు. "దైవసాక్షి! నిశ్చయంగా, నాకు కూడా మీరు విన్న విషయమే తెలిసింది. మీ హృదయాల్లో ఆ విషయమే తిష్ఠవేసి ఉన్నందున, దాన్ని మీరు యదార్థమే అనుకుంటున్న తరుణంలో, నేను ఈ అపవాదుకు అతీతురాలను అని అన్నా ప్రజలు నా మాటను నమ్మరు. నేనే గనక ఈ పాపాన్ని ఒప్పుకుంటే, అల్లాహ్‌కు బాగా తెలుసు నేను నిర్దోషినని. అప్పుడు ఆయన తప్పక నేను నిర్దోషిని అని ధృవపరుస్తాడు. కాబట్టి దైవసాక్షి, మనిద్దరి ఉపమానం, హజ్రత్ యూసుఫ్ (అ), ఆయన తండ్రిగార్ల లాంటిదే. ఆయన తండ్రి ఇలా అన్నారు. "శ్రేష్ఠమైన సహనం వహిస్తాను, బాగా వహిస్తాను, మీరు చెబుతున్న దాన్ని గురించి అల్లాహ్‌నే సహాయం కోరాలి." (యూసుఫ్-18)

ఆ తరువాత నేను మాట్లాడకుండా పడకపై ముఖం తిప్పుకొని పడుకున్నాను. నేను ఆ నేరం చేయలేదని, నిర్దోషినని అల్లాహ్‌కు బాగా తెలుసు. నా సచ్ఛీలాన్ని ఆయన తప్పక ప్రకటిస్తాడు. అయితే నా గురించి అల్లాహ్ వహి అవతరింపజేస్తాడని, నా గొప్పదనాన్ని చాటుతాడని మట్టుకు నేను అనుకోనే లేదు. నా గురించి దైవవాణి అవతరించేటంతటి దాన్ని మాత్రం కాదు అని నాకు బాగా తెలుసు. కాని అల్లాహ్, నాకు కనీసం స్వప్నంలోనయినా నా సచ్ఛీలాన్ని గురించి చూపించగలడనే నమ్మకం మాత్రం బాగా ఉండేది. కాబట్టి, దైవసాక్షి! ఆ సమయంలో దైవప్రవక్త (సఅసం) మా మధ్య కూర్చుని ఉన్నారు. మా యింటి వ్యక్తుల్లో ఎవ్వరూ బయటకు వెళ్ళలేదు. అప్పుడే దైవప్రవక్త(స)పై దైవవాణి అవతరణ ప్రారంభమయింది. దివ్యవాణి అవతరణ సమయంలో సాధారణంగా ఆయన ఏ పరిస్థితికి లోనయ్యేవారో అప్పుడు అదే పరిస్థితికి లోనయ్యారు. దైవవాణి భారం వల్ల శీతాకాలపు రోజుల్లో కూడా ఆయన ముఖంపై చెమట బిందువులు ముత్యాల్లా కారుతూ ఉండేవి. (దివ్యఖుర్ఆన్: 24: 11-26)

దైవప్రవక్త (స) ఆనందంగా, చిరునవ్వుతో కనబడ్డారు. కాబట్టి అన్నిటికంటే ముందు నన్ను ఉద్దేశించి, ఆయిషా! అల్లాహ్ నిన్ను ఈ నేరం నుంచి విముక్తి చేశాడు అన్నారు.

అప్పుడు మా అమ్మగారు లేచి నిలబడి దైవప్రవక్త (స)కు కృతజ్ఞతలు చెప్పుకో అని నన్ను పురమాయించారు. నేను, "దైవసాక్షి! నేనాయనకు కృతజ్ఞత ఎందుకు చెప్పుకోవాలి? అల్లాహ్‌కే కృతజ్ఞత చెబుతాను" అని అన్నాను.

ఆమె ఉల్లేఖనం ప్రకారం, "ఇన్నల్లజీన జాఊబిల్ ఇఫ్క్" (ఎవరైతే అపనింద వేశారో) మొదలు పది ఆయత్‌లు దేవుడు అవతరింపజేసి నాపై మోపబడిన అపనింద నుండి నన్ను అతీతురాలిగా చేశాడు అని అన్నారు ఆమె."

హ(జత్ అబూబక్ర్ (ర)గారి ఉవాచ ఇలా ఉంది: "నేను బంధువు అయినంచున, ఆయన పేదవాడైనందున మిస్తహ్ బిన్ అసాసాకు ఆర్థికంగా సహాయం చేసేవాణ్ణి. ఆ తరువాత నేను, దైవసాక్షి ఇక నుండి మిస్తహ్‌కు ఆర్థిక సహాయం చేయనని నిర్ణయించుకున్నాను. కారణం అతడు ఆయిషాపై అపనిందవేసే వాళ్ళల్లో ఒకరు కావడమే. అయితే ఆయన గురించి అల్లాహ్ ఈ ఆదేశాన్ని అవతరింపజేశాడు–

"మీలో ఉదార స్వభావులు, ఆర్థిక స్తోమత కలిగినవారు (ఈ అపనిందలో పాలుపంచుకున్న) తమ బంధువులకు, నిరుపేదలకు, దైవమార్గంలో ఇల్లువాకిలి వదలి వలస వచ్చినవారికి సహాయం చేయం అని ప్రమాణం చేయకూడదు. వారిని క్షమించాలి, దయజూపాలి. దేవుడు మిమ్మల్ని క్షమించాలని మీరు కోరుకోరా?దేవుడు ఎంతో క్షమాశీలి, అమిత దయామయుడు." (24:22)

ఈ ఆయత్ అవతరించగానే అబూబక్ర్ (ర) అన్నారు– ఎందుకు కోరుకోను? దైవసాక్షి! అల్లాహ్ నన్ను మన్నించాలనే నేను కోరుకుంటున్నాను. అప్పటి నుండి ఆయన మిస్తహ్‌కు పూర్వం వలెనే ఆర్థిక సహాయం అందజేయ మొదలెట్టారు. "దైవసాక్షి! నేను ఇక ఎప్పుడు ఆ సహాయాన్ని ఆపను" అన్నారాయన.

హ(జత్ ఆయిషా(ర) ఇలా సెలవిచ్చారు: దైవప్రవక్త (స) నా గురించి హ(జత్ జైనబ్ బిన్తె జహష్‌ను కూడా అడిగి తెలుసుకున్నారు. ఆయిషా గురించి

నీ అభిప్రాయం ఏమిటి, ఆమె గురించి ఏమి చూశావు అని. అప్పుడామె, 'దైవప్రవక్తా! నేను నా చెవుల్ని, నా కళ్ళను పాపాల నుండి రక్షించదలిచాను. నాకు తెలిసినంత మటుకు పుణ్యం తప్ప ఆమెలో ఏమీ చూడలేదు' అని అన్నారామె. ప్రవక్త భార్యల్లో జైనబ్ (ర) గారు ఒక్కరే నా సమవయస్కురాలు. కాబట్టి అల్లాహ్, ఆమె దైవభీతివల్ల పాపంలో పడకుండా కాపాడారు. హ॥జత్ ఆయిషా(ర) ఉవాచ ప్రకారం ఆమె సోదరి హమ్నా మాత్రమే ఈ విషయంలో జగడమాడేది. అపనింద వేసేవారి ఇంట ఆమె కూడా నాశనం అయ్యేవారిలో చేరిపోయింది.

ఇబ్నె షిహాబ్, ఈ హదీసు పైన చెప్పిన నలుగురి ద్వారా అందింది అని అన్నారు. అదేకాకుండా ఉర్వా (ర) ప్రకారం, హ॥జత్ ఆయిషా (ర), ఏ వ్యక్తి గురించి అపవాదు వేయబడిందో ఆయన (హ॥జత్ సఫ్వాన్) ఈ మాటలు విని ఆశ్చర్యంగా 'సుబ్హానల్లాహ్!' అన్నారు. ఎందుకంటే "ఎవరి ఆధీనంలో నా ప్రాణం ఉందో, ఆ దేవుని సాక్షి! నేను ఈరోజు వరకు ఏ స్త్రీ తలపై ఉన్న ఆచ్ఛాదనను కూడా తొలగించలేదు" అని అన్నారు ఆయన. ఆ తరువాత హ॥జత్ సఫ్వాన్ (ర) దైవమార్గంలో పోరాడుతూ అమరగతులయ్యారని హ॥జత్ ఆయిషా ఉల్లేఖించారు. (బుఖారి)

హ॥జత్ ఆయిషా (ర) ప్రవచనం "అపవాదు ఆరోపణ నుండి నాకు విముక్తి కలిగిన తరువాత, దైవప్రవక్త (స) వేదికపై నిలబడి దివ్యఖుర్ఆన్ పారాయణం చేశారు. ఆ తరువాత వేదిక దిగి ఇద్దరు పురుషులు, ఒక స్త్రీకి ఖుర్ఆన్ ఆదేశం ప్రకారం శిక్ష విధించారు. కాబట్టి వారికి కొరడాల శిక్ష విధించబడింది (అంటే హ॥జత్ హస్సాన్ బిన్ సాబిత్ (ర), హ॥జత్ మిస్తహ్(ర), హ॥జత్ హమ్నా బిన్ జహష్ (ర)లను కొరడాలతో కొట్టడం జరిగింది.) (తిర్మిజి)

## తహ్రీమ్ సంఘటన

హ॥జత్ ఆయిషా (ర) ఉల్లేఖనం: దైవప్రవక్త (స) హ॥జత్ జైనబ్ (ర) బిన్ జహెష్ దగ్గరకు వెళ్ళినప్పుడు అక్కడ కొంతసేపాగి తేనెతో తయారైన పానకం త్రాగేవారు. ఒక రోజు నేను హ॥జత్ హఫ్సా (ర)ని, మనలో ఎవరి దగ్గరకైనా

సరే దైవప్రవక్త(స) వచ్చినప్పుడు తమ నోటి నుండి 'మగాఫీర్' వాసన వస్తోంది, మీరు మగాఫీర్ తిన్నారా అని అడుగుదాం అన్న దానిపై ఏకీభవించాము. (మగాఫీర్ అంటే ఓ రకమైన పువ్వు. అందుండి ఓ రకమైన నీసు వాసన వస్తుంది). కాబట్టి దైవప్రవక్త (స) మాలో ఒకరి దగ్గరకు వచ్చినప్పుడు మేము ఆ మాటే అన్నాము. దైవప్రవక్త(స) "మగాఫీర్ తినలేదు. తేనెతో తయారైన పానకం జైనబ్ ఇంట త్రాగాను, ఇక నుండి నేను తేనెను త్రాగనులే" అని అన్నారు. అప్పుడు ఈ క్రింది ఆయత్ అవతరించింది:

"ఓ ప్రవక్తా! నీవు అల్లాహ్ హలాల్ చేసిన దాన్ని నీపై ఎందుకు హరాం చేసుకున్నావు? నీ భార్యలను సంతోషపెట్టడానికా? అల్లాహ్ క్షమించేవాడు కరుణించేవాడూను. అల్లాహ్ మీ కోసం మీ ప్రమాణాల కట్టుబాటుల నుండి బయటపడే మార్గం నిర్ణయించాడు. అల్లాహ్ మీ సంరక్షకుడు. ఆయన అన్నీ ఎరిగినవాడు, సర్వజ్ఞాని." (అదే విధంగా ఈ విషయం కూడా దృష్టిలో ఉంచుకోదగ్గదే, అదేమిటంటే) ప్రవక్త తన మాటను ఒక భార్యతో రహస్యంగా చెప్పాడు. ఆమె ఆ రహస్యాన్ని ఇంకొకరి ముందు బట్టబయలుచేసింది. ప్రవక్త భార్య ఈ రహస్యం బయటపెట్టిన విషయాన్ని అల్లాహ్ ఆయనకు తెలియజేశాడు. ప్రవక్త (కొంత వరకు ఆమెను) క్షమించి ఈ విషయాన్ని తెలియజేసినప్పుడు ఆమె, ఈ విషయం మీకెవరు చెప్పారు అని అడిగింది. అప్పుడు ప్రవక్త, అన్నీ తెలిసినవాడు చెప్పాడు అని జవాబిచ్చాడు - ఒకవేళ మీరిద్దరు అల్లాహ్ సమక్షంలో తౌబా చేసుకుంటే మంచిది. (ఇది మీ మేలు కోసమే. ఎందుకంటే మీ హృదయాలు గాడి తప్పాయి. మీరు గనక ప్రవక్తకు వ్యతిరేకంగా ఒక్కటైతే, అల్లాహ్ అతని సంరక్షకుడని, ఆ తరువాత జిబ్రయీల్, సన్మార్గులైన విశ్వాసులు, ఆయన దూతలు అందరూ ఆయన ప్రవక్తకు తోడున్నారని గ్రహించండి." (తహ్రీమ్)

## దైవప్రవక్త(స) తన భార్యలకు దూరంగా ఉండటం

హజ్రత్ ఉమర్ (ర) ఇలా ఉల్లేఖించారు: "దైవప్రవక్త (స) తన భార్యలకు దూరంగా ఉన్నప్పుడు ఒక రోజు నేను మస్జిద్‌లో ప్రవేశించి చూడగా ప్రజలు నేలపై చిన్న చిన్న రాళ్ళను విసురుతూ, దైవప్రవక్త (సఅసం) తమ భార్యలకు

విడాకులిచ్చారన్న మాటలు వారినోట విన్నాను. ఈ సంఘటన పరదా ఆదేశాలు రాకముందు జరిగింది.

"ఇది విన్న నేను నా మనస్సులో, నేడే ఈ విషయాన్ని గురించి నిజానిజాలు తెలుసుకోవాలనుకున్నాను. కాబట్టి నేను హజ్రత్ ఆయిషా (ర) దగ్గరికి వెళ్ళి, అబూబక్ర్ (ర) కూతురా! నీవు దైవప్రవక్త (స)ను బాధించేటంతమట్టుకు వెళ్ళావా? అని అడిగాను. దానికి ఆమె ఖత్తాబ్ కుమారుడా! నన్ను అడుగుతావేమిటి! నీ కూతురినే అడగకపోయావా? అని బదులిచ్చారు.

"ఇది విన్న నేను హజ్రత్ హఫ్సా (ర) దగ్గరికి వెళ్ళి, 'హఫ్సా నీవు దైవప్రవక్త(స)కు బాధ కలిగించే అంతదానివయ్యావా? నాకు తెలుసు దైవప్రవక్తకు నీపైన ప్రేమలేదని, నేనే గనక లేకుంటే నీకు తలాక్ ఇచ్చేసేవారు' అని అన్నాను. ఇది విని హఫ్సా బాగా ఏడ్చింది. ఆ తరువాత నేను దైవప్రవక్త (సఅసం) ఎక్కడున్నారని అడిగాను. పై అంతస్తులో అని జవాబు చెప్పింది.

పై అంతస్తుకు వెళ్ళి చూడగా దైవప్రవక్త (సఅసం)గారి బానిస రిబాహ్(ర) కనబడ్డారు. ఆయన పైఅంతస్తు మెట్లపై కూర్చుని కాళ్ళు వ్రేళ్ళాడదీసి ఉన్నారు. ఆ మెట్ల పైనుండే దైవప్రవక్త(స) ఎక్కిదిగేవారు. రిబాహ్‌ను ఉద్దేశించి, నా కోసం అనుమతి తీసుకోండి అని అన్నాను. రిబాహ్ నా మాటలను విని పైకి దృష్టిని సారించి నన్ను ఎగాదిగా చూసి మాట్లాడకుండా కూర్చున్నారు. నేను తిరిగి అడిగాను నా కోసం అనుమతి తీసుకోండి అని. రిబాహ్ తిరిగి తల పైకెత్తి నా వైపు చూసి ఊరుకున్నారు.

ఆ తరువాత నేను గట్టిగా అరిచాను. రిబాహ్! నా కోసం దైవప్రవక్త(స) నుండి అనుమతి అడగండి. బహుశా నేను హఫ్సా తరఫున మాట్లాడదానికి వచ్చానని దైవప్రవక్త (స) అనుకోవచ్చు. దైవసాక్షిగా చెబుతున్నాను. ఆయన హఫ్సా తలను తెగవెయ్యమని ఆజ్ఞాపిస్తే, ఆమె తలను తెగవెయ్యగలను అని. ఈ మాటలు నేను పెద్దగా వినబడేటట్లే అన్నాను. ఇది విన్న రిబాహ్ పైకి రండి అని సైగ చేశారు.

అప్పుడు నేను దైవప్రవక్త (స) సన్నిధిలో హాజరయ్యాను. అప్పుడు ఆయన చాపపై పడుకొని ఉన్నారు. అక్కడ కూర్చున్నాను. దైవప్రవక్త (స) తన లుంగీని సరిచేసుకున్నారు. అప్పుడు ఆయన కేవలం లుంగీ మాత్రమే కట్టుకొని ఉన్నారు. అవి తప్ప ఎలాంటి అంగవస్త్రం ఆయన శరీరంపై లేదు. చాప వత్తుకొని పోయిన గుర్తులు ఆయన శరీరంపై బాగా కనబడుతున్నాయి. ఆ తరువాత నా దృష్టి దైవప్రవక్త(స)గారి గోదాముపై పడింది. అక్కడేముంది, పిడికెడు బార్లీ గింజలు మాత్రమే ఉన్నాయి. అది కూడా దాదాపు ఒక 'సాఅ'. అంతే పరిమాణం గల 'ఖర్త్' పైఅంతస్తులో ఓ మూలన ఉంది. ఓ పచ్చి చర్మం వ్రేలాడుతోంది. అది చూసిన నాకు కళ్ళవెంట నీళ్లు కారసాగాయి.

"నన్ను చూసి దైవప్రవక్త 'ఖత్తాబ్ కుమారుడా! ఎందుకు ఏడుస్తున్నావు' అని అడిగారు. నేను, దైవప్రవక్తా! ఎందుకు ఏడ్వను! ఇది (చాప) మీ వంటిపై గుర్తులు వేసింది. ఇది గోదాము. ఇందులో ఉన్న వస్తువులన్నీ చూస్తూ ఉన్నాను. మరో ప్రక్క ఖైసర్, కస్రాలు ఉన్నారు. వారు పండ్లతోటలు, సెలయేరులు పారే ఉద్యానవనాల్లో (అందమైన భవనాల్లో) ఉంటున్నారు. మీరు దైవప్రవక్త! దైవం తరఫున నియమించబడిన వారు. ఇదా మీ ఆస్తి అంతా కలసి? అని విన్నవించుకున్నాను."

అప్పుడు దైవప్రవక్త (స) ఇలా సెలవిచ్చారు. "కాని మనకోసం పరలోకం ఉంది. వారికోసం ఈ ప్రపంచం మాత్రమే. నీవు దీని పట్ల తృప్తి పడలేదా? అని అడిగారు 'అవును' (మనకు తృప్తి ఉంది) అన్నాన్నేను-

హజ్రత్ ఉమర్ (ర) అంటున్నారు. నేను ఎప్పుడైతే దైవప్రవక్త(స) సన్నిధిలో హాజరయ్యానో అప్పుడు ఆయన ముఖంపై ఉగ్రరూపచిహ్నాలు కనబడ్డాయి. నేను అడిగాను, "దైవప్రవక్తా (స)! స్త్రీల విషయంలో మీకు వచ్చిన కష్టం ఏమిటీ? మీరు వారికి తలాక్ ఇస్తే అల్లాహ్, జిబ్రాయీల్, మీకాయీల్, నేను, అబూబక్ర్ ఇంకా ముస్లిములంతా మీకు తోడుగా ఉంటారు" అని.

హజ్రత్ ఉమర్(ర) ఇలా అంటారు, "దైవకృప వల్ల నేను ఎప్పుడైనా ఏ విషయంలోనైతే మాట్లాడుతానో, అల్లాహ్ నా మాటలను ధృవీకరిస్తాడని నాకు నమ్మకం ఉండేది. కాబట్టి ఈ సంభాషణ తరువాత ఈ ఆయత్ అవతరించింది:

"మీరే గనుక ప్రవక్తకు వ్యతిరేకంగా ఒక్కటైతే, అల్లాహ్ అతని సంరక్షకుడు, ఆ తరువాత జిబ్రాయీల్, సన్మార్గులైన విశ్వాసులు, ఆయన దూతలు అందరూ ఆయనకు (ప్రవక్తకు) తోడున్నారని గ్రహించండి." (తహ్రీమ్)

హజ్రత్ ఆయిషా (ర), హఫ్సా(ర) (ఉమర్ (ర)గారి కుమార్తె) దైవప్రవక్త (స) భార్యలలో పైచేయిగా ఉన్నారు. ఈ ఆయత్ అవతరణ తరువాత దైవప్రవక్త(స)ను నేను అడిగాను– "దైవప్రవక్తా! మీరు మీ భార్యలకు విడాకులు (తలాక్) ఇచ్చారా?" అని. దానికి దైవప్రవక్త (సఅసం), లేదు అని సెలవిచ్చారు. "దైవప్రవక్తా! నేను మస్జిద్‌లోనికి వెళ్ళినప్పుడు ప్రజలు నేలమీద చిన్నరాళ్ళు విసురుతూ తమరు భార్యలకు తలాక్ ఇచ్చారని చెబుతూ ఉండగా విన్నాను. ఇప్పుడు నేను వారి దగ్గరికి వెళ్ళి దైవప్రవక్త (సఅసం) తలాక్ ఇవ్వలేదని చెప్పవచ్చా అని అడిగాను. అప్పుడు ఆయన, "నీవనుకుంటే అలా చేయవచ్చు" అని అనుమతి ఇచ్చారు. నేను ఆ తరువాత దైవప్రవక్త (సఅసం)తో ఆయన ముఖంపై ఉన్న కోపపు గుర్తులు పోయి ఆయన నవ్వే వరకు అక్కడనే కూర్చుని మాట్లాడాను. ఆ తరువాత ఆయన క్రిందికి దిగారు. నేనూ కర్ర పట్టుకుంటూ క్రిందికి దిగాను. దైవప్రవక్త (స) మాత్రం కర్రపట్టుకోకుండానే క్రిందికి దిగి వచ్చారు. ఆయన నేలపై నడిచినట్లుగా క్రిందికి దిగారు. నేనడిగాను, "దైవప్రవక్తా! తమరు పై అంతస్తుపై ఇరవై తొమ్మిది రోజులు ఉన్నారు?" అని. అప్పుడు ఆయన సమాధానం ఇచ్చారు. "నెలకు ఇరవై తొమ్మిది రోజులు కూడా ఉంటాయి" అని.

ఆ తరువాత నేను మస్జిద్ ద్వారం దగ్గర నిలబడి దైవప్రవక్త (స) తమ భార్యలకు తలాక్ ఇవ్వలేదు అని బిగ్గరగా ప్రకటించాను.

హజ్రత్ జాబిర్ (ర) గారి ఉల్లేఖనం:

ఓ రోజు హజ్రత్ అబూబక్ర్ (ర), దైవప్రవక్త (స) సన్నిధికి వచ్చినప్పుడు ద్వారం దగ్గర ప్రజలు కూర్చొని ఉన్నారు. ఎవరికీ లోనికి ప్రవేశించే అనుమతి లభించలేదు. హజ్రత్ అబూబక్ర్ (ర)కు మాత్రమే అనుమతి లభించింది. ఆయన లోనికి ప్రవేశించారు. తరువాత హజ్రత్ ఉమర్ (ర) వచ్చారు. ఆయనకు కూడా అనుమతి లభించింది. దైవప్రవక్త (స) మౌనంగా కూర్చొని ఉండడాన్ని అబూబక్ర్

(ర) గమనించారు. ఆయన చుట్టూ ఆయన భార్యలు కూర్చుని ఉన్నారు. అబూబక్ర్ (ర)కు ఎలాగైనా ఆయన్ని నవ్వించాలన్న ఆలోచన వచ్చింది. అప్పుడు ఆయన ఇలా అన్నారు. "దైవప్రవక్తా! ఒకవేళ ఖారిజా కుమార్తె (అంటే అబూబక్ర్ భార్య) ఖర్చుకోసం నన్ను ఎక్కువ డబ్బు అడిగితే నేను నిలబడి ఆమె మెడపై కొడ్తాను." ఇది విన్న దైవప్రవక్త (స) నవ్వేశారు. ఆ తరువాత ఇలా అన్నారు. "నీవు చూడడం లేదా? నా చుట్టూ కూర్చున్నవారు కూడా ఖర్చుల కోసం నన్ను ఎక్కువ డబ్బు అడుగుతున్నారు." ఇది విన్న అబూబక్ర్(ర) ఆయిషా(ర) దగ్గరికి వెళ్ళి ఆమె మెడపై చేత్తో కొట్టారు. ఉమర్(ర) కూడా లేచి హఫ్సా మెడపై కొట్టి మీరు దైవప్రవక్త (స) దగ్గర లేనిదాన్ని తెచ్చివ్వమని ఆయన్ను అడుగుతున్నారా? అని అన్నారు. దానికి దైవప్రవక్త(స) భార్యలు "దైవసాక్షి! దైవప్రవక్త (సఅసం) దగ్గర లేనిదాన్ని ఇకముందు మేమెప్పుడూ అడగం" అన్నారు.

ఆ తరువాత దైవప్రవక్త (స) తమ భార్యలందరి నుండి ఇరవై తొమ్మిది రోజులు లేక ఒక నెల కోసం ఎడబాటు పాటించారు. ఆ తరువాతనే "యా అయ్యుహన్నబీయు ఖుల్ లి అజ్వాజిక్" అన్న ఆయత్ అవతరించింది. ఈ ఆయత్ అవతరించిన తరువాత దైవప్రవక్త (స) మొట్టమొదట హజ్రత్ ఆయిషా (ర) దగ్గరికి వెళ్ళి ఆమెతో ఇలా అన్నారు: "నేను నీ ముందు ఒక విషయాన్ని ఉంచుతున్నాను. దీనిపై నిర్ణయం తీసుకునే ముందు నీ తల్లిదండ్రులతో సంప్రదించుకో. సమాధానం ఇవ్వడంలో త్వరపడవద్దు" అని అన్నారు. అదేమిటీ దైవప్రవక్తా! అని ఆమె అడిగారు.

అప్పుడు దైవప్రవక్త (స) ఈ ఆయత్‌ను పఠించి వినిపించారు. అప్పుడు హజ్రత్ ఆయిషా (ర), "దీన్ని గురించి నేను నా తల్లిదండ్రులతో సంప్రదించాలా? నేను దైవాన్ని, దైవప్రవక్తను, పరలోక భాగ్యాలను కోరుకుంటున్నాను. నా ఈ నిర్ణయాన్ని మరే భార్యకు చెప్పవద్దని మిమ్మల్ని విన్నవించుకుంటున్నాను" అని అన్నారు. అప్పుడు దైవప్రవక్త (స), "నన్ను ఏ భార్య అయినా అడిగితే తప్పకుండా తెలియజెప్తాను (ఎందుకంటే) అల్లాహ్ నన్ను చిక్కుల్ని సృష్టించేవాడుగా, తగవులు పెట్టేవాడిగా చేసి పంపలేదు. సరికదా సునాయాసంగా బోధించేవానిగా చేసి పంపాడు" అని అన్నారు. (ముస్లిమ్)

హజ్రత్ ఆయిషా (ర) ఇలా అంటున్నారు: "ఎప్పుడైతే దైవప్రవక్త (స)కు దైవం తరఫున, మీరు మీ భార్యల నుండి వేరుపడే నిర్ణయం గైకొనే స్వేచ్ఛ ఉందనే ఆజ్ఞ ఇవ్వబడిందో ఆయన ఈ విషయాన్ని అందరికంటే ముందు నాతోనే ప్రస్తావించారు. ఆయన ఇలా ప్రారంభించారు:

"నేను నిన్ను ఓ మాట అడుగుతాను. సమాధానం ఇవ్వడంలో తొందర పడవద్దు. నీ తల్లిదండ్రుల్ని అడిగి మరీ జవాబివ్వు."

దైవప్రవక్త (స) ఇలా చెప్పడానికి కారణం ఏమిటంటే, నా తల్లిదండ్రులు దైవప్రవక్త(స) నుండి వేరయ్యే సలహా ఎప్పుడూ ఇవ్వరు అన్నదే. ఆ తరువాత దైవప్రవక్త(స) అల్లాహ్ ఈ ఆజ్ఞ ఇచ్చాడని తెలియజేశారు.

"ప్రవక్తా! నీ భార్యలతో ఇలా చెప్పెయ్యి! మీరు ఈ ప్రపంచాన్ని, దాని అలంకారాలను కోరుకుంటుంటే, రండి, మీకు ఏదో కొంత ఇచ్చి సముచిత పద్ధతిలో మిమ్మల్ని పంపించేస్తాను. ఒకవేళ మీరు అల్లాహ్‌ను, ఆయన ప్రవక్తను, పరలోక నివాసాన్నే కోరుకుంటుంటే, మీలో ఎవరైతే సన్మార్గాన్ని అవలంబిస్తారో వారి కోసం అల్లాహ్ గొప్ప ప్రతిఫలాన్ని సమకూర్చి ఉంచాడని తెలుసుకోండి." (ఖుర్‌ఆన్)

ఇది విన్న నేను, ఈ విషయంలో నా తల్లిదండ్రులతో సంప్రదించే అవసరం ఏమిటీ, నేను అల్లాహ్‌ను, ఆయన ప్రవక్తను, పరలోకాన్ని కోరు కుంటున్నాను అని విన్నవించుకున్నాను" అని హజ్రత్ ఆయిషా చెప్పారు.

ఆ తరువాత ఆయన ఇతర భార్యలు కూడా హజ్రత్ ఆయిషా(ర) వలెనే దైవప్రవక్త (స) ఎడబాటును కోరుకోలేదు. (ముస్లిమ్)

మహాప్రవక్త ముహమ్మద్ (స) ఏ లక్ష్యం కోసం ప్రభవించారో ఆ లక్ష్యం నెరవేరింది. యావత్తు అరేబియాలో ఇస్లాం విజయకేతనం ఎగురవేయబడింది. సర్వత్రా నీతి, న్యాయం, శాంతి, సౌభ్రాతృత్వాలతో నిండిన ఓ సత్సమాజం, ఓ సమగ్ర జీవన వ్యవస్థ నెలకొన్నాయి. అందువల్ల దైవప్రవక్త (స) ఇప్పుడు విశ్వ ప్రభువు సన్నిధికి మరలిపోవాల్సిన సమయం ఆసన్నమయింది. ఆయన తన చివరి దినాల్లో వ్యాధిగ్రస్తులయి ఇతర భార్యల అనుమతితో హజ్రత్ ఆయిషా (ర)గారి ఇంటికొచ్చి ఉండసాగారు.

హజ్రత్ ఆయిషా (ర) ఉల్లేఖిస్తున్నారు: "(చివరి రోజున) దైవప్రవక్త (స) సన్నిధిలో అబ్దుర్రహ్మాన్ బిన్ అబూబక్ర్ (ర) హాజరయ్యారు. అప్పుడు ఆయన్ను నేను నా వక్షస్థలానికి చేర్చుకొని ఉన్నాను. అబ్దుర్రహ్మాన్ (ర) దగ్గర తడిపిన మిస్వాక్ (పలుదోము పుల్ల) ఉంది. దైవప్రవక్త (స)కు అందించాను. ఆయన దాంతో బాగా పండ్లు తోముకున్నారు. అంతకు ముందు అంతచక్కగా మిస్వాక్ చేయగా నేను చూడలేదు. మిస్వాక్ చేయడం పూర్తి అయిన తరువాత కాస్సేపటికి దైవప్రవక్త(స) తన (చూపుడు) వ్రేలిని ఆకాశం వైపు పైకెత్తి "ఫిర్రఫీఖిల్ ఆలా" అని మూడుసార్లు అన్నారు. ఆ తరువాత ఆయన పరమపదించారు."

దైవప్రవక్త (స) వ్యాధిగ్రస్థులైనప్పుడు అవూజుబిర్రబ్బిల్ ఫలఖ్, అవుజుబిర్రబ్బిన్నాస్ అనే సూరాలు పఠించి తమ శరీరంపై ఊదుకునేవారు. అదే విధంగా తమ శరీరంపై చేతుల్తో నిమురుకునేవారు. ఆయన వ్యాధిగ్రస్తులైన తరువాత నేను ఆ సూరాలను చదివి ఊదాను. దైవప్రవక్త (స) శరీరంపై చేతుల్తో నిమిరాను అని హజ్రత్ ఆయిషా (ర) ఉల్లేఖించారు. (బుఖారి)

## చిట్టచివరి మాటలు

నేను దైవప్రవక్త(స) మరణశయ్య చెంతవున్నప్పుడు తన వీపు నాకు ఆనించి ఊతంగా కూర్చున్నారు. అప్పుడు ఆయన తమ నోట ఇలా అంటూ ఉండగా చెవులు రిక్కించి విన్నాను.

**"అల్లాహుమ్మగ్ఫిర్‌లీ, వర్‌హమ్‌నీ, వల్‌హిఖ్‌నిబిర్రఫీఖ్."**

(ఓ అల్లాహ్ నన్ను మన్నించు, నన్ను కరుణించు, నన్ను నా పరమ స్నేహితుడితో కలుపు) అంటూ హజ్రత్ ఆయిషా (ర) ఉల్లేఖించారు.

## యూదులపై అల్లాహ్ అభిశాపం

దైవప్రవక్త (స) తిరిగి ఆరోగ్యం పొందకుండా పరమపదించిన ఆ వ్యాధిలోనే ఇలా అన్నారు:

అల్లాహుతాల యూదులను శపించాడు. ఎందుకంటే వారు ప్రవక్తల సమాధుల్ని ఆరాధనాలయాలుగా చేసుకున్నారు. అని హజ్రత్ ఆయిషా(ర) ఉల్లేఖించారు.

హ(జత్ ఆయిషా (ర) ఉవాచ: దైవప్రవక్త (స) వ్యాధి ముదిరింది, (ఆయన నమాజు కోసం మస్జిద్‌కు వెళ్లలేకున్నారు) హ(జత్ బిలాల్ (ర) దైవప్రవక్త (స) దగ్గరకు నమాజు గురించి చెప్పడానికి వచ్చారు. అప్పుడు దైవప్రవక్త (స), నమాజు చేయించమని అబూబక్ర్‌తో చెప్పండని ఆదేశించారు.

నేనీ మాట విని దైవప్రవక్తా! అబూబక్ర్(ర) త్వరగా శోకతప్తులవుతారు. (మీ స్థానంలో ఆయన నిలబడి నమాజు చేయిస్తే దుఃఖం వల్ల) ఆయన కంఠం ప్రజలకు వినపడదు. మీరు హ(జత్ ఉమర్(ర)ను ఆదేశిస్తే బావుంటుంది అని అన్నారు హ(జత్ ఆయిషా (ర). ఇది విన్న దైవప్రవక్త(స) అబూబక్ర్‌నే నమాజు చేయించమని చెప్పండి అని అన్నారు.

దైవప్రవక్త (స) ఆదేశం విని నేను, హఫ్సా(ర)తో, మీరు దైవప్రవక్తతో, అబూబక్ర్ (ర) నమాజు చేస్తూ చాలా త్వరగా దుఃఖిస్తారు. దాంతో ఆయన కంఠం ప్రజలకు వినబడదు, ఆయన గనక ఉమర్‌గారికి నమాజు చేయించమని చెబితే బాగుంటుందని అడగమన్నానని హ(జత్ ఆయిషా(ర) చెప్పారు.

దైవప్రవక్త (స) (హ(జత్ హఫ్సా (ర) మాటలు విని) మీరు యూసుఫ్(అ) నాటి స్త్రీలు. అబూబక్ర్(ర)తో చెప్పండి నమాజు చేయించమని అని అన్నారు.

(అప్పుడు) హ(జత్ అబూబక్ర్ (ర)కు నమాజు చేయించే ఆదేశం ఇవ్వబడింది. ఆయన ప్రజలకు నమాజు చేయించారు.

హ(జత్ ఆయిషా (ర) ప్రవచనం ప్రకారం, హ(జత్ అబూబక్ర్ (ర) నమాజు ప్రారంభించగా దైవప్రవక్త (స)కు తన వ్యాధిలో కొంత తగ్గుదల గోచరించింది. ఆయన ఇద్దరు మనుషుల ఆధారంగా కాళ్లు నేలపై ఈడుస్తూ బయటకు వచ్చారు. ఆయన మస్జిద్‌లో ప్రవేశించగానే అబూబక్ర్ (ర) దైవప్రవక్త (స) రాకను గమనించి వెనక్కు జరగసాగారు. దైవప్రవక్త(స) ఆయన్ను ఆ స్థానంలోనే నిలబడమని సైగ చేశారు. ఆ తరువాత అలాగే ఆయన అబూబక్ర్(ర) దగ్గరికి చేరి ఆయనకు ఎడమ వైపున కూర్చుని నమాజు చేయించారు. అంటే అబూబక్ర్ (ర) నిలబడి దైవప్రవక్త(స)ను అనుసరిస్తే ప్రజలు అబూబక్ర్(ర)ను అనుసరించారు. (ముస్లిమ్)

"దైవప్రవక్త (స) చనిపోయినప్పుడు మా ఇంట తినడానికి పనికొచ్చే ఎలాంటి పదార్థం లేదు, నేను ఓ చిన్న మట్టికుండలో పోసి ఉంచిన కొన్ని 'జౌ' (బార్లీ గింజలు) తప్ప. చాలా రోజులదాకా వాటినే తింటూ గడిపాను. చివరికి ఓరోజు అవి కూడా అయిపోయాయి" అని హ|జత్ ఆయిషా (ర) అన్నారు.

హ|జత్ ఆయిషా (ర)గారి ఓ ఉల్లేఖనం ప్రకారం, మదీనా వచ్చిన రోజు మొదలు దైవప్రవక్త (స) గారి మరణం వరకు ప్రవక్త ఇంటివారు ఎప్పుడూ మూడు రోజుల వరకు వరుసగా గోధుమ రొట్టె కడుపునిండా తినలేదు.

మరో ఉల్లేఖనంలో, ఎప్పుడూ రెండు రోజులు జౌ రొట్టెలు కడుపునిండా తినలేదని, ఇంకో ఉల్లేఖనంలో, దైవప్రవక్త (స) ఇంటివారు రెండు రోజులు కడుపునిండా గోధుమ రొట్టె ఎప్పుడూ తినలేదని, అందులో ఒక రోజు తప్పకుండా ఖర్జూరాల పైన్నే గడపవలసి వచ్చేదని ఉంది. (ముస్లిమ్)

## ధర్మ బోధనా పీఠం

హ|జత్ ఆయిషా (ర) కుటీరంపై విశిష్ఠ కాంతికిరణాలు ప్రసరిస్తున్నాయి. దైవదూతలు ఆమెను దీవిస్తున్నారు. హ|జత్ ఆయిషా (ర) ధర్మబోధనా పీఠం అలంకరించారు. అప్పుడామె వయస్సు 18 సంవత్సరాలు మాత్రమే. ఆ కుటీరంలో ఆమె ఇంకా నలభై ఏళ్ళు గడపాల్సి ఉంది. ఆ కాలంలో ఆమె ముస్లిములకు ధర్మజ్ఞానం అందించే బాధ్యత చేబూనారు.

ఖుర్‌ఆన్ ప్రేమికులు హ|జత్ ఆయిషా(ర) సన్నిధికి చేరేవారు. వారు ఖుర్‌ఆన్ భావాన్ని, ఆయత్‌ల వ్యాఖ్యానాన్ని, ఇతర వివరాలను అడిగి తెలుసుకుని తమ ఆధ్యాత్మిక దాహాన్ని తీర్చుకునేవారు.

హదీసు విద్య నేర్చుకునే విద్యార్థులు కూడా వచ్చేవారు. దైవప్రవక్త(స) ప్రవచనాలను వారు విశ్వాసుల మాతృమూర్తి హ|జత్ ఆయిషా నోట విని తృప్తితో వెళ్ళేవారు.

పురుషులు వచ్చి పరదాలో ఉన్న తమ మాతృమూర్తి దగ్గర ఇస్లాం ఆదేశాలను అడిగి తెలుసుకునేవారు. అలాగే స్త్రీలు కూడా వచ్చి తమ సమస్యలకు పరిష్కారాలు తెలుసుకొని వెళ్ళేవారు.

నమాజు కానివ్వండి, జకాతు కానివ్వండి, రోజా అయినా, హజ్ అయినా, ఖుర్ఆన్ పారాయణం విషయమైనా, ఖుర్ఆన్‌ను అర్థం చేసుకునే జ్ఞానం అయినా, హదీసు జ్ఞానం అయినా, ధార్మిక సమస్యలైనా, వైద్యశాస్త్రం అయినా, ఒకటేమిటి, ఇహపరలోకాల జీవితానికి సంబంధించిన సమస్త జ్ఞానం- మన మాతృమూర్తి జ్ఞానసంపదలో ఒక శాస్త్రం అనేమిటి?- అన్నిటికీ మన మాతృమూర్తి తృప్తికరమైన జవాబులు ఇచ్చేవారు. ఇలా ఆమె ముస్లిమ్ సమాజాన్ని నైతికంగా, ధార్మికంగా, ఆధ్యాత్మికంగా తీర్చిదిద్దడంలో నిమగ్నమైపోయారు. ఇదే ఆమె జీవిత పరమార్థం. దానికోసమే అల్లాహ్ ఆమెను ఎన్నుకున్నాడు. అందుకే ఆమెను అంతిమ దైవప్రవక్త (స) గారికి సతీమణిగా చేశాడు.

హజ్రత్ ఆయిషా (ర)గారి ప్రవచనం సారాంశం: "దైవప్రవక్త (స) పరమపదించగానే మొత్తం అరేబియా (అంటే చాలామంది అని అర్థం) ఇస్లామ్ ధర్మం నుండి మరలింది. వారి మనస్సుల్లో కాపట్యం చోటుచేసుకుంది. దైవసాక్షి! నా తండ్రి (హజ్రత్ సిద్దీఖీ అక్బర్-ర)పై పెద్ద ఆపద వచ్చిపడింది. ఆ ఆపదే గనక ఓ గట్టి పర్వతంపై పడితే దాన్ని కూడా అది తుత్తునియలు చేసేది. ఇక ముస్లిముల పరిస్థితి సరేసరి. వర్షాకాలపు రాత్రివేళ, తోడేళ్ళతో నిండిన ప్రదేశంలో చెట్ల పొదల మాటున బిక్కుబిక్కుమంటూ నిలబడి బాగా తడిసిన గొర్రెలా ఉంది వారి పరిస్థితి. దైవసాక్షి! వారిలో ఏ విషయంపై ఏదైనా భేదాభిప్రాయం ఏర్పడితే మా తండ్రిగారు ఎగిరి వారి ముందు వ్రాలేవారు ఆ పరిస్థితిని అడ్డుకోడానికి."

(తిబ్రాని)

ఉర్వా బిన్ జుబైర్, దైవప్రవక్త(స) సతీమణి హజ్రత్ ఆయిషా (ర) ఇలా చెప్పారని ఉల్లేఖించారు:

"సతీమణులు దైవప్రవక్త (స) మిగిల్చిన సొత్తులో తమకు ఎనిమిదవ భాగం ఇవ్వమని అడగడానికి హజ్రత్ ఉస్మాన్ (ర)ను అబూబక్ర్ (ర) దగ్గరికి పంపదలిచారు. అప్పుడు నేను అలా చేయకండి, మీకు దైవభయంలేదా? దైవప్రవక్త(స), మాకు (ప్రవక్తలకు) వారసులు ఎవ్వరుండరు, మేము వదలి వెళ్ళినదంతా సదఖాయే అని అన్నది మీకు తెలియదా అన్నాను. నేను చెప్పిన మీదట వారు తమ ఆలోచనను వదులుకున్నారు." (బుఖారి)

రెండో ఖలీఫా హజ్రత్ ఉమర్ (ర) బిన్ ఖత్తాబ్ అమరగతి పొందాక, ముహాజిర్లు, అన్సార్‌లు కలసి హజ్రత్ ఉస్మాన్ (ర) బిన్ అప్ఫాన్‌ను ఖలీఫాగా ఎన్నుకున్నారు. సిద్దీఖీ, ఫారూఖీ ఖిలాఫత్ కాలంలో ఆయన ఆ ఇద్దరు ఖలీఫాలకు సలహాదారుడుగా కూడా ఉన్నారు. సహాబీ(ర)లలో ఆయనకు ఉన్నత స్థానం ఉంది. ప్రజలు ఆయన్ను గౌరవించేవారు. ఆయన ఎంతో దయార్ద్రహృదయుడు. ఆయన ఖిలాఫత్‌లో మొదటి ఆరేండ్లు మాత్రమే ప్రశాంతంగా గడిచాయి. ఆయన ఖిలాఫత్ గురించి ఎవరికీ ఎలాంటి ఆక్షేపణ ఉండేదికాదు. ప్రజలు ఖలీఫాను దీవించేవారు. ఖిలాఫత్ నిర్వహణలో ఆయనకు చేయూత ఇచ్చేవారు.

## యూదుల కుట్ర

కాని దినదినాభివృద్ధి చెందుతున్న ఇస్లామ్ శక్తిని చూసి యూదులకు కంపరమెత్తింది. తమ ఉనికికే ప్రమాదం ఏర్పడిందని భావించి భయపడ్డారు. అందుకని వారు ఇస్లామీయ పాలనకు వ్యతిరేకంగా కుట్రలు పన్నడం ప్రారంభించారు. వారి లక్ష్యం హజ్రత్ ఉస్మానే. ఇక ఏముంది. ఖలీఫా తీసుకునే నిర్ణయాలపై నలువైపుల నుండి విమర్శలు ప్రారంభం అయ్యాయి. ఈ కుట్రదారుల నాయకుడు అబ్దుల్లా బిన్ సబా అనే యూదుడు. ముస్లిమ్‌గా నాటకమాడి ముస్లిముల్లో జాతి విద్వేషానికి ఆజ్యం పోయనారంభించాడు. అరబ్బులకు వ్యతిరేకంగా అరబ్బేతరులను రెచ్చగొట్టాడు. ధ్యేయసాధన కోసం అతడు ఈజిప్ట్, కూఫా, బస్రాలను పర్యటించి కొంతమందిని తన అనుచరులుగా తయారు చేసుకున్నాడు.

చివరికి ఓ నిర్ణీత సమయంలో ఈజిప్ట్, కూఫా, బస్రాలకు చెందిన కుట్రదారులు హజ్ యాత్రికుల వేషంలో మదీనా చేరుకున్నారు. వీరంతా ముందు వేసుకున్న పథకం ప్రకారమే అక్కడికి వచ్చారు. ఉస్మాన్ (ర)గారిని పదవీభ్రష్టులుగా చేయడం కేవలం ఓ సాకు మాత్రమే. వారి అసలు ధ్యేయం, ఇస్లామీయ ఖలీఫాను హత్యచేసి ఖిలాఫత్ వ్యవస్థను ఛిన్నాభిన్నం చేయడం. మదీనా చేరిన తరువాత పేరుమోసిన సహాబీలు హజ్రత్ తల్హా, హజ్రత్ జుబైర్ బిన్ అవ్వామ్, హజ్రత్ అలీ బిన్ అబూతాలిబ్, అమ్మార్ బిన్ యాసిర్ (ర)లను తమకు అనుకూలురుగా

మలచుకునే ప్రయత్నం చేశారు. కాని వారంతా వాళ్లను ఛీత్కరించుకున్నారు. ఓరోజు వారు మదీనాలో ప్రవేశించారు. పట్టణంలోని కీలక ప్రదేశాలను హస్తగతం చేసుకున్నారు. వీరి సంఖ్య రెండువేల దాకా ఉంది.

## పీడితుడైన ఉస్మాన్ (ర)

వీళ్ళు రాగానే మస్జిదె నబవీని చేజిక్కించుకుని ఉస్మాన్ (ర)ను నమాజు చేయించకుండా అడ్డుకున్నారు. ఆయనను రాళ్ళతో కొట్టారు. దైవప్రవక్త (స) చేతికర్రను ఆయన నుండి లాక్కుని దాన్ని విరగ్గొట్టారు. మరుసటి రోజు ఉస్మాన్‌గారి ఇంటిని చుట్టుముట్టి లోనికి ప్రవేశించారు. ఆయన్ను షహీద్ చేశారు. హజ్రత్ ఉస్మాన్ (ర) తలచుకుంటే ఒకే ఒక సైగతో వారిని ముక్కలుముక్కలుగా నరికించేసేవారు. కాని ఆయన అలా చేయలేదు.

దైవప్రవక్త (స) పవిత్రాత్మ విశ్రాంతి తీసుకునే మదీనా నగరంలో ప్రజల రక్తం చిందించడానికి ఆయన ససేమిరా ఒప్పుకోలేదు. స్వయంగా ఆయనే దైవమార్గంలో తన ప్రాణాలను అర్పించారు గాని మదీనా పవిత్రతకు మచ్చ రానీయలేదు.

అప్పుడు ఉమ్ముల్ మోమినీన్ హజ్రత్ ఆయిషా (ర) హజ్ కోసం మక్కా నగరానికి వెళ్ళి ఉన్నారు. ఆమె అక్కడ హజ్రత్ ఉస్మాన్ (ర)గారి షహాదత్ (అమరగతి) గురించిన వార్త విని విభ్రాంతి చెందారు.

## హజ్రత్ ఆయిషా (ర) మక్కా నగరంలో

ఉమ్ముల్ మోమినీన్ హజ్రత్ ఆయిషా (ర) 'ఉమ్రా' నెరవేర్చే వరకు మక్కాలోనే ఉండిపోయారు. ఉమ్రా నెరవేర్చి మక్కా నుండి బయలుదేరేటప్పుడు, ఆమెకు దారిలో తన అమ్మగారి కుటుంబం 'బనూ లైస్'కు సంబంధించిన ఓ వ్యక్తి ఎదురయ్యాడు. ఆమె వారి పట్ల బంధుత్వానికి సంబంధించిన దయా దాతృత్వాలతో మెలిగేవారు ఒకప్పుడు. ఆ వ్యక్తి పేరు ఉబైద్ బిన్ అబూసల్మా. అతన్ని చూడగానే ఆమెకు ఎంతో ఆనందం కలిగింది.

"హజ్రత్ ఉస్మాన్ (ర) గారు షహీద్ చేయబడిన సంఘటన, మదీనా నగరం ఎనిమిది రోజుల వరకు 'అమీర్' లేకుండా ఉన్న విషయం మీకు తెలుసా?" అని అడిగాడు ఉబైద్.

"అయితే వారేం చేశారు?" అని అడిగారు ఆయిషా (ర) ఆశ్చర్యంగా.

"మదీనా వాసులంతా హజ్రత్ అలీ చేతిమీద బైత్ చేశారు. ఇప్పుడు మదీనా నగరంపై విద్రోహుల ప్రాబల్యమే అధికంగా ఉంది" జవాబిచ్చాడు ఉబైద్.

ఇది వినగానే హజ్రత్ ఆయిషా(ర) మక్కాకు వెనుదిరిగారు. దారిలో ఆమె ఇంకేమీ మాట్లాడలేదు. మక్కా చేరాక మస్జిదె హరాం (కాబా మస్జిద్) ద్వారం దగ్గర దిగి 'హతీమ్'లోనికి పోదలిచారు. అక్కడ పరదా బందోబస్తు చేయబడింది. అందులో హజ్రత్ ఆయిషా(ర) ఉండిపోయారు. బయట ప్రజలు గుంపులుగా చేరారు.

## హజ్రత్ ఆయిషా (ర) ప్రసంగం

అందరూ వచ్చి చేరిన తరువాత హజ్రత్ ఆయిషా (ర) వారిని ఉద్దేశించి ఇలా ప్రసంగించారు. ప్రజలారా! వివిధ పట్టణాల నుండి వచ్చిన కుట్రదారులు, మదీనాకు చెందిన బానిసలు కలసి షహీద్ చేయబడ్డ ఆ అమీర్‌పై నేరాలు మోపారు. ఆ అమీర్ కుట్రలు పన్నుతున్నాడని, కనీసం నోట్లో పళ్ళు కూడా రానివారిని (ప్రభుత్వ అధికార్లుగా) నియమించాడన్నవే ఆ నేరాలు. అయితే వారి పళ్ళు అనేక మార్లు ఉపయోగించబడ్డాయి. అభద్రతా సమయాల్లో ఈ పళ్ళే ప్రజల్ని రక్షించాయి. ఇవన్నీ గడచిన వ్యవహారాలు. ఈ వ్యవహారాలను వారి పళ్ళు తప్ప మరెవరూ సంస్కరించలేరు. కాని ఈ కుట్రదారులు వారి వెంటబడ్డారు. వారి నుండి వారి హోదాలను లాగేసుకోదలిచి, మేం కేవలం మంచినే కోరుతున్నామని అన్నారు. కుట్ర పన్నేందుకు వారికి ఏ సాకూ లభించక, ఎలాంటి లోపాన్ని వారు రుజువు చేయలేక విద్రోహానికి దిగారు. ఇలా వారి మాటలు చేతలు అందరి ముందు బయటపడ్డాయి.

వారు అన్యాయంగా ఘోరమైన రక్తపాతానికి ఒడిగట్టారు. ఒక పవిత్ర మాసాన్ని రక్తపాతం జరిపి అపవిత్రం చేశారు. హలాలు చేసుకున్నారు. ఏ సొమ్మును తీసుకోవడం నిషేధించబడిందో వారు దాన్నే దోచుకున్నారు. జిల్‌హజ్ మాసంలో సత్యతిరస్కారులతో యుద్ధం చేయడం హరాం. దాన్ని అల్లాహ్ నిషిద్ధ మాసంగా అభివర్ణించాడు. అలాంటి నిషిద్ధ మాసాన్ని హజ్రత్ ఉస్మాన్ (ర) కోసం హలాల్ చేసుకున్నారు. దాని పవిత్రతను కూడా లెక్కచెయ్యలేదు.

దైవసాక్షి! ఉస్మాన్ హంతకుల్లాంటి వ్యక్తులతో ఈ భూమండలాన్ని పూర్తిగా నింపినా వాళ్ళందరికంటే ఉస్మాన్ (ర)గారి ఒక వ్రేలే శ్రేష్ఠమయినది.

ఆ విద్రోహులను శిక్షించేందుకు మీ మద్దతు ఎంతో అవసరం. దైవసాక్షి! ఉస్మాన్ గనక పాపం చేసినవారైతే, ఆ పాపం కారణంగానే వారు ఆయనకు వ్యతిరేకంగా విద్రోహం తలపెడితే, ఉస్మాన్ ఆ పాపం కారణంగా షహీద్ చేయబడ్డారు. ఆ షహాదత్ వల్ల ఆయన బంగారం లేక వస్త్రం శుద్ధి అయినట్లు పరిశుద్ధుడయ్యారు. వాళ్ళు ఉస్మాన్ పాపాలను కడగటానికి బట్టల్ని నీళ్ళల్లో జాడించి శుభ్రపరిచినట్లు ఆయన్ని ఆ రక్తంలో జాడించారు. (తిబ్రాని)

## హజ్రత్ ఆయిషా (ర) సన్నిధిలో అబ్దుల్లా బిన్ ఆమిర్

హజ్రత్ అబ్దుల్లా (ర) బిన్ ఆమిర్, హజ్రత్ ఆయిషా (ర) గారి సన్నిధిలో హాజరయ్యారు. ఆయన ఉస్మాన్ (ర) ద్వారా మక్కా గవర్నరుగా నియమించబడి ఉన్నారు. ఉమ్ముల్ మోమినీన్ (ర) ఎందుకు తిరిగివచ్చారో తెలుసుకుందాం అని వచ్చారు ఆయన.

"హజ్రత్ ఉస్మాన్ (ర) షహీద్ చేయబడ్డారు అందుకే నేను వెనక్కి తిరిగి వచ్చాను. ఇప్పుడీ ఉపద్రవం అంతమయ్యేది కాదు. ఈ అల్లరిని అణచాలంటే మరో పని చేయవలసి ఉంది. మీరు హజ్రత్ ఉస్మాన్ (ర) గారి రక్త పరిహారాన్ని అడిగి ఇస్లామ్‌కు గౌరవం చేకూర్చండి" అన్నారు హజ్రత్ ఆయిషా (ర).

"ఉస్మాన్ (ర) గారి ఖిసాస్‌ను అడిగేందుకు మీరు ఇస్తున్న పిలుపును ఆలకించేవారిలో నేనే ప్రథముణ్ణి" అన్నారు అబ్దుల్లా బిన్ ఆమిర్.

## హజ్రత్ ఆయిషా (ర.జి) సన్నిధిలో తల్హా, జుబైర్ (ర.జి)లు

హజ్రత్ తల్హా, హజ్రత్ జుబైర్ (ర) హజ్రత్ ఆయిషా (ర) గారి సన్నిధిలో హాజరయ్యారు.

"మీరు వచ్చేటప్పుడు పరిస్థితులేమిటీ?" అడిగారు ఆయిషా(ర) వారితో.

"మేము వచ్చేటప్పుడు మదీనా వాసులు ఎటూ పాలుపోకుండా ఉన్నారు. కుట్రదారుల, పల్లెవాసుల భయంలో వారు బిక్కుబిక్కుమంటూ ఉన్నారు. ఆ పరిస్థితిలో వారు సత్యాన్ని ఒప్పుకోవడానికిగాని, అసత్యాన్ని తిరస్కరించడానికి గాని, తమను తాను రక్షించుకోవడానికిగాని వారికి శక్తిలేదు" అన్నారు వచ్చిన ఆ ఇద్దరూ.

## మక్కాలో బనూ ఉమయ్యా

సయీద్ బిన్ ఆస్, వలీద్ బిన్ ఉక్బా, బనూ ఉమయ్యా వర్గం అంతా మక్కాలో ఓ చోట చేరింది. అబ్దుల్లా బిన్ ఆమిర్ బస్రా నుండి, యాలా బిన్ ఉమయ్యా ఎమన్ నుండి వచ్చి వారిని చేరారు. యాలా వెంట ఆరు వందల ఒంటెలు, ఆరు లక్షల దిర్హంల డబ్బు ఉన్నాయి. మర్వాన్ బిన్ హకమ్ కూడా వారితో వచ్చి కలిశాడు.

## సలహా సంప్రతింపులు

బనూ ఉమయ్యా, యాలాబిన్ ఉమయ్యా, హజ్రత్ తల్హా (ర), హజ్రత్ జుబైర్ (ర) మక్కా చేరిన తరువాత అందరూ కలిసి హజ్రత్ ఉస్మాన్ (ర)గారి రక్తపరిహారం కొరకు డిమాండ్ చేయాలని ఓ తీర్మానాన్ని ఏకగ్రీవంగా ఆమోదించారు. సబాయీల (ఇబ్నె సబా అనుచరులు)తో యుద్ధం చేసి హజ్రత్ ఉస్మాన్ (ర)గారి హత్యకు ప్రతీకారం తీర్చుకోవాలన్నదే ఆ తీర్మానం సారాంశం.

హజ్రత్ ఆయిషా (ర) వారందరినీ మదీనాకు బయలుదేరమని ఆదేశించారు. కాని బస్రాకే వెళ్ళాలనేది అందరి ఆలోచన. వారు ఉమ్ముల్ మోమీనీన్ హజ్రత్ ఆయిషా (ర)తో ఇలా అన్నారు :

ఉమ్ముల్ మోమినీన్! మదీనా వెళ్ళే ఆలోచనను మానుకోండి. ఎందుకంటే మా వెంట ఉన్నవారు ఆ కుట్రదారులతో కలిసి ఉండలేరు. మీరు మమ్మల్ని బస్రాకు తీసుకువెళ్ళండి. ఆ పట్టణాన్ని త్వరగా వశపరుచుకోవచ్చు. వారు మనకు తాము హజ్రత్ అలీతో బైత్ చేశామని చెబుతారు. అయినా మక్కావాసులు ఆ బైత్ నుండి ఎలా విడిపోయారో అలా వారిని కూడా బైత్ నుండి మరల్చుదాం. ఏ ప్రమాదమైనా ముంచుకు వస్తే మనం మన ప్రయత్నంలో దాన్ని ఎదుర్కొని అల్లాహ్ తీర్పు కొరకు నిరీక్షిద్దాం." హజ్రత్ ఆయిషా (ర) వారి ఈ విన్నపాన్ని అంగీకరించారు.

## దైవప్రవక్త (సఅసం) ఇతర భార్యలు

ఇతర భార్యలు కూడా మదీనా వెళ్ళాలని తలచి హజ్రత్ ఆయిషా (ర)తో చేరిపోయారు. కాని ఆమె బస్రా వెళుతున్నారన్న విషయం తెలిసి వారు ఆమెను వదిలివేశారు.

## ఉమ్ముల్ మోమినీన్ హజ్రత్ హఫ్సా(ర) బిన్తె ఉమర్(ర)

ప్రజలు ఉమ్ముల్ మోమినీన్ హజ్రత్ హఫ్సా (ర) సన్నిధికి చేరి వారి అభిప్రాయాన్ని తెలుసుకోగోరారు. "హజ్రత్ ఆయిషా (ర) అభిమతమే నా అభిమతం. ఆమె ఎక్కడికి తీసుకొని వెడితే అక్కడికి నేనూ వెడతాను" అన్నారామె. అంతలోనే ఆమె సోదరుడు హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ (ర) మక్కా చేరారు. ఆయన తన సోదరి హజ్రత్ హఫ్సాను బస్రా పోకుండా ఆపారు. హజ్రత్ హఫ్సా, నేను మీ వెంట వెళ్ళడానికి సిద్ధంగా ఉన్నాను కాని అబ్దుల్లాహ్ నన్ను ఆపుతున్నాడు అని చెప్పిపంపారు హజ్రత్ ఆయిషా (ర) దగ్గరికి. హజ్రత్ ఆయిషా (ర) ఆ మాట విని "అల్లాహుతాలా అబ్దుల్లాను మన్నించుగాక" అన్నారు.

## యాలా బిన్ ఉమయ్యా సహాయం

బస్రాకు బయలుదేరడానికి అందరూ సిద్ధమయ్యాక యాలా బిన్ ఉమయ్యా వారిని ఉద్దేశించి, "నా దగ్గర ఆరు లక్షల దిర్హంలు, ఆరు వందల ఒంటెలున్నాయి. మీరు ఆ ఒంటెలపై ఎక్కి కూర్చోండి" అన్నాడు.

"నా దగ్గర ఇంత ధనం ఉంది మీరు సిద్ధంకండి" అన్నాడు ఇబ్నె ఆమిర్. ఆ తరువాత చాటింపు వేసేవాడు మక్కా వీధుల్లో ఇలా చాటింపువేశాడు :

"ఉమ్ముల్ మోమినీన్, తల్హా (ర), జుబైర్ (ర)లు బస్రా వెళుతున్నారు. ఇస్లామ్ ప్రతిష్ఠను కోరే ప్రతి వ్యక్తీ, హజ్రత్ ఉస్మాన్ హత్యకు రక్తపరిహారాన్ని కోరే ప్రతి మనిషీ వారి వెంట బయలుదేరవచ్చు. ఎవరి దగ్గరైనా వాహనంగాని, యుద్ధ సామగ్రిగాని, భోజన ఖర్చులుగాని లేకపోతే మా దగ్గర అన్నీ ఉన్నాయి. అందులో నుండి వారు తీసుకోవచ్చు."

ఇలా ఆరు వందల ఒంటెలపై ఆరు వందల మంది ఎక్కి కూర్చున్నారు. గుర్రాలు ఉన్న వారి సంఖ్య అదనం. వారి మొత్తం సంఖ్య వెయ్యి. వారంతా సిద్ధం అయ్యాక బయలుదేరే ప్రకటన చేయబడింది.

యాలా బిన్ ఉమయ్యా యుద్ధఖర్చుల కోసం హజ్రత్ జుబైర్ (ర)కు నాలుగు లక్షల సహాయం చేశాడు. అదే కాకుండా డెబ్బై మంది ఖురైషీయుల కోసం వాహనాల్ని సమకూర్చాడు. హజ్రత్ ఆయిషా (ర)ను ఒంటెపై ఎక్కించారు. దాని పేరు 'అస్కర్', దాన్ని యాలా ఎనభై దీనార్లకు కొన్నాడు. ఇలా సైన్యం బయలుదేరింది.

హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ జుబైర్ బయలుదేరుతూ బైతుల్లాహ్ (కాబా గృహం)పై దృష్టి నిల్పి, "మేలు కోరేవారికి, కీడు నుండి రక్షణ పొందేవారికి నీకంటే శ్రేష్ఠమైన దాన్ని నేను చూడలేదు" అన్నారు.

## దుఃఖ దినం

సైనిక పటాలం బయలుదేరేటప్పుడు మొదట జుబైర్(ర), తల్హా (ర)లు బయలుదేరారు. ఆ తరువాత హజ్రత్ ఆయిషా (ర) బయలుదేరారు. ఆమె వెంట 'అజ్వాజె ముతహ్హరాత్' (ప్రవక్త సతీమణులు) కూడా ఉన్నారు. వారు ఆమె వెంట జాతె అర్ఖ్ (ఓ ప్రదేశం పేరు) వరకు వెళ్ళారు. ఆ రోజు ప్రజలు ఇస్లామ్ కోసం ఏడ్చినంత ఇంకేరోజు ఏడ్వలేదు. వాళ్ళు రోదించడానికి కారణం, దైవధర్మానికి ఈ దుర్దినం చూడాల్సి వచ్చిందే అన్నదే వారి బాధ. చివరికి ఆ

రోజు పేరు 'దుఃఖ దినం' గా పడిపోయింది. హజ్రత్ ఆయిషా (ర) అబ్దుర్రహ్మాన్ బిన్ అత్తాబ్‌ను నమాజు చేయించమని ఆదేశించారు. ఆయన ప్రజల్లో న్యాయశీలురుగా పేరు పొందారు.

## అబ్దుర్రహ్మాన్ (ర) గారి ఇమామత్

హజ్రత్ అబ్దుర్రహ్మాన్ బిన్ అత్తాబ్ (ర) బస్రా చేరి షహీద్ అయ్యేదాక ఇలా ఇమామత్ చేస్తూనే ఉన్నారు. హజ్రత్ ఆయిషా (ర) వెంట మర్వాన్ బనూ ఉమయ్యా తెగవాళ్ళు అంతా ఉన్నారు. చావు భయం ఉన్న బనూఉమయ్యా వర్గంవారు మాత్రమే వెనుక ఉండిపోయారు. ఈ సైనిక పటాలం అవతాస్ వైపు నడిచింది. ఇందులో ఆరు వందల ఒంటెలు ఉన్నాయి. గుర్రపు రౌతుల సంఖ్య అదనం. హజ్రత్ ఆయిషా (ర) రాత్రి సమయంలో అవుతాస్ వైపు వెళ్ళే మార్గాన్ని వదిలేసి మరో దారి వైపు నడిచారు. సైన్యం ఎంతో వేగంగా నడిచి బస్రా చేరుకుంది.

## బస్రాలో హజ్రత్ ఆయిషా (ర)

ఈ సైన్యం బస్రా మైదానాల్లోకి చేరింది. అక్కడ ఉమైర్ బిన్ అబ్దుల్లా అల్‌తమీమీ తారసపడి, "ఉమ్ముల్ మోమినీన్! అల్లాహ్‌పై ఒట్టేసి చెబుతున్నాను. మీరు ముందుకు వెళ్ళకండి. అక్కడి ప్రజలకు నచ్చజెప్పే వారిని మాత్రమే అక్కడకు పంపండి" అని అన్నారు.

"నీవు చాలా పుణ్యాత్మునిలా ఉన్నావు. ఆ సలహా ఏదో నీవే ఇవ్వు" అన్నారు హజ్రత్ ఆయిషా (ర).

"మీరు ఇబ్నె ఆమిర్‌ను అక్కడికి పంపండి. బస్రాలో ఆయనకు భూములు, ఇళ్ళూ ఉన్నాయి. మీరు అక్కడికి చేరే లోపల వారిని కలిసి మీరేం చెప్పదలిచారో బస్రావాసులకు తెలియజేస్తారాయన" అన్నారు ఉమైర్.

హజ్రత్ ఆయిషా (ర) ఆయన సలహా ప్రకారం ముందుగా ఇబ్నె ఆమిర్‌ను పంపారు. ఆయన బస్రాలో ప్రవేశించగానే అక్కడివారు ఆయన చుట్టూ చేరారు.

హజ్రత్ ఆయిషా (ర) బస్రాలోని ప్రముఖులు, పలుకుబడి ఉన్నవాళ్ళ పేర ఉత్తరాలు కూడా రాసి పంపారు. వారిలో అహ్నఫ్ (ర) బిన్ ఖైస్, సబ్రహ్ బిన్ షైమాన్ మొదలైనవారు ఉన్నారు. ఆమె కొంచెం ముందుకెళ్ళి 'హఫీర్' అనే ప్రదేశంలో విడిదిచేసి జవాబు కోసం ఎదురుచూడసాగారు.

బస్రావాసులకు పరిస్థితుల గురించి తెలిసింది. ఉస్మాన్ (ర) బిన్ హనీఫ్ వెంటనే ఇమ్రాన్ (ర) బిన్ హసీన్, అబుల్ అస్వద్ దైలీలిద్దరిని రాయబారులుగా హజ్రత్ ఆయిషా (ర) సన్నిధికి పంపించారు. హజ్రత్ ఇమ్రాన్ ప్రజలతో సంబంధమున్న వ్యక్తి. అబుల్ అస్వద్, హజ్రత్ అలీ (ర) గారి ప్రత్యేక వర్గానికి చెందిన మనిషి.

ఉస్మాన్ వారిద్దరిని ఉద్దేశించి, "మీరు ఆ స్త్రీ దగ్గరికి వెళ్ళండి, ఆమెకు మీ ఆలోచనలేమిటో తెలపండి" అని చెప్పి పంపారు. వారిద్దరు హజ్రత్ ఆయిషా (ర)కు తోడు వచ్చిన వారి దగ్గరకు 'హఫీర్' అనే ప్రదేశానికి వెళ్ళారు. ఆయిషా అనుమతితో వారు ఆమె శిబిరంలోకి ప్రవేశించారు. హజ్రత్ ఆయిషా (ర)కు సలాం చేసి "మీరు ఇక్కడికి ఎందుకు వచ్చారో మా అమీర్ (నాయకుడు) తెలుసుకోగోరి మమ్మల్ని పంపించారు" అని అన్నారు.

## సంస్కరణ కోసం రంగంలోకి దిగాము

దానికి జవాబుగా హజ్రత్ ఆయిషా (ర) ఇలా అన్నారు : "నాలాంటి స్త్రీ రహస్య కార్యాల కోసం ఇంటి నుండి బయలుదేరదు. అదీగాకుండా తన సంతానం ముందు ఏ మాటా దాచదు. అసలు విషయం ఏమిటంటే వివిధ ప్రాంతాలకు చెందిన దుండగులు, పల్లెవాసుల అల్లరిమూక దైవప్రవక్త (స) ఇంట (మదీనా నగరంలో) జొరబడి హత్యాకాండకు పాల్పడ్డారు. కుట్రలు పన్నారు. ధర్మంలో లేని అనేక క్రొత్త విషయాలను ప్రవేశపెట్టారు. ఇంకా కుట్రదారులకు హర్మె రసూల్ (మదీనా)లో రక్షణ కల్పించారు. ఈ విధంగా వారు అల్లాహ్ ఆగ్రహానికి, ఆయన ప్రవక్త (స) శాపానికి అర్హులయ్యారు. వాళ్ళు ఏ నేరం ఎరగని ఇమామ్ (ఖలీఫా)ను హతమార్చారు. ఇలా వారు ఓ హరాం (నిషిద్ధ) రక్తాన్ని, హలాల్ (ధర్మసమ్మతం) చేసుకున్నారు. ఏ సొమ్ము తీసుకోవడం హరామో దాన్ని

దోచుకున్నారు. హరాం (పవిత్రమైన) పట్టణాన్ని, హరాం నెల పవిత్రతను సయితం లెక్కజేయలేదు. ప్రజలను అగౌరవపరచి శారీరకంగా హింసించారు. వారి పట్టణానికి వచ్చి వారి ఇండ్లల్లో జొరబడి తిష్ఠవేశారు. వారు ప్రజలకు నష్టాలు, కష్టాలు తప్ప ఇంకే లాభం చేకూర్చలేదు. వారి హృదయాల్లో దైవభీతే లేదు. వీరు ఎవరి దగ్గరకైతే వెళ్ళి చేరారో వారికి తమ ప్రాణాలను కాపాడుకోవడం తప్ప ఎలాంటి శక్తిలేదు.

"నేను ఇక్కడి దాకా ప్రయాణం చేసి వచ్చింది ఈ వర్గం ఎలాంటి వారికి నిలయమో వారి వల్ల ప్రజలు పడే ఇక్కట్లు ఎలాంటివో తెలుపడానికే. వారిక బాగుపడరు."

ఈ మాటలంటూ హ(జత్ ఆయిషా(ర) ఈ క్రింది ఖుర్ఆన్ ఆయత్‌ను పఠించారు.

"సదఖా గురించి ఆదేశించడం లేక ప్రజలను సన్మార్గులుగా మలచడం గురించి తప్ప సాధారణంగా వారు జరిపే రహస్య సమాలోచనల్లో మరెలాంటి మేలు లేదు."

కాబట్టే మేము ఈ సంస్కరణ కోసం బయలుదేరాము. ఈ సత్కార్యం ఆచరించే ఆదేశం అల్లాహ్, ఆయన ప్రవక్త(స) ప్రతి చిన్నా పెద్దా స్త్రీ పురుషులకు ఇచ్చారు. మేము ప్రజలకు సన్మార్గం ఆచరించండని చెప్పడానికి, దాన్ని పరిరక్షించడానికి, మంచిని పెంచి చెడును తుంచడానికి, ఈ ప్రపంచం నుండి దౌష్ట్యాన్ని చెరపడానికి మాత్రమే వచ్చాం. ఇలా చెప్పి హ(జత్ ఆయిషా (ర) ఇమ్రాన్ బిన్ హుసీన్‌ను వెనక్కి పంపించేశారు.

ఇక ఆమె అబుల్ అస్వద్‌ను ఉద్దేశించి, "ఓ అబుల్ అస్వద్! నీ కోరికలు నిన్ను నరకంలో పడవేయకుండా నిన్ను నీవు రక్షించుకో" అని అన్నారు.

"అల్లాహ్ కోసం న్యాయానికి సాక్షిగా నిలువండి. ఏ జాతి వైరం కూడా మిమ్మల్ని ఎలాంటి అన్యాయానికి ఒడిగట్టే నేరానికి పాల్పడేటట్లు చేయగూడదు. న్యాయం చేయండి. ఇది 'తక్వా' (దైవభీతి)కు చాలా చేరువైనది. అల్లాహ్‌కు భయపడండి. అల్లాహ్ గట్టి పట్టుగలవాడు అనే ఖుర్ఆన్ వాక్యాన్ని వినిపించి

అతన్ని కూడా పంపివేశారు. ఈ ఇద్దరు రాయబారులు తిరిగి ఉస్మాన్ బిన్ హనీఫ్ దగ్గరికి వెళ్ళారు. ఇమ్రాన్ మాట్లాడకముందే ఉస్మాన్‌తో ఇలా అన్నారు.

"హనీఫ్ కుమారుడా! నీవిక్కడికి వచ్చావు కదా. ఇక యుద్ధ మైదానానికి బయలుదేరు. శత్రువుల్ని ఈటెల ములుకులపై ఉంచుకో. వారితో యుద్ధం చేస్తూ నిలకడగా ఉండు" అనే అర్థం వచ్చే అరబీ పద్య పాదాన్ని చదివాడు.

ఇది విన్న ఉస్మాన్ బిన్ హనీఫ్ "ఇన్నా లిల్లాహి వ ఇన్నా ఇలైహి రాజిఊన్" అని చదివి ఇలా అన్నాడు.

"కాబా ప్రభువు సాక్షి! ఇక ఇస్లామ్ తిరోగతి తిరగనారంభించింది. దీని ఏ రాయి పడిపోతుందో చూడడం మాత్రమే మిగిలి ఉంది."

ఇమ్రాన్ బిన్ హసీన్ యుద్ధం నుండి తప్పుకున్నారు.

"దైవసాక్షి! ఇప్పుడీ యుద్ధం మిమ్మల్ని ఘోరమైన యాతనకు గురిచేస్తుంది. దీని పర్యవసానం ఎంతో దారుణంగా ఉంటుంది. మీలో ఎవరైనా బ్రతికి బయటపడినప్పటికీ అనేక కార్యాలు ఈ యుద్ధానికి సాటి రావు" అన్నారు ఇమ్రాన్(ర).

"అయితే మీరే నాకు సలహా ఇవ్వండి" అన్నాడు ఉస్మాన్ బిన్ హనీఫ్.

"నేను మాత్రం ఇంటికెళ్ళి కూర్చుంటాను. మీరు కూడా మీ ఇంటికి వెళ్ళి కూర్చోండి" అన్నాడు ఇమ్రాన్.

అమీరుల్ మోమినీన్ హజ్రత్ అలీ ఇక్కడికి చేరనంతమట్టుకు నేను వాళ్ళను పట్టణంలోనికి ప్రవేశించనీయను" అన్నాడు ఉస్మాన్.

"అసలు తీర్పు అల్లాహ్‌దే. ఆయన తలిచిందే జరిగి తీరుతుంది" అని చెప్పి ఆయన తన ఇంటికి వెళ్ళిపోయారు.

ఉస్మాన్ దాడి చేయడానికి సిద్ధంగా ఉన్నాడు.

హజ్రత్ ఆయిషా (ర), ఆమె అనుచరులు ముందుకు వెళ్ళి 'మర్బద్' అనే ప్రదేశానికి చేరారు. ఎత్తు ప్రదేశం నుండి మర్బద్‌లోనికి ప్రవేశించి అక్కడ

గుడారాలు వేశారు. ఉస్మాన్ బిన్ హనీఫ్ కూడా తన అనుచరులతో ఆమెను ఢీకొనడానికి అక్కడికి వెళ్ళాడు.

ఆ సందర్భంలో హ(జత్ తల్హా (ర) ఓ (ప్రసంగం చేశారు. ఆ తరువాత హ(జత్ ఆయిషా (ర) (ప్రసంగం (ప్రారంభించారు. ఆమె కంఠస్వరం ఎంతో బిగ్గరగా ఉంది.

## హజ్రత్ ఆయిషా (ర) గారి ప్రసంగం

హ(జత్ ఆయిషా (ర) అల్లాహ్ స్తో(త్రం చేసిన తరువాత ఇలా (ప్రారంభించారు తన (ప్రసంగాన్ని.

"(ప్రజలు హ(జత్ ఉస్మాన్ (ర)పై నిందలు మోపి ఆయన (ప్రభుత్వాధికారులను నేరస్తులుగా భావించేవారు. వారు మదీనా వచ్చి ఉమ్మాత్ అధికారుల పరిస్థితుల్ని ఏకరువు పెట్టి మా సలహాలను కోరేవారు. వీరి మాటలు చూస్తే వీరు (దేశ) (శేయంకోరేవారు, మంచి వారుగానే కనబడేవారు.

కాని మేము పరిస్థితులను కూలంకషంగా విచారిస్తే, ఉస్మాన్ (ర) ఎంతో దైవభీతి కలవాడుగా, వీరు మోపే నేరాలకు ఎంతో అతీతుడుగా కనబడేవారు. ఆయనపై చాడీలు చెప్పేవారు 'తక్వా' (దైవభీతి) వేషంలో ఉన్న మోసగాళ్ళు, అసత్యవాదులుగా కనబడేవారు. వీరి బాహ్య స్వరూపం ఒకలాగుంటే ఆంతర్యం మరోలాగుండేది. వీరు ఇలా మోసం, దగా ద్వారా బలం పుంజుకొని మదీనా చేరి ఉస్మాన్‌ను గృహనిర్బంధంలో ఉంచారు. ఆ తరువాత ఆయన్ను షహీద్ చేసి హరాం రక్తాన్ని హలాల్ చేసుకున్నారు. ఏ సొమ్మును తీసుకోవడం హరామో ఆ సొమ్మును దోచుకున్నారు. ఎలాంటి నేరం లేకుండా అనవసరంగా మదీనతుర్రసూల్ ((ప్రవక్త పట్టణం అయిన మదీనా)లో (ప్రవేశించి దాన్ని అపవి(త్రం చేశారు. వారు కోరినది మీకు తగనిది. మీరు ఉస్మాన్ హంతకుల నుండి ఖిసాస్ (రక్తపరిహారం) తీసుకోండి. అల్లాహ్ ఆదేశాలను నెలకొల్పండి. అల్లాహ్, తన (గ్రంథంలో ఇలా వక్కాణిస్తున్నాడు:

"(గ్రంథ (ప్రజలను మీరు చూడరా? ఆ (గ్రంథం (ప్రకారం తీర్పు నివ్వమని (గ్రంథ (ప్రజలను (గ్రంథం వైపునకు పిలిచినప్పుడల్లా, వారిలో ఓ వర్గం ముఖం త్రిప్పి అయిష్టంగా వెళ్ళిపోయేది."

ఇలా సాగిన ఆ ప్రసంగం ప్రభావం మూలంగా ఉస్మాన్ బిన్ హనీఫ్ అనుచరుల్లో విభేదం తలెత్తింది. వాళ్ళలోని ఓ వర్గం, దైవసాక్షి! తమరు నిజం పలికారు, సత్కార్యం కోసం ఆదేశించారు అనగా, మరో వర్గం మీరు చెప్పింది అబద్ధం, మేము మీ మాటను వినం అని అన్నది. దీనిపై పెద్ద గందరగోళం ఏర్పడి ఒకరినొకరు దూషించుకోవడం ప్రారంభించారు.

హజ్రత్ ఆయిషా (ర) ఈ పరిస్థితిని గమనించి తమ వారిని తీసుకొని మైమనా నుండి వెళ్ళి చర్మం శుభ్రం చేసేవారుండే ప్రదేశానికి వెళ్ళి ఆగిపోయారు. ఉస్మాన్ అనుచరుల్లో తీవ్ర విభేదాలు ఏర్పడి పోట్లాట మొదలైంది.

## బస్రా విజయం - ఉస్మాన్ హంతకుల వధ

హజ్రత్ ఆయిషా (ర), ఉస్మాన్ (ర) బిన్ హనీఫ్‌ల సైన్యాలు ఎదురెదురుగా నిలబడ్డాయి. ఉస్మాన్ హంతకుడు హకీమ్ బిన్ జబ్లా యుద్ధం ప్రారంభించాడు. హజ్రత్ ఆయిషా (ర) గారి అనుచరులు వారందరిని అణచడానికి సరిపోతారు. అయితే ఇప్పటిదాక వారు ఆత్మరక్షణ పోరాటమే సాగిస్తూ వచ్చారు. కాని ఆ పరిస్థితి ఎంతోసేపు ఉండలేదు. ఉభయ సైన్యాలు పరస్పరం ఢీకొన్నాయి. ఫలితంగా బస్రా నగరం హజ్రత్ ఆయిషా (ర) సైన్యానికి స్వాధీనం అయి పోయింది. హకీమ్ బిన్ జబ్లా చంపబడ్డాడు. హజ్రత్ ఉస్మాన్ బిన్ హనీఫ్‌ను వదిలేయమని, అతను పోదలచుకున్న చోటికి పోనిమ్మని, అతని దారికి అడ్డుపడవద్దని హజ్రత్ ఆయిషా(ర) సైన్యానికి ఆదేశం ఇచ్చారు. పరిస్థితి కట్టుదిట్టంగా ఉంది.

ఉస్మాన్ బిన్ హనీఫ్ వెళ్ళిపోయేటప్పుడు ఆయన ముఖంపై ఉన్న వెంట్రుకలన్నీ లాగి వేయబడి ఉన్నాయి. హజ్రత్ తల్హా, హజ్రత్ జుబైర్ (ర) బస్రాలో ఓ ప్రకటన చేయించారు. దాని ప్రకారం హజ్రత్ ఉస్మాన్ (ర)ను షహీద్ చేయడానికి మదీనా వెళ్ళినవాళ్ళు ఏ ఏ తెగల వారి దగ్గర రక్షణ పొందుతున్నారో వారందరిని మా దగ్గరికి తీసుకురావాలి అని ప్రకటించబడింది. ప్రకటన వెలువడగానే ప్రజలు వాళ్ళను కుక్కల్ని లాక్కు వచ్చినట్లు లాక్కొని వచ్చారు. వారందరిని వధించడం జరిగింది. ఇలా హర్‌కూస్ బిన్ జహీర్ అనే వాడు తప్ప ఉస్మాన్ (ర) గారిని చంపడానికి వెళ్ళిన వాళ్ళంతా వధించబడ్డారు.

## 'కూఫా' వారికి హజ్రత్ ఆయిషా (ర) లేఖ

హజ్రత్ ఆయిషా (ర) కూఫా వారి పేర ఇలా ఓ లేఖ రాశారు: "నేను మీకు అల్లాహ్‌పై, ఇస్లాంపై ఒట్టేసి చెబుతున్నాను. అల్లాహ్ గ్రంథాన్ని, అందులో ఇవ్వబడ్డ ఆదేశాల్ని ప్రపంచంలో స్థాపించండి. అల్లాహ్‌కు భయపడండి. ఆయన ధర్మాన్ని గట్టిగా పట్టుకోండి. ఆ గ్రంథం ఆదేశాలకు అనుగుణంగా నడవండి. మేము బస్రా చేరి ప్రపంచంలో అల్లాహ్ గ్రంథాన్ని, ఆయన ఆదేశాల్ని స్థాపించమని ప్రజలకు పిలుపునిచ్చాం. సజ్జనులు మా మాటల్ని గ్రహించి స్వీకరించారు.

మంచి అనేదే లేకుండా పోయినవారు మాకు వ్యతిరేకంగా ఆయుధాలు చేబూనారు. మిమ్మల్ని ఉస్మాన్ దగ్గరికి పంపుతామని, ఈ నిబంధనలన్నిటినీ అంతమొందిస్తామని సవాలు విసిరారు. వారు తీవ్రమయిన పగ, శత్రుభావంతో మాకు ఎదురుతిరిగారు. మమ్మల్ని అవిశ్వాసులుగా పరిగణించారు. మేము వారి ముందు ఈ ఆయత్‌ను పఠించాం:

అలమ్ తర ఇలల్లజీన ఊతూ నసీబమ్ మినల్ కితాబ్..... హుం మూరిజూన్"

"వారిలో కొందరు మా మాటలు అర్థంచేసుకున్నారు. తాత్కాలికంగా వాళ్ళలో భేదాభిప్రాయం ఏర్పడింది. మేము మొదట వాళ్ళ మానాన వాళ్ళను వదిలేశాం. దాంతో నా అనుచరులలో యుద్ధం చేయదలచినవారు తప్ప వారి పక్షంలో ఎవ్వరూ మిగల్లేదు. ఉస్మాన్ బిన్ హనీఫ్ వారిని నా మీద యుద్ధానికి ఉసిగొల్పాడు. అల్లాహ్ సజ్జనుల ద్వారా నాకు సహాయం చేశాడు. వాళ్ళ మోసాన్ని వాళ్ళ వైపునకే త్రిప్పేశాడు. మేము ఇరవైఆరు రోజులదాకా వారిని అల్లాహ్ గ్రంథం వైపునకు, ఆయన ఆదేశాల వైపునకు పిలిచాం. ఎవరిని హతమార్చడం ధర్మసమ్మతం చేయబడిందో వారిని హతమార్చండి అని చెప్పాం. వారు దాన్ని కాదన్నారు. ఈ విషయంలో ఏవో సాకులు వెదకనారంభించారు.

ఆ తరువాత ఓ షరతుపై మేము వారితో సంధి కుదుర్చుకున్నాం. కాని ఈ సంధి చేసుకున్నాక వాళ్ళకు కొంత భయమేసింది. దాంతో వారు విద్రోహులుగా మారి, కుదుర్చుకున్న సంధిని ఉల్లంఘించి మాతో యుద్ధానికి

తలపడ్డారు. అల్లాహ్ ఉస్మాన్ (ర) హంతకులను ఒక్కచోట చేర్చి అందరినీ హతమార్చాడు ఒక్కడ్ని తప్ప. అల్లాహ్ ఉమైర్ బిన్ ముర్సద్, ముర్సద్ బిన్ ఖైస్, బనూ రనాబ్ బనూజా వారి ఓ వర్గం ద్వారా మాకు సహాయం చేశాడు. వీరు ఉస్మాన్ (ర) హంతకులకు వ్యతిరేకంగా మాకు సహాయం చేయడానికి సిద్ధపడ్డారు. ఈ విధంగా అల్లాహ్ బ(స్రావారి నుండి ఉస్మాన్ (ర) గారి ఖిసాస్ (రక్తపరిహారం) తీర్చుకున్నాడు.

కూఫా (ప్రజలారా! మీరు దుష్టుల కొమ్ము కాయకండి. హంతకులకు సహాయపడకండి. అల్లాహ్ శిక్ష ఖాయమయి ఉన్న వారితో ఎలాంటి సంబంధం ఉంచకండి, లేకుంటే మీరు కూడా దౌర్జన్యపరుల కోవకే చెందుతారు."

హ(జత్ ఆయిషా (ర) పేరు పేరున కూఫాలోని చాలా మందికి ఉత్తరాలు రాశారు. వాటిలో ఇలా ఉంది.

"(ప్రజలారా! ఆ హంతకులకు ఆ(శయం ఇవ్వకండి. వారికి సహాయం చేయకండి. మీరు మీ ఇండ్లల్లోనే కూర్చొని ఉండండి. హ(జత్ ఉస్మాన్ బిన్ అప్ఫాన్ (ర) గారికి వ్యతిరేకంగా జరిగిన కు(ట్రను మా వర్గం సహించదు. వీరు ఉమ్మత్‌లో (సమాజంలో) విభేదం సృష్టించారు. దైవ (గ్రంథాన్ని, దైవ(ప్రవక్త (స) సం(ప్రదాయాలను వ్యతిరేకించారు. మేము వారికి ఇచ్చిన ఆదేశాలకు విరుద్ధంగా నడిచారు. వారికి దైవ(గ్రంథాన్ని అవలంబించడానికి దానిలో ఇవ్వబడ్డ శిక్షలను అమలు చేయడానికి ఆదేశించాం. కాని వారు హ(జత్ ఉస్మాన్ (ర)ను కాఫిర్‌గా, మమ్మల్ని దైవ(గ్రంథ తిరస్కారులుగా చి(త్రించారు. సచ్ఛీలురైన వారు ఈ వైఖరిని నిరసించారు. వారు వారి మాటలను చాలా నీచమైనవిగా భావించి, వారిలో అమీరుల్ మోమినీన్‌ని చంపిన తరువాత మీరు దైవ(ప్రవక్త (స) గారి సతీమణికి ఎదురుతిరుగుతారా? ఆమె మిమ్మల్ని రుజుమార్గంపై నడవమని ఆదేశిస్తే ఆమెను కూడా చంపేస్తారా? మీరు దైవ(ప్రవక్త (స) గారి అనుచరుల ఇమాముల రక్తంతో మీ చేతుల్ని కడుక్కుంటారా? అని అడిగారు.

ఆ నీచులు ఈ దుర్మార్గానికి కూడా వడికట్టారు. వారి వెంట ఉస్మాన్ బిన్ హనీఫ్ కూడా కలిసిపోయారు. అజ్ఞానులు, దుర్మార్గులు, వ్యవసాయదారులు కూడా వారికి తోడయ్యారు. వారిలోని ఓ వర్గం యుద్ధమైదానంలో మాకు

ఎదురుగా నిలిచింది. ఇరవైఆరు రోజులు ఇలానే గడిచాయి. మేము వారికి సత్యం గురించి బోధిస్తూ వచ్చాం. సత్యానికి అడ్డం రాకండని కూడా చెప్పాం. కాని వారు విద్రోహానికే తలపడ్డారు. ఇలాంటివారిని మేం ఉపేక్షించలేదు. తల్హా (ర), జుబైర్ (ర)లు హ(జత్ అలి (ర)తో బైత్ చేశారని వారనేవారు. అప్పుడు మేము మదీనాకు ఓ వార్తాహరుడ్ని పంపాము. అక్కడ నుండి వచ్చిన వార్త, వారికి వ్యతిరేకమైన వార్త. అయినా వారు వాస్తవాన్ని గుర్తించలేదు. దాన్ని స్వీకరించలేదు.

వాళ్ళు ప్రాతఃకాలాన్నే నన్ను, నా అనుచరుల్ని హతమార్చడానికి నా నివాసంపై దాడి చేశారు. వారప్పటికే నా ఇంటి ద్వారం వరకు వచ్చేశారు. వారి వెంట మా రహస్య స్థావరాల్ని చూపే ఓ వేగులవాడు కూడా ఉన్నాడు. వీరు గుమ్మం దాకా వచ్చేసినప్పుడు అక్కడ ఉమైర్ బిన్ మర్సిద్, యజీద్ బిన్ అబ్దుల్లాహ్ బిన్ ముల్సిద్, ముల్సిద్ బిన్ ఖైస్, బనూ ఖైస్ గార్లతో కూడిన ఓ వర్గం కాపుకాసి ఉంది. దుండగులు వారితో తలపడ్డారు. ముస్లిములు వాళ్ళను చుట్టుముట్టి హతమార్చేశారు. అల్లాహ్ బస్రావాసుల్ని ఓ మాటపై ఏకం చేశాడు. అంతే జుబైర్, తల్హాలు కోరింది కూడా అదే. మేము ఉస్మాన్ (ర)హంతకుల్ని వధించిన తరువాత అందరికి క్షమాభిక్ష పెట్టేశాం."

(ఈ సంఘటన హి(జీ 36లో రబీఉల్ ఆఖిర్ మాసాంతానికి అయిదు రోజుల ముందు జరిగింది.) (తి(బ్రీ)

## కూఫా ప్రజలు హజ్రత్ అలి (ర) వెంట

హ(జత్ ఆయిషా (ర) లేఖ అందకపూర్వమే, హ(జత్ అలీ(ర) మనుషులు హ(జత్ హసన్ బిన్ అలీ (ర), హ(జత్ అమ్మార్ బిన్ యాసిర్ (ర)లు కూఫా చేరి కూఫా ప్రజల్ని తమ వైపునకు మరల్చుకున్నారు. ఆ సందర్భంగా హ(జత్ అమ్మార్ (ర) ప్రసంగిస్తూ ఇలా అన్నారు:

"ప్రజలారా! ఈయన దైవప్రవక్త (స) గారి పినతండ్రి కుమారుడు. మీరు దైవప్రవక్త (స) గారి సతీమణికి, తల్హా జుబైర్ (ర)లకు వ్యతిరేకంగా పోరాడాలని

ఈయన కోరుతున్నారు. హజ్రత్ ఆయిషా (ర) దైవప్రవక్త (స) గారి సతీమణి అని, పరలోకంలో కూడా ఆమె ఆయనకు సతీమణిగానే ఉంటారని నేను సాక్ష్యం ఇస్తున్నాను. అయితే మీరు సత్యం ఎటువైపుందో చూసి హజ్రత్ అలీ (ర) గారిని ఆశ్రయించి యుద్ధం చేయండి. కూఫా ప్రజలు హజ్రత్ అలీ (ర) గారికి మద్దతు ఇవ్వడానికే సిద్ధపడ్డారు."

హజ్రత్ హసన్ బిన్ అలీ (ర) ఇలా సంబోధించారు:

"నేను రేపు బయలుదేరుతున్నాను. నావెంట రాదలిచినవారు వాహనాలపై నా వెంట నడవండి. మరెవరయితే సముద్రమార్గాన రాదలిచారో వారు సముద్ర మార్గాన కూడా రావచ్చు."

కొందరు భూ మార్గం ద్వారా రావాలని, మరి కొందరు సముద్ర మార్గం గుండా బయలుదేరాలని తీర్మానించుకున్నారు. భూమార్గం గుండా వెళ్ళడానికి ఆరువేల రెండువందల మంది, జలమార్గం గుండా వెళ్ళడానికి రెండువేల ఎనిమిదివందల మంది సిద్ధపడ్డారు. (తిబ్రీ)

## సత్యం మద్దతుదారులు

హజ్రత్ అలీ (ర) ఖలీఫాగా ఎన్నుకోబడిన వెంటనే క్రొత్త గవర్నర్లను నియమించారు. పాత గవర్నర్లను పదవుల నుంచి తొలగించడానికి ఉత్తర్వులు జారీఅయ్యాయి. ఉస్మాన్ బిన్ హనీఫ్‌ను బస్రాకు, అమ్మార్ బిన్ షిహాబ్‌ను కూఫాకు, ఉబైదుల్లా బిన్ అబ్బాస్‌ను యమన్‌కు, ఖైస్ బిన్ సఅద్‌ను ఈజిప్ట్‌కు, సహల్ బిన్ హనీఫ్‌ను సిరియాకు గవర్నర్లుగా నియమించి పంపడం కూడా జరిగింది.

సిరియా అమీర్ (గవర్నరు) హజ్రత్ ముఆవియా బిన్ అబూ సుఫ్యాన్ తిరగబడ్డారు. ఆయన ఉస్మాన్ (ర) గారి హంతకుల నుండి ఖిసాస్ తీసుకోవలసిందే అనే డిమాండ్‌తో తిరగబడ్డారు. సిరియా ఇస్లాం కేంద్రానికి చెందిన రాష్ట్రం. ఈ విధంగా కేంద్ర ప్రభుత్వానికి తిరగబడడం అంటే గొప్ప ప్రమాదాన్ని సూచిస్తోందన్న మాట. దానివల్ల కేంద్రం ఛిన్నాభిన్నం కావచ్చు. అందువల్ల

సిరియా అమీర్ తిరుగుబాటును అణచడానికి యుద్ధానికి సిద్ధంకమ్మని ఆదేశం ఇచ్చారు అమీరుల్ మోమినీన్.

ఈలోపు ఉమ్ముల్ మోమినీన్ హజ్రత్ ఆయిషా(ర) సైన్యం బస్రాకు బయలుదేరిందన్న వార్త అందింది హజ్రత్ అలీ (ర)కు. సిరియా తిరుగుబాటును అణచడానికి ముందుగా ఉమ్ముల్ మోమినీన్ సైన్యాలతో తలపడవలసిన అవసరం ఎంతైనా వుంది. కాబట్టి అమీరుల్ మోమినీన్ హజ్రత్ అలి (ర) మదీనా నుండి ఏడువందల మంది సైన్యాన్ని తీసుకొని బయలుదేరారు. కూఫా నుండి మరో ఏడువేల మంది వచ్చి కలిశారు. బస్రా చేరేలోగా ఈ సైన్యం ఇరవైవేలకు చేరింది. అటు హజ్రత్ ఆయిషా (ర) సైన్యంలో ముప్పైవేల మంది సైనికులున్నారు. ఈ రెండు సైన్యాలు ఎదురెదురుగా యుద్ధ మైదానంలో విడిది చేశాయి.

అమీరుల్ మోమినీన్ హజ్రత్ అలీ (ర), ఉమ్ముల్ మోమినీన్ హజ్రత్ ఆయిషా (ర) ఇద్దరి దృష్టిలో ఉన్నది ధర్మ పునరుద్ధరణ ధ్యేయమేగాని యుద్ధం ఎంత మాత్రం కాదు. కాకపోతే పరిస్థితులు వారుభయుల్ని ఒకరినొకరికి ఎదురుగా తీసుకొచ్చి నిలబెట్టాయి.

హజ్రత్ అలీ (ర) సైన్యంలో అబ్దుల్లా బిన్ సబా అనుచరులైన సబాయీలు, ఉస్మాన్ (ర) హంతకులు గనక లేకుండా ఉంటే - అదే విధంగా హజ్రత్ ఆయిషా (ర) సైన్యంలో మర్వాన్ బిన్ హకం, అతని కుట్రదారులైన అనుచరులు కూడా లేకుండా ఉంటే, ఈ జమల్ యుద్ధం ఆనాడు జరగకుండా ఉండేది. ఈ యుద్ధం అసలు ఆ ఉభయ వర్గాల నీచపు కుట్రల ఫలితమే.

## జమల్ యుద్ధం

హిజ్రీ శకం 36వ సంవత్సరం. దైవప్రవక్త (స) అల్లుడు అమీరుల్ మోమినీన్ హజ్రత్ అలీ బిన్ అబూ తాలిబ్ (ర) పక్షాన ఉన్నవారు: హజ్రత్ హసన్ బిన్ అలీ (ర), హజ్రత్ అమ్మార్ బిన్ యాసిర్ (ర), హజ్రత్ ఖాఖా అబ్దుల్లా బిన్ అబ్బాస్ (ర), ఉస్మాన్ (ర) గారి హంతకుల వర్గం, దాని నాయకులు, ముహమ్మద్ బిన్ అబూబక్ర్, మాలిక్ ఉష్తుర్.

దైవప్రవక్త (స) సతీమణి ఉమ్ముల్ మోమినీన్ హజ్రత్ అయిషా బిన్త్ అబూబక్ర్ (ర) పక్షాన ఉన్నవారు: హజ్రత్ తల్హా (ర) బిన్ ఉబైదుల్లాహ్, హజ్రత్ జుబైర్ (ర) బిన్ అవ్వామ్, హజ్రత్ అబ్దుల్లా బిన్ జుబైర్ (ర). హజ్రత్ అబ్దుర్రహ్మాన్ బిన్ అతాబ్ (ర), కుట్రదారుల వర్గం, వారి నాయకుడు మర్వాన్ బిన్ హకీం.

"ఒకవేళ విశ్వాసుల్లోని రెండు వర్గాలు పరస్పరం తలపడితే వారి మధ్య సయోధ్య కుదర్చండి. ఆ తరువాత వారిలో ఒక వర్గం మరో వర్గంపై దౌర్జన్యం చేస్తే దౌర్జన్యం చేసేవారితో, వారు తిరిగి దారికివచ్చే వరకు పోరాడండి. వారు దారికి వస్తే వారి నడుమ సయోధ్య నెలకొలపండి, న్యాయం చేయండి. అల్లాహ్‌కు న్యాయంచేసే వారంటే ఇష్టం. విశ్వాసులు ఒకరికొకరు సోదరులు. మీ సోదరుల మధ్య సంబంధాల్ని మెరుగుపరచండి. అల్లాహ్‌కు భయపడండి. మీరు కరుణించ బడతారనే ఆశ ఉంటుంది." (ఖుర్ఆన్ : అల్‌హుజురాత్)

## మేము కోరేది సంస్కరణే

కూఫావాసులు ఈఖార్ చేరగానే అమీరుల్ మోమినీన్ హజ్రత్ అలీ (రజి) కొందరు అనుచరులతో వారిని కలపడానికి వచ్చారు. వారి వెంట హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (ర) కూడా ఉన్నారు. ఆయన వారినుద్దేశించి ఇలా ప్రసంగించారు:

"కూఫావాసులారా! మీకు అరబ్బేతర (ఈరాన్, రోమ్) చక్రవర్తుల భోగభాగ్యాలు ప్రసాదించబడ్డాయి. మీరు అరబ్బేతరుల శక్తిని తుత్తునియలు గావించారు. చివరికి మీరు దానికి వారసులైపోయారు. మీరు మీ ప్రజల రక్షణ గురించి పట్టించుకోలేదు. ఇతరులకు వారి శత్రువుల భయం నుండి రక్షించారు. నేను మిమ్మల్ని పిలువనంపింది మావెంట మన బస్రా సోదరుల దగ్గరికి వెళ్ళడానికే. వారే గనక చర్చల ద్వారా మనల్ని ఆహ్వానిస్తే మంచిది. మనం కోరుకునేది కూడా అదే - వారు మా మాటను ధిక్కరిస్తే మొదట మెత్తగానే వారికి వైద్యం చేద్దాం. వారికి అసలు యదార్థం తెలియజేద్దాం. వారు మనపై దౌర్జన్యం చేయనంతవరకు వారిపై చెయ్యి ఎత్తకూడదు. మంచి కోసం చెయ్యవలసినదంతా చేద్దాం. ఇన్షా అల్లాహ్ గొడవలు లేకుండా చూద్దాం. ఆ

తరువాత అల్లాహ్ కోరిందే జరుగుతుంది. అల్లాహ్ కాక మరెవ్వరిలోను సామర్థ్యాలు లేవు." (తిబ్రీ)

## ఐక్యత కోసం పిలుపు

అమీరుల్ మోమినీన్ హ[జత్ అలీ (ర) హ[జత్ ఖాఖాఅ బిన్ అమ్రను పిలువనంపారు. ఆయన్ని బ[సావారి దగ్గరకు రాయబారిగా పంపారు. ఈ ఖాఖాఅ దైవప్రవక్త (స) అనుచరుల్లో ఒకరు. హ[జత్ అలి ఆయన్ని పంపిస్తూ, "మీరు బ[స్రా వెళ్ళి హ[జత్ తల్హా, హ[జత్ జుబైర్‌లను కలవండి. వారిని పరస్పర ప్రేమ, ఐకమత్యాల వైపు పిలవండి. జమాఅత్ (సంఘం)తో విభేదం వల్ల వచ్చే అనర్థాల గురించి భయపెట్టండి" అని చెప్పారు. తరువాత "ఒకవేళ తల్హా, జుబైర్లు నేను మీకిచ్చిన ఆదేశాల్లో లేని విషయం గురించి మాట్లాడితే మీరేం చేస్తారు?" అని ప్రశ్నించారు ఆయన. అప్పుడు ఖాఖాఅ (ర) "మొదట నేను మీ ఆదేశం మేరకు వారితో మాట్లాడుతాను. ఒకవేళ తమరు నాకిచ్చిన ఆదేశంలో లేని సమస్యను లేవనెత్తితే దాన్ని నాకు తోచిన విధంగా జవాబు చెబుతాను. వీలైనంత మట్టుకు ఆయన మాటలకు సరిఅయిన జవాబే ఇస్తాను. ఏది మంచిది అనుకుంటే అలానే నడుస్తాను" అన్నారు.

"అవును, మీరు దానికి తగిన వారే" అన్నారు హ[జత్ అలి (రజి).

## హజ్రత్ ఆయిషా (ర)తో హజ్రత్ ఖాఖాఅ (ర) సంభాషణ

ఖాఖాఅ (ర) హ[జత్ అలీ దగ్గర సెలవు తీసుకొని బ[సా చేరారు. ముందుగా హ[జత్ ఆయిషా (ర) దగ్గరకెళ్ళి ఆమెకు సలాం చేశారు. తరువాత "అమ్మా! తమరు ఇక్కడిదాకా రావడానికి, ఇంత కష్టపడడానికి కారణం ఏమిటీ?" అని అడిగారు.

"నేను ప్రజల ధర్మాన్ని పునరుద్ధరించడానికి వచ్చాను" అన్నారు హ[జత్ ఆయిషా(ర).

"అయితే హజ్రత్ తల్హా, జుబైర్లను కూడా పిలిపించండి. నా మాటలు విని వారి ఆలోచనలేవో చెబుతారు" అన్నారు ఖాఖాఅ (ర).

## ఖాఖాఅ(ర), జుబైర్ (ర)ల సంభాషణ

హజ్రత్ ఆయిషా (ర) వారిద్దరిని పిలువనంపారు. ఖాఖాఅ (ర) వారుభయులతో నేను ఉమ్ముల్ మోమినీన్ గారి రాక గురించి అడిగాను. వారు ప్రజల ధర్మాన్ని చక్కదిద్దాలని వచ్చారన్నారు. మీరిద్దరూ దీన్ని బలపరుస్తున్నారా లేదా?" అని అడిగారు.

"ఔను, వారి మాటలతో మేము ఏకీభవిస్తున్నాం" అన్నారు ఆ ఇద్దరు.

"అయితే ఆ పునరుద్ధరణ ఎలా చేస్తారో చెప్పండి. దైవసాక్షి! మా కంటే మేలైన పని చేస్తున్నారని అనుకుంటే దాన్ని మేము అంగీకరిస్తాము. తప్పు అని తోస్తే దాన్ని మానేస్తాం" అన్నారు హజ్రత్ ఖాఖాఅ (రజి).

"హజ్రత్ ఉస్మాన్ (ర) గారి హంతకులంతా వధించబడనంత వరకు పరిస్థితులు చక్కబడవు. ఈ ఖిసాస్ను మానేస్తే దివ్యఖుర్ఆన్ను వదిలేసిన వారమవుతాం. ఖిసాస్ (రక్తపరిహారం) తీసుకోవడం వల్ల ఖుర్ఆన్ని సజీవంగా ఉంచినట్లు అవుతుంది." అన్నారు జుబైర్, తల్హాలు ఇద్దరూ.

వారి మాటలు విన్న ఖాఖాఅ (ర) ఇలా అన్నారు:

"మీరు హజ్రత్ ఉస్మాన్ హంతకులైన బస్రా పౌరులు అనేక మందిని వధించారు. వాళ్ళ వధకు పూర్వ సమస్య ఎంతో మేలైన విధంగా పరిష్కరించబడి ఉండేది. మీరు ఒక్కణ్ణి తప్ప ఆరువందల మంది హంతకుల్ని వధించారు. దాని ఫలితంగా ఆ ఆరువందల మందిని వధించినందుకు ఆరువేల మంది కృద్ధులైపోయారు. వారు మిమ్మల్ని వదిలేసి వెళ్ళిపోయారు. మీరు వారితోను, మిమ్మల్ని వదలివెళ్ళినవారితోను యుద్ధం చేస్తే ఈ తెగలన్నీ మీపై విరుచుకు పడతాయి. దీని ఫలితంగా దేన్ని గురించి మీకు భయం ఉందో, దేన్ని గురించి మీరు విభేదిస్తున్నారో వాటికంటే ప్రమాదకరమైన పరిస్థితులు ఎదురవుతాయి. ఈ వధ వల్లనే కదా నస్ర్, రబీ వాళ్ళ మనుషులు మిమ్మల్ని వదిలేసింది. వారు

మీతో యుద్ధం చేయడానికి, మిమ్మల్ని అవమానపరచడానికి సిద్ధంగా ఉన్నారు. ఇదంతా జరిగింది ఆ వధింపుల వల్లనే కదా? ఇతర పట్టణాల వారితో మీరు ఇలాగే ప్రవర్తిస్తుంటే ఓ భయంకరమైన వినాశనం వచ్చి పడుతుంది. మనుషులన్న వారే కనబడరు."

"మీ సలహా ఏమిటో చెప్పండి" అన్నారు హజ్రత్ ఆయిషా (ర).

"దీని కోసం శాంతి, 'స్వాంతన' ఎంతో అవసరం. పరిస్థితులు అనుకూలించి కల్లోలాలు అణిగి, ప్రశాంతమైన వాతావరణం నెలకొని, ప్రజల మనస్సులో నుండి భయం తొలగి, ఒకరిపై మరొకరికి నమ్మకం ఏర్పడిన తరువాతే అసలు విషయాన్ని ఆలోచించవలసి ఉంది. మీరే మా చేతిపై బైత్ చేస్తే మంచిది. ఇది శ్రేయస్సుకు చిహ్నం, దైవకారుణ్యానికి కారణం కాగలదు. ఆ తరువాత మనం హజ్రత్ ఉస్మాన్ (ర) గారి ఖిసాస్ కూడా తీసుకోగలం. సమాజంలో శాంతి నెలకొంటుంది. యుద్ధం తప్ప ఇంకే విషయాన్ని మీరు ఒప్పుకోకపోతే దీనివల్ల గొప్ప ముసలం ఏర్పడుతుంది. ఖిసాస్ తీసుకునే మాట అటుంచి అల్లాహ్ ఈ ఉమ్మత్‌పై ఆపదల్ని, దౌర్భాగ్యాల్ని అవతరింపజేస్తాడు. మీరు మంచినే కోరాలి. ఇదివరలా మంచికి పాటుపడాలి. మమ్మల్ని ఇరకాటంలో పెట్టకండి. అదే విధంగా హజ్రత్ అలికి సంకటాల్ని సృష్టించకండి. అలా జరిగితే మీరో, మేమో నాశనమైపోవచ్చు. దైవసాక్షిగా చెబుతున్నాను. నేను మీకు ఈ విషయం గురించి చెప్పడానికే వచ్చాను. పరిస్థితులు చక్కబడతాయని నమ్మకం నాకు లేదు. అల్లాహ్ హజ్రత్ ఉస్మాన్ (ర) గారి హత్యకు ప్రతీకారం తీర్చుకున్నప్పుడే పరిస్థితులు చక్కబడేటట్లుంది. లేకుంటే రోజురోజుకు కష్టాలు పెరిగిపోతూనే ఉంటాయి. ఆ పరిస్థితుల్ని ఎవ్వరూ నియంత్రించలేరు. ఈ పరిస్థితులు సాధారణ పరిస్థితులు కావు. ఎవరో ఒకరు ఇంకొకణ్ణి హత్య చేయడం, ఓ వర్గం మరో వర్గపు మనిషిని హత్య చేయడం లాంటిది కాదు ఈ పరిస్థితి" అని చెప్పి ఊరుకున్నారు ఖాఖాఅ (రజి).

"మీరు చెప్పింది అక్షరాల నిజం. మీరు వెళ్ళవచ్చు. మీ ఆలోచనలు హజ్రత్ అలీ ఆలోచనలు కూడా ఇవే అయితే మేము సంధికి సిద్ధమే" అన్నారు జుబైర్, తల్హా (ర)లు.

# సంధి ఆశలు

ఖాఖాఅ (ర) ఆనందంగా హజ్రత్ అలి(ర) దగ్గరికి వెళ్ళి పరిస్థితులు తెలియజేశారు. హజ్రత్ అలి(ర) ఎంతో సంతోషించి అందరితో సంధి గురించి చర్చించారు. కొందరు సంధి ఎడల సంతోషాన్ని ప్రకటిస్తే మరి కొందరికి అది రుచించలేదు.

హజ్రత్ అలి (ర) 'జీఖార్'కు వచ్చి విడిది చేసినప్పుడు బస్రావాసులు రావడం ప్రారంభించారు. హజ్రత్ ఖాఖాఅ (ర) ఇంకా సంధికి వెళ్ళి రానేలేదు. బస్రావాసులు యుద్ధం చేయదలచలేదని, వారు సంధి మాత్రమే కోరుతున్నారని చెప్పడానికి బనూతమీమ్, బనూబక్ర్ తెగల ప్రతినిధులు కూఫా నుండి హజ్రత్ అలి (ర) దగ్గరకు వచ్చారు.

కూఫా, బస్రాలకు చెందిన ఈ తెగలు పరస్పరం ఒకరి దగ్గరకు ఒకరు రావడం ప్రారంభం అయింది. కూఫా వారు కూడా సంధినే కోరుకుంటున్నారు.

బస్రా ప్రతినిధి వర్గాలు కూఫావారి దగ్గరికి చేరిన తరువాతగాని హజ్రత్ ఖాఖాఅ (ర), ఉమ్ముల్ మోమినీన్ (ర), జుబైర్, తల్హాలను కలుసుకొని తిరిగి వచ్చారు. వీళ్ళు కూడా సంధినే కోరుతున్న విషయం హజ్రత్ అలి (ర)కు అర్థమయి పోయింది. కాబట్టి ఆయన అందరిని సమావేశపరిచి ఉపన్యాసమిచ్చారు. ఆయన మొదట అల్లాహ్‌ను స్తోత్రించి దైవప్రవక్త (స) కోసం దరూద్ పఠించి, అజ్ఞానకాలం నాటి ధౌర్భాగ్యస్థితి ఎలా ఉండేదో తరువాత లభించిన మంచి ఏమిటో వివరిం చారు. ఆ తరువాత ఇలా ప్రసంగించారు:

దైవప్రవక్త (స) తరువాత, మొదటి ఖలీఫా ద్వారా ఈ సమాజాన్ని సంఘటితంగా ఉంచడం అనేది అల్లాహ్ అనుగ్రహాల్లో ఒకటి. తరువాత రెండవ, మూడవ ఖలీఫాల కాలంలో కూడా ఈ సమాజం సంఘటితంగానే ఉంది. ఆ తరువాత ఈ విపత్తు వచ్చిపడింది. వివిధ జాతులవారు ప్రాపంచిక వ్యామోహంలో పడి ఈ సమాజంలో చీలిక తెచ్చారు. అల్లాహ్ ఇతరులకు ఎందుకు గౌరవం ఇచ్చాడు అని వాళ్ళు అసూయ చెందారు. అందువల్ల వాళ్ళు ఒకరిపై ఇంకొకరికి

శ్రేష్టత ఉండకుండా వాళ్ళు ఈ కాలాన్ని తిరిగి అజ్ఞాన కాలంలోకి మార్చబూనారు. అయినా అల్లాహ్ తాను అనుకున్న దాన్ని పూర్తిచేసే చూపుతాడు.

జాగ్రత్త! రేపు నేనిక్కడ నుండి బస్రాకు బయలుదేరుతాను. మీరు నా వెంట బయలుదేరాలి. హజ్రత్ ఉస్మాన్ (ర) గారి హత్యతో ఎలాంటి ప్రమేయమైనా ఉన్న వారెవరూ మావెంట రావద్దు. ఇలాంటి మూర్ఖులంతా నా నుండి వేరైపోవాలి."

## ఉస్మాన్ (ర) హంతకుల సమాలోచన

ఈ ప్రకటన విన్న తరువాత ఉస్మాన్ (ర) గారి హత్యతో ప్రమేయం ఉన్నవారు, ఆ హత్యను సమర్థించేవారంతా ఒక చోట చేరారు. వారిలో ఉల్బా బిన్ హాశీమ్, అద్దీ బిన్ హాతిం, సాలమ్ బిన్ సాలబా, షరీహ్ బిన్ ఔనీ, ఉష్తర్ నఖయీ ఉన్నారు. ఇక ఈజిప్ట్‌వారి వెంట ఇబ్ను అబ్దుల్లా బిన్ సబా, ఖాలిద్ బిన్ బల్హాం ఉన్నారు. వారు పరస్పరం సమాలోచన ప్రారంభించారు.

"దైవసాక్షి! హజ్రత్ అలి (ర) అందరికంటే అల్లాహ్ గ్రంథం గురించి బాగా తెలిసినవారు. ఈ విషయం సర్వవిదితం. కాబట్టి ఆయన ఒకానొక రోజున ఖుర్‌ఆన్ ఆదేశాలను పాటిస్తూ తప్పకుండా ఉస్మాన్ హంతకుల నుండి 'ఖిసాస్' కోరుతారు. ఆయన ఖిసాస్ కోరినప్పుడు ఆయన్ను కాదనే వాడు ఉండడు. మన సంఖ్య ఇతరుల కంటే తక్కువగా ఉంటుంది. హజ్రత్ అలీ (ర) జాతిని ప్రాణప్రదంగా ప్రేమించే రోజు రానుంది. ప్రజలు కూడా ఆయన కోసం తమ ప్రాణాలను సయితం ధారపోస్తారు. అప్పుడు మన సంఖ్యాబలం అంత గొప్ప సంఖ్యాబలం ముందు ఎందుకూ పనికిరాకుండా పోతుంది. దైవసాక్షి! మీరు అన్ని వైపుల నుండి అగౌరవానికి గురవుతారు. అప్పుడు మీకు ముక్తిమార్గమే లభించదు" అని అన్నారు చాలా మంది ఆ సమావేశంలో. వారి మధ్య ఇలా సంభాషణ ప్రారంభం అయింది.

**ఉష్తర్ నఖయీ :** తల్హా, జుబైర్‌లు ఏం చేయాలనుకుంటున్నారో మనకు బాగా తెలుసు. కాని హజ్రత్ అలి (ర) ఏమనుకుంటున్నారో మనకు తెలియదు.

దైవసాక్షి! అందరూ మనల్ని గురించి అనుకునేది ఒక్కటే. జుబైర్, తల్హాలు, హజ్రత్ అలి (ర)తో సంధి చేసుకుంటే ఆ సంధి మన ప్రాణాలపైన్నే జరుగుతుంది. అయితే మనమంతా కలసి అలీ (ర)పై దాడిచేసి ఆయన్ను ఉస్మాన్ (ర) దగ్గరికి పంపిద్దాం. దీనివల్ల మరో కొత్త కల్లోలం తలెత్తుతుంది. అది మనకు అనుకూల మైన కల్లోలం అవుతుంది.

అబ్దుల్లా బిన్ సబా: నీ సలహా పూర్తిగా తప్పు. ఉస్మాన్ హంతకుల్లారా! జీఖార్‌లో కూఫావాళ్ళ సైన్యం రెండున్నర వేల దాకా ఉంది. ఈ విషయాన్ని గమనించడంలేదా నువ్వు? అదే కాకుండా ఇబ్నె హంజలియా వెంట ఉన్న సైన్యంలో అయిదువేల మంది సిపాయిలున్నారు. వీరంతా మీతో యుద్ధం చేయడానికే గదా ఇక్కడకు వచ్చింది. ఈ సైన్యం నీ చేతుల్ని విరిచిపారేస్తుంది.

ఉల్బా బిన్ హసీమ్ : వారిని వదిలేసి మనం తప్పుకోవడం ఉత్తమం అనుకుంటున్నాను. వారినే పరస్పరం తలపడనీయండి. అలా యుద్ధం చేస్తూ వారి సంఖ్య తగ్గినప్పుడు మన సంఖ్యాబలంతో వారిని చిత్తు చెయ్యవచ్చు. ఒకవేళ వారి సంఖ్యాబలం ఎక్కువగా ఉన్నప్పటికీ ఒకనాటికి మీతో సంధి కుదుర్చు కునేందుకు వివశులైపోతారు. కాబట్టి మీరు వారిని వదిలేసి మీ మీ పట్టణాలకు వెళ్ళిపోండి. మీలో ఓ నాయకుడు బయలుదేరి మిమ్మల్ని నడిపించి మీకు సహాయం చేసి మిమ్మల్ని రక్షించనంతవరకు మాట్లాడకుండా కూర్చోండి.

అబ్దుల్లా బిన్ సబా : ఈ సలహా కూడా తప్పే. అప్పుడు మీరు ప్రజల్ని ప్రేమిస్తున్నట్లు నాటకం ఆడవలసి వస్తుంది. ప్రస్తుతం మీరు వారికి శత్రువులు. మీరు వారి నడుమ ఉంటూ బ్రతికి బట్టకట్టలేరు. నీ సలహా ప్రకారం మనం ఎవరి దారిన వాళ్ళు వెళ్ళిపోతే మనల్ని అన్ని వైపుల నుండి చుట్టుముట్టేస్తారు.

అద్దీ బిన్ హాతిమ్ (రఅన్) : దైవసాక్షి! నేను ఓ మాటకు సంతోషంగాని, మరో మాటకు విముఖత గాని చూపించను. కాని ఉస్మాన్ (ర) గారి హత్య మూలంగా ప్రజలు వ్యాకులత చెంది ఉన్నారన్నది మాత్రం నిజం. జరిగిందేమిటో జరిగిపోయింది. మనం ఇప్పుడు ప్రజల చూపుల్లో చులకనైపోతాం. మన దగ్గర

గుర్రాలున్నాయి. మేలైన ఆయుధాలూ ఉన్నాయి. మీరు ముందడుగు వేస్తే మేమూ ముందడుగు వేస్తాం. మీరాగిపోతే మేమూ ఆగిపోతాం.

**అబ్దుల్లా బిన్ సబా :** అవును మీరు చెప్పింది సరైన మాటే.

**సాలమ్ బిన్ సాలబా :** మీలో ఎవరైనా ప్రాపంచిక జీవితానికే ఆశపడి ఉంటే ఉండొచ్చు. నాకు మాత్రం ఆ ఆశలేదు. దైవసాక్షి! రేపు మీరే గనక శత్రువును ఢీకొంటే నేను నా ఇంటికి మరలిపోను. ఒకవేళ నేనే గనక బ్రతికుంటే వాళ్ళ ఒంటెల్ని బాగా జిబహ్ చేసి వెనక్కు తిరుగుతాను. నేను ఒట్టేసుకొని చెబుతున్నాను వినండి. మీలో ఎవరయితే తమ తలలపై కరవాలాల్ని బాగా ఉపయోగిస్తారో వారికే విజయం లభిస్తుంది. ఎవరు కరవాలం గలవారో వారిదే విజయం. కర్ర గలవానిదే బర్రె.

**అబ్దుల్లా బిన్ సబా :** అవును, ఇది పనికొచ్చే సలహా.

**షరీహ్ :** మీరు యుద్ధ మైదానంలోకి దిగే ముందు ఏదో ఒకటి తీర్మానించుకోండి. ఆలస్యంగా చేయవలసిన పనిని తొందరపడి చెయ్యొద్దు. త్వరగా చెయ్యాల్సిన పనికోసం ఆలస్యం చెయ్యొద్దు. అలాంటివారు చాలా చెడ్డవారు. రేపు రెండు సైన్యాలు పరస్పరం కలిసినప్పుడు ఆ కలయిక ఫలితం ఎలా ఉంటుందో కూడా తెలియదు.

## అంతిమ నిర్ణయం

**అబ్దుల్లా బిన్ సబా :** ప్రజలారా! మీరంతా వారితో కలసి మెలసి ఉండడంలోనే మీ శ్రేయస్సు ఉంది. వారితో కలిసే పని చేయండి. రేపు రెండు సైన్యాలు పరస్పరం కలిసినప్పుడు యుద్ధం ప్రారంభించండి. ఆలోచించే సమయం కూడా ఇవ్వకండి వారికి. మీరు అలీ (ర) వెంట ఉన్నప్పుడు యుద్ధాన్ని ఆపమని చెప్పడానికి మనిషి కూడా లభించకూడదు. ఇదే విధంగా అలీ, తల్హా, జుబైర్, ఇంకా సంధి కోరుతున్నవారు మీ కోరికకు వ్యతిరేకంగా ఏదైనా చేయదలిస్తే వారికి కష్టాలు ఎదురవుతాయి.

ఈ సలహాను అందరూ ఏకగ్రీవంగా ఒప్పుకున్నారు. ఆ తరువాత ఈ ముఠా వెళ్ళిపోయింది. రహస్యంగా తీసుకోబడిన ఈ నిర్ణయం గురించి ఎవరికీ తెలియదు.

ఉదయాన్నే హజ్రత్ అలీ బయలుదేరారు. అక్కడ నుండి ఆయన సరాసరి బనూ అబ్దుల్ ఖైస్ దగ్గరికి, ఆ తరువాత కూఫావాసుల దగ్గరికి వెళ్ళారు. ప్రజలు ఒకరినొకరు కలుసుకుంటున్నారు. బస్రావాళ్ళకు హజ్రత్ అలీ (ర) గారి సలహా ఏమిటో కూడా తెలిసిపోయింది. ఆయన బస్రా సమీపంలో విడిది చేశారు.

## హజ్రత్ జుబైర్, తల్హా(ర)ల నిర్ణయం

హజ్రత్ అలీ (ర) సైన్యం బస్రా నగరం ముందు విడిది చేసిన తరువాత, అబుల్ జిర్బా అనే అతను జుబైర్ బిన్ అవ్వామ్ దగ్గరికి వెళ్ళి 'జుబైర్! మీరు వెంటనే ఓ వేయిమంది అశ్విక దళాన్ని పంపి అలీ (రఅన్) గారి సహచరులు చేరుకోక ముందే ఏదో ఒకటి తేల్చేయండి' అని సలహా ఇచ్చాడు. దానికి హజ్రత్ జుబైర్ (రజి) ఇలా అన్నారు :

"అబుల్ జిర్బా! మాకు యుద్ధపు ఎత్తుగడలు బాగా తెలుసు. కాని వాళ్ళు సంధి వార్త పంపారు. అదీకాక మా నడుమ ఏర్పడ్డ భేదాభిప్రాయం ఇంతకు ముందు ఎన్నడూ ఏర్పడలేదు. ఎవరైనా అల్లాహ్ ఎదుట ప్రళయం నాడు ఏ ఆధారం లేకుండా నిలబడితే అతను చూపే కారణం ఏదీ వినిపించుకో బడదు. ఇది అలాంటి కార్యక్రమమే. అలీ (ర) మాతో యుద్ధం చేయదలచక సంధి కోసం ముందుకు వస్తుంటే ఆయనతో యుద్ధం చేయటం సబబుగా ఉంటుందా? ఈ రోజు సంధి కుదురుతుంది అనే నమ్మకం నాకుంది. మీరు దీనికి ఆనందించాలి. సహనం చూపాలి."

## మనమూ, వారూ అందరం ముస్లిములమే

సిబ్రా బిన్ షైమాన్ ముందుకొచ్చి "తల్హా! జుబైర్! ఇదే మంచి అదను. మీరుభయులు మమ్మల్ని తీసుకొని బయలుదేరండి. యుద్ధంలో పరాక్రమం కంటే ఎత్తుగడలు బాగా పనికొస్తాయి" అని అన్నాడు.

“సి|బ్రా! మనమంతా ముస్లిములమే. వాళ్ళూ ముస్లిములే. ఇంతకు ముందు ఏదైనా సమస్య ఏర్పడినప్పుడు దాని పరిష్కారానికి దివ్యఖుర్ఆన్ అన్నా అవతరించేది లేక దైవ|ప్రవక్తే (స) దాన్ని పరిష్కరించేవారు. ఇదో క్రొత్త సమస్య. ఈ రోజు యుద్ధం జరగవద్దనే జాతి కోరుతుంది. అలీ, ఆయన అనుచరుల అభి|ప్రాయం కూడా ఇదే. ఇలా ఆలస్యం చేయడం ద్వారా వారికి సమయం ఇవ్వడం మంచిది కాదన్న విషయం మాకు బాగా తెలుసు” అన్నారు హ|జ్రత్ జుబైర్ (ర).

## కఅబ్ బిన్ సౌర్ మాటలకు జాతి సమాధానం

ఈ సైన్యపు మొదటి దండు ఇక్కడ చేరింది. ఇంకా మనం దేని కోసం ఎదురుచూడాలి. రండి, వారి తలల్ని నరికేద్దాం అన్నాడు కఅబ్ బిన్ సౌర్ తన తెగనుద్దేశించి. అప్పుడు అతని జాతి ఇలా బదులిచ్చింది:

“ఓ కఅబ్! ఇదేమనుకున్నావు? దీని సంబంధం మన సోదరులతో ముడిపడి ఉంది. పరిస్థితులు ఇంకా అనుమానాస్పదంగానే ఉన్నాయి. దైవసాక్షి! అల్లాహ్ తన ప్రవక్త (స)ను మాలో ప్రభవింపజేసినప్పటి నుండి చూస్తున్నాం. ఆయన సహాబీలు ఏ పనైనా చేబట్టే ముందు దాని ఆద్యంతాలను బాగా ఆలోచించకుండా చేసేవారు కాదు. అయితే ఇది ముందుకు అడుగువేయాలా లేక వెనకడుగు వేయాలా అనేది నిర్ణయించలేకుండా ఉన్న సమస్య. ఈరోజు ఏది సరైనదో, ఏది మన సోదరులకు కష్టం కలిగిస్తోందో తెలియదు. రేపు ఈ పని మనకు చెడ్డదే అనిపించినా మన సోదరులకు అది మంచిదే అనిపించవచ్చు. మనం వారి ముందు ఒక హేతుబద్ధమైన వాదనను ఉంచుదాం. దాన్ని మీరు హేతువు అని అనుకోకపోవచ్చు. వారు ఒప్పుకుంటే సంధి కుదుర్చుకుందాం. దాన్ని అమలు చేసి చూపుదాం. లేకపోతే చివరి చికిత్సగా వాతపెట్టడమే మిగులుతుంది.”

# తల్హా, జుబైర్ (ర)ల గురించి హజ్రత్ అలీ (ర) గారి అభిప్రాయం

కూఫావాసుల్లోని కొందరు హజ్రత్ అలీ (ర)తో, ఆ జాతితో యుద్ధం చేయడం గురించి మీ అభిప్రాయం ఏమిటి అని అడిగారు. అడిగిన వారిలో ఆవర్ బిన్ బనానుల్ మున్ఖరీ కూడా ఉన్నారు.

**హజ్రత్ అలి :** ప్రజల్ని రుజుమార్గంపై నడపడం, భగభగమండే అగ్నిని చల్లార్చడం గొప్ప సత్కార్యం. అల్లాహ్ ఈ సత్కార్యం ద్వారా ఈ సమాజాన్ని ఐక్యపరిస్తే, పరస్పరం భేదభావాలు సమసిపోతాయనే నమ్మకం నాకుంది. వీరు నా మాటను కాదనరు.

**ఆవర్ :** వారు మన మాటలను ఖాతరు చేయలేకపోతే?

**హజ్రత్ అలి :** అయితే వాళ్ళు మనతో యుద్ధం ప్రారంభించనంతవరకు మనం యుద్ధం ప్రారంభించకూడదు.

**ఆవర్ :** ముందుగా మనతో తలపడితే?

**హజ్రత్ అలి :** మనం ఆత్మరక్షణ కోసం యుద్ధం చేద్దాం.

**ఆవర్ :** మనకు లభించే సత్ఫలితమే వారికి లభిస్తుదంటారా?

**హజ్రత్ అలి :** అవును తప్పక లభిస్తుంది.

**అబూ సల్మా :** వారు ఉస్మాన్ (ర) గారి రక్తపరిహారం కోరుతున్నారని, వారు కోరేదాని గురించి అల్లాహ్ ఏకీభవిస్తున్నాడన్న వారి వాదన సరైందేనా?

**హజ్రత్ అలి :** అవును.

**అబూ సల్మా :** మీరు ఉస్మాన్ (రఅన్) గారి ఖిసాస్ (రక్తపరిహారం) కోరడంలో చేసిన ఆలస్యం సరైనదేనంటారా?

**హజ్రత్ అలి :** అవును, ఎందుకంటే, ఎప్పుడయితే ఓ విషయం గురించి పూర్తి నిజానిజాలు తెలియవో, ఆ విషయంలో ప్రయోజనకారిఅయిన దాన్ని స్వీకరించే మార్గం అన్వేషించాలి. అది సరైన పద్ధతి.

**అబూ సల్మా :** రేపు వారికీ మనకు యుద్ధమే జరిగితే, పరలోకంలో దాని పర్యవసానం ఏమిటి?

**హ(జత్ అలి :** మనలో గాని, వారిలోగాని ఎవరైనా చంపబడితే ఆ చనిపోయిన వ్యక్తి అభీష్టం దైవాన్ని సంతోషపెట్టడమే అయితే అల్లాహ్ అతణ్ణి స్వర్గంలో ప్రవేశింపజేస్తాడు.

**మాలిక్ బిన్ హబీబ్ :** మీరు వారితో కలిసినప్పుడు మీరే మార్గాన్ని అనుసరిస్తారు.

**హ(జత్ అలి :** యుద్ధం చేయకపోవడంలోనే శ్రేయం ఉందన్న విషయం మనకూ వారికీ తెలిసిపోతుంది. వారు నా చేతిపై బైత్ చేస్తే చాలా మంచి పని. ఒకవేళ యుద్ధం కోసమే సన్నద్ధమయితే ఇది ఎప్పుడూ మానని గాయంగా మారిపోతుంది.

**మాలిక్:** యుద్ధం జరిగితే మన మృతుల గతి ఏమవుతుంది?

**హ(జత్ అలి :** ఆ మృత్యువుకు కారణం దైవప్రసన్నత అయితే అతనికి తప్పక లాభం కలుగుతుంది. ఇది అతని ముక్తికి కారణభూతమవుతుంది.

## హజ్రత్ అలీ (ర) ప్రసంగం

ఆ తరువాత హ(జత్ అలీ (ర) దైవస్తోత్రం చేసి ఇలా ప్రసంగించారు.

"ప్రజలారా! మీ ప్రాణాల్ని మీ ఆధీనంలో ఉంచుకోండి, మీ చేతుల్ని ఆపి ఉంచండి. వాళ్ళను ఏమనకుండా మీ నోళ్ళను మూసి ఉంచండి. ఎందుకంటే వాళ్ళూ మీ సోదరులే. వాళ్ళే గనక మిమ్మల్ని ఏదైనా అంటే మీరు సహనం వహించండి. ముందుకు ఏ మాత్రం అడుగేయకండి. ఈరోజు వైరాన్ని పెంచి పోషించినవాడు రేపు శత్రువే అవుతాడు."

ఈ ప్రసంగం అయిన తరువాత హ(జత్ అలీ బయలుదేరడానికి ఆదేశం జారీ చేసి బయలుదేరారు. మొదట ఒక సైనికదళాన్ని ముందుకు వెళ్ళమని ఆదేశించారు. హకమ్ బిన్ సలామా, మాలిక్ బిన్ హబీబ్‌లను ఏ జాతివారి

దగ్గరకు ఇది వరకే పంపి ఉన్నారో వారి దగ్గరకు చేరగానే వారినుద్దేశించి హజ్రత్ అలి (రజి) ఇలా అన్నారు :

"మీరే గనక ఖాఖాఅ (ర) చేసుకొని వచ్చిన నిర్ణయంపై నిలకడగా ఉంటే మీరు మీ చేతుల్ని కదలించకండి. (మీ కత్తులు వరల్లోనే ఉంచండి). మా సైన్యాన్ని వాహనాలపై నుండి క్రిందికి దిగనివ్వండి. మేము ఈ సమస్య గురించి బాగా ఆలోచించుకునే సమయం ఇవ్వండి."

## బనూఖైస్ యుద్ధంలో పాల్గొనలేదు

బనూఖైస్ తెగవారు విడిదిచేసిన ప్రదేశానికి హజ్రత్ అలీ (ర) చేరినప్పుడు సైన్యాన్ని చూసి బనూఅసద్ కోపంగా హజ్రత్ అలీ (ర) వైపునకు నడిచారు. వాళ్ళ వెంట అహ్నాఫ్ (ర) బిన్ ఖైస్ కూడా ఉన్నారు. సఅద్ తెగవాళ్ళు హర్ఖూస్ బిన్ జుహైర్‌కు రక్షణ కల్పించి అలీ (ర)తో యుద్ధం చేయడానికి సిద్ధంగా లేరు.

అహ్నాఫ్ ముందుకు వచ్చి హజ్రత్ అలీ (ర)తో "బస్రాలో మా జాతి వారు, రేపు మీరు తమను జయించినప్పుడు అందరినీ చంపేస్తారని, తమ స్త్రీలను బానిసలుగా చేసుకుంటారని అనుకుంటున్నారు" అని విన్నవించుకున్నారు.

**హజ్రత్ అలి :** నిజంగా నేను అలా చేసేవాడినేనా? ఇలాంటి అధర్మ కార్యాలు సత్యతిరస్కారులు తప్ప మరెవరైనా చేయగలరా? వీరంతా ముస్లిములే ముస్లింల పట్ల నేనిలా ప్రవర్తించగలనా? సరే, నీవు నీ జాతిని నా నుండి రక్షించుకోగలవా?

**అహ్నాఫ్ :** అవును నేను నా జాతిని రక్షించుకోగలను. మీరు నా రెండు షరతుల్లో ఒకదాన్ని ఒప్పుకోండి. మీకు నచ్చితే నేను ఒంటరిగా మీ పక్షాన చేరి యుద్ధంలో పాల్గొంటాను. లేదా మీరు కోరితే తళతళలాడే పదివేల ఖడ్గాలను మీ వైపు రాకుండా అడ్డుకోగలను.

**హజ్రత్ అలి :** నాకు నీ రెండో అభిప్రాయమే నచ్చింది.

అహ్నాఫ్ తన జాతి దగ్గరకు వెళ్ళి బిగ్గరగా పిలిచాడు. "వాళ్ళంతా అతని దగ్గరకు చేరారు. ఆ తరువాత బనూతమీమ్ వాళ్ళను పిలిచాడు. వాళ్ళు

వచ్చేశారు. పిదప బనూసఅద్ వారిని పిలిచాడు. వాళ్ళు కూడా వచ్చారు. అందరూ వచ్చాక, యుద్ధరంగానికి దూరంగా ఉండండని ఆదేశించాడు. ఇలా అహ్నాఫ్ వాళ్ళందరిని తీసుకొని వెళ్ళి ఈ భేదాభిప్రాయాల పర్యవసానం ఏమవుతుందో చూద్దామని ఓచోట కూర్చున్నాడు.

ఈ రెండు సైన్యాలు ఎదురెదురుగా మూడు రోజులదాకా అలానే నిలబడి ఉన్నాయి. ఈలోపు వాటిలో ఎలాంటి కవ్వింపు చర్యలు జరగలేదు. హజ్రత్ అలీ (ర) గారి దూతలు హజ్రత్ ఆయిషా (ర) గారి సైన్యంలోకి వచ్చి పోతూనే ఉన్నారు. సంధి ప్రయత్నాలు సాగుతూనే ఉన్నాయి.

## రంగంలోకి హజ్రత్ జుబైర్ (రజి)

ఈలోపు హజ్రత్ జుబైర్ (ర) ఆయుధాలు ధరించి గుర్రంపై ఎక్కి యుద్ధమైదానానికి బయలుదేరారు. ఆయన్ను చూసి కొందరు హజ్రత్ అలీ (ర) గారికి, అదిగో జుబైర్ (ర) వెళుతున్నారు అని చూపించారు. అప్పుడు "జుబైర్‌కు దైవభీతి గురించి ఏమాత్రం గుర్తుచేసినా ఆయన తల్హా కంటే అధికంగా దైవానికి భయపడతారు." అన్నారు హజ్రత్ అలీ (ర).

కాస్సేపటికి హజ్రత్ తల్హా (ర) కూడా సైన్యం నుంచి బయటికి రావడం కన్పించింది. హజ్రత్ అలీ(ర) వారిద్దరి దగ్గరికి వెళ్ళి ఇలా అన్నారు:

"మీరిద్దరూ ఓ పెద్ద సైన్యం, యుద్ధ సామాగ్రి, గుర్రాలతో సిద్ధమైవచ్చారు. అయితే రేపు దేవుని ముందు నిలబడడానికి మీ దగ్గరున్న సాకు ఏమిటీ? అల్లాహ్‌కు భయపడండి. రాట్నంపై దారం వడికి చివరకు దాన్ని ముక్కలు ముక్కలుగా చేసి పారేసిన స్త్రీలా మీరు ప్రవర్తించకండి. నేను మీ ధార్మిక సోదరుణ్ణికానా? మీపై నా రక్తం, నాపై మీ రక్తం నిషిద్ధం కాదా? మీకు నా రక్తం ధర్మసమ్మతం కావడానికి మిమ్మల్ని పురికొల్పిన విషయం ఏమిటి?"

**హజ్రత్ తల్హా (రజి)** : మీరు ప్రజల్ని హజ్రత్ ఉస్మాన్ (ర) గారి హత్యకై పురిగొల్పారు.

**హజ్రత్ అలి (రజి)** : అల్లాహ్ తన దాసుల కర్మలకు పూర్తి ఫలితాన్నిచ్చే రోజున ప్రజలకు తెలిసిపోతుంది యదార్థం ఏమిటో. తల్హా! మీరు హజ్రత్ ఉస్మాన్ (ర) గారి రక్తపరిహారాన్ని అడుగుతున్నారు. కాని ఆయన హంతకులపై అల్లాహ్ శాపం పడుగాక.

జుబైర్! మీకు ఆ రోజు జ్ఞాపకం ఉందా? మీరు దైవ ప్రవక్త (స) వెంట బనూగనమ్ బజారు నుండి వెడుతున్నారు. దైవప్రవక్త (స) నా వైపు చూసి చిరునవ్వు నవ్వారు. మీరు ఆయన వైపు చూసి నవ్వారు. అప్పుడు మీరు అన్న మాట మీకు గుర్తుందా? మీరు, ఈ అబూతాలిబ్ కుమారుడు తన దుశ్చేష్టలను ఆపడా? అన్నారు. మీ మాటలు విన్న దైవప్రవక్త (స) అన్నది గుర్తుకు తెచ్చుకోండి. అప్పుడు ఆయన 'అబూతాలిబ్ కుమారునిలో ఏ చెడూ లేదు' అన్నారు. తర్వాత మీవైపు చూసి 'జుబైర్! నీవు ఇతనితో ఓరోజు యుద్ధం చేస్తావు. అయినా తప్పంతా నీదే అయిఉంటుంది' అని అన్నారు.

**హజ్రత్ జుబైర్ (రజి)** : ఔను మీరు సత్యాన్ని పలికారు. దైవసాక్షి! నాకే గనక దైవప్రవక్త (స) గారి ఈ ప్రవచనం ముందే గుర్తుండి ఉంటే నేనీ ప్రమాణం చేసేవాడ్ని కాను. దైవసాక్షి! ఇక మీతో నేను ససేమిరా యుద్ధం చేయను.

ఈ సంభాషణ తరువాత హజ్రత్ అలీ (ర) వెనక్కు తిరిగి వచ్చేశారు.

## యుద్ధానికి దూరంగా జుబైర్ (ర)

హజ్రత్ జుబైర్ (ర) యుద్ధమైదానం నుండి వెనక్కు మరలి హజ్రత్ ఆయిషా(ర) గారి సన్నిధికి వెళ్ళారు.

**హజ్రత్ జుబైర్ (ర)** : ఉమ్ముల్ మోమినీన్! మీరు తీసుకున్న నిర్ణయం గురించి నేను బాగా ఆలోచించాను. మీ నిర్ణయంతో నేను ఏకీభవించలేకుండా ఉన్నాను.

**హజ్రత్ ఆయిషా (ర)** : అయితే మీ అభిప్రాయం ఏమిటి?

**హజ్రత్ జుబైర్ (ర)** : వారి మానాన వారిని వదిలిపెట్టి నేను ఎక్కడికైనా వెళ్ళిపోదాం అనుకుంటున్నాను.

**హజ్రత్ ఆయిషా (ర)** : మొదట మీరు ఈ రెండు గోతులు త్రవ్వారు. ప్రజలు ఆ గోతుల్లో పడుతూ ఉండగా చూసి వాళ్ళను వదలి మీరు వెళ్ళి పోదలుచుకున్నారు. అసలు విషయం ఏమిటంటే అలీ (ర) బిన్ అబూతాలిబ్ పతాకం చూసిన తరువాత దాని క్రింద మీకు మృత్యువు కనబడింది. కాబట్టే మీరు యుద్ధరంగాన్ని వదిలేస్తున్నారు.

**హజ్రత్ జుబైర్(ర)** : నేను ప్రమాణం చేసేశాను – ఇక హజ్రత్ అలీ(ర)తో యుద్ధం చేయనని. ఆయన నాకు గుర్తు చేసిన మాట కూడా గుర్తుంది.

**హజ్రత్ ఆయిషా (ర)** : అయితే మీరు చేసిన ప్రమాణానికి పరిహారం చేసి యుద్ధం చేయండి.

ఈ సంభాషణ తరువాత అబ్దుల్లా బిన్ జుబైర్(ర) తన బానిసల్లోని ఓ బానిస, మక్‌హూల్‌ను పిలిచి అతనికి స్వాతంత్ర్యం ప్రసాదించారు.

## జుబైర్ (ర) షహాదత్

హజ్రత్ జుబైర్ (ర) మనస్సు కకావికలమయింది. ఆయన సైన్యం నుండి బయటకు వచ్చి బస్రా వైపు దారిపట్టారు. కాని అమ్ర్ బిన్ జర్మూజ్ ఆయన్ను వెంబడించాడు. అతడు సమీపించగానే హజ్రత్ జుబైర్ (ర) దృష్టి అతనిపై పడింది. ఆయనది త్వరగా కోపం చెందే స్వభావం. కాబట్టి నీవు నా వెంట ఎందుకొస్తున్నావు అని కోపంగా అడిగారాయన. ఇబ్నె జర్మూజ్, క్షేమం అడగడానికి వచ్చాను అని జవాబిచ్చాడు.

హజ్రత్ జుబైర్ (ర) వెంట ఆయన బానిస అతియా అనే వాడు ఉన్నాడు. అతడు ఎప్పుడు ఆయన సేవకోసం వెంటనే ఉండేవాడు. అతడు హజ్రత్ జుబైర్‌తో, అయ్యా! ఈ దారినపొయ్యే వాని వైపు అనవసరంగా మనకెందుకు. నమాజు వేళైంది, నమాజు వైపు దృష్టిని మరల్చండి – అని విన్నవించుకున్నాడు.

అవును, నమాజ వేళయింది అన్నాడు ఇబ్నె జర్మూజ్ కూడా.

హజ్రత్ జుబైర్ (ర) నమాజు కోసం గుర్రంపై నుండి దిగారు. కొంత ముందుకు వెళ్ళి నమాజు చేయనారంభించారు. వెనుక నుండి ఇబ్నె జర్మూజ్

నమాజ్ స్థితిలోనే హజ్రత్ జుబైర్‌ను, ఈటెతో ఒక్కపోటు పొడిచాడు. ఆ దుర్మార్గుడు ఆయన్ను షహీద్ చేశాక, ఆయన గుర్రం, కవచం, ఉంగరం తీసుకొని బానిసను వదిలివేశాడు. హజ్రత్ జుబైర్(ర)ను సబా లోయలో ఖననం చేసి హజ్రత్ అలీ స్థావరం దగ్గరికి వచ్చి నిలిచాడు. అక్కడ పహారాదారునితో, జుబైర్ హంతకుని కోసం అనుమతికోరమని అడిగాడు.

ఆ వార్త విన్న హజ్రత్ అలీ(ర), అతనిని లోనికి రమ్మనమను. అదే విధంగా నరకంలోకి ప్రవేశించే శుభవార్త కూడా అందించు అని చెప్పారు.

హజ్రత్ అలీ (ర) హజ్రత్ జుబైర్ (ర) గారి కరవాలాన్ని తెప్పించారు. కరవాలం ఆయన చేతికి వచ్చిన తరువాత "ఈ కరవాలం అదే. ఈ కరవాలంతో హజ్రత్ జుబైర్ దైవప్రవక్త (స) గారి బాధలనెన్నింటినో దూరం చేశారు" అని చెప్పి దాన్ని హజ్రత్ ఆయిషా (ర) గారి దగ్గరకు పంపారు.

## హజ్రత్ తల్హా(ర) షహాదత్

హజ్రత్ తల్హా (ర) జమల్ యుద్ధంనాడు ఇలా అన్నారు. "ఓ అల్లాహ్! హజ్రత్ ఉస్మాన్ (ర) గారి ఆత్మ శాంతి కోసం నా ఈ ప్రాణాన్ని ఆయన ప్రాణానికి బదులుగా ఇచ్చెయ్యి." ఆయన ఇంకా యుద్ధ మైదానంలోకి వచ్చి నిలబడ్డారో లేదో ఓ బాణం విచ్చి ఆయన మోకాలిలో దిగబడింది. హజ్రత్ తల్హా (ర) తన స్థానంలో స్థిరంగా నిలబడే ఉన్నారు. చివరికి ఆయన కాలి మేజోడు రక్తంతో నిండి పోయింది. ఇక నిలబడడం కష్టం అవుతుంటే తన బానిసతో, నీ వెనకాల కూర్చోబెట్టుకొని నన్ను ఎవరూ గుర్తు పట్టని చోటికి చేర్చు. ఇలా రక్తం వృధాగా కారిపోయిన ఏ వృద్ధుణ్ణి కూడా నేను ఈ రోజు వరకు చూడలేదు" అని అన్నారు.

బానిస ఆయన్ను తన వెనుక గుర్రంపై ఎక్కించుకొని బస్రాలోని ఓ శిథిల గృహంలోకి చేర్చి అక్కడ పడుకోబెట్టాడు. ఆ ఇంటిలోనే హజ్రత్ తల్హా (ర) చనిపోయారు. బనీ సఅద్ ప్రాంతంలో ఆయన ఖననం చేయబడ్డారు.

హజ్రత్ తల్హా (ర) మీదికి బాణాన్ని విసరిన వాడు మర్వాన్ బిన్ హకం అని ప్రజలు చెప్పారు అని జుహ్రీ అంటారు. (త్రిబ్రీ)

## అంతర్గత శత్రువులు

పైన వివరించినట్లు, హ|జత్ అలీ (ర) సైన్యంలో ఉస్మాన్ హంతకులు ఉన్నారు. వీరికి సంధి అంటే గిట్టదు. ముస్లిములు సర్వనాశనం కావడమే వారికి కావలసింది. ఇదే విధంగా హ|జత్ ఆయిషా (ర) గారి సైన్యంలోను హ|జత్ తల్హా(ర), హ|జత్ జుబైర్(ర)ల నడుమ చీలిక తెచ్చి పబ్బం గడుపుకోచూసే వారున్నారు. వాళ్ళ నాయకుడు మర్వాన్ బిన్ హకం. హ|జత్ జుబైర్ యుద్ధ మైదానాన్ని వదిలి వెళ్ళి షహీద్ అయ్యారు. హ|జత్ తల్హా (ర) మర్వాన్ బాణానికి గురి అయ్యారు. ఇక యుద్ధమైదానంలో మిగిలిన వారు హ|జత్ ఆయిషా (ర) మాత్రమే. ఆమె ఆ సైన్యానికి అధ్యక్షురాలు. ఆమె కోసం ప్రాణాలను అర్పించడానికి సిద్ధంగా ఉన్న అనుచరులు ఆమె చుట్టూచేరి కంటికి రెప్పలా కాపాడుతున్నారు.

## ఉస్మాన్ (ర) హంతకుల దాడి

హ|జత్ ఉస్మాన్ (ర)ను చంపినవారు, ఆ హత్యలో భాగం పంచుకున్న వారు రాత్రల్లా మేల్కొని ఉన్నారు. సలహా సంప్రతింపులు జోరుగా సాగుతున్నాయి. చివరికి వారంతా ఓ నిర్ణయానికి వచ్చారు. దాని ప్రకారం ఎవరికీ తెలియకుండా యుద్ధం ప్రారంభించాలి అనుకున్నారు. వారికి సంధి అంటే భయం. ఎందుకంటే దానివల్ల వారికే ఎక్కువ నష్టం వాటిల్లేది. ఈ దుష్టబుద్ధి కల షైతానులు తెల్లవారు జామునే బయలుదేరారు. వారి రాక గురించి వారి ప్రక్కనున్న వారికే తెలియదు.

వారు మూకుమ్మడిగా హ|జత్ ఆయిషా (ర) గారి సైన్యంపై మెరుపుదాడి ప్రారంభించారు. ఇంకేముంది యుద్ధం ప్రారంభం అయింది. ఈ "సబాయీలు" యుద్ధానికి ఆజ్యం పోస్తూనే ఉన్నారు. హ|జత్ అలీ (ర) తమ శక్తి కొలది యుద్ధం ఆపమని వారిస్తూనే ఉన్నారు. ఆయన అనుచరులు, ఎదుటి వర్గంపై నిజాన్ని పూర్తిగా చాటేంత వరకు యుద్ధం చేయవద్దు అని అనుకున్నారు. అందువల్ల వీరు పారిపోయేవారిని చంపడంగాని, గాయపడినవారిపై కత్తి ఎత్తడంగాని చేయలేదు. ఇరు సైన్యాలు కూడా ఈ నిబంధనకే కట్టుబడి ఉన్నాయి. రెండు వైపుల నుండి కూడా ఇలాంటి ప్రకటనలే వెలువడుతున్నాయి.

## యుద్ధ మైదానంలో హజ్రత్ ఆయిషా (ర)

కఅబ్ బిన్ సాద్, హజ్రత్ ఆయిషా (ర) దగ్గరికి వచ్చి ఇలా విన్నవించు కున్నారు. "అమ్మా! తమరు మైదానానికి బయలుదేరాలి. ప్రజలు యుద్ధం తప్ప మరి దేన్నీ కోరడం లేదు. మీ ద్వారా అల్లాహ్ సంధి కుదుర్చవచ్చు". హజ్రత్ ఆయిషా అంబారిలో కూర్చున్నారు. దానిపై కవచాలు చుట్టబడ్డాయి.

## ఖుర్ఆన్ ధారి

హజ్రత్ ఆయిషా (ర) కఅబ్‌ను, వాహనం దిగి దివ్యఖుర్ఆన్‌ను పైకెత్తి పట్టుకొమ్మని, ఆ గ్రంథం వైపు ప్రజల్ని పిలువమని ఆదేశించారు. ఆమె తన ఖుర్ఆన్ గ్రంథాన్ని కఅబ్‌కు ఇవ్వగా ఆయన దాన్ని తీసుకొని ప్రత్యర్థుల ముందుకు వెళ్ళారు. అల్లాహ్‌పై ఒట్టేసి పరస్పరం రక్తపాతాన్ని సృష్టించుకోవద్దని పిలుపునిచ్చారు. ఆ తరువాత ఆయన తన కవచాన్ని విప్పి క్రింద పడేశారు. పిదప తన ఢాలును కూడా విరగ్గొట్టారు. కాని హజ్రత్ అలీ(ర) సైన్యంలో సబాయీలు అందరికంటే ముందున్నారు. సంధి కుదిరిపోతుందేమో అన్న భయం పట్టుకుంది వారికి. కఅబ్ ఎప్పుడైతే ఖుర్ఆన్ పట్టుకొని ముందుకొచ్చారో వాళ్ళు ఆయనకు అడ్డం వచ్చేశారు. హజ్రత్ అలీ వెనుక తన సైన్యంలో ఉన్నారు. తమ ప్రత్యర్థులు యుద్ధాన్నే కోరుతున్నారని అనుకున్నారాయన. కఅబ్ వాళ్ళ ముందు ఖుర్ఆన్ పెట్టినప్పుడు సబాయీలు ఆయనపై బాణాల వర్షం కురిపించారు. ఈటెలతో పొడిచారు. అదే కాదు హజ్రత్ ఆయిషా (ర) గారి అంబారి పైనా బాణాలు కురిపించారు.

## హజ్రత్ ఆయిషా (ర)పై సబాయీల దాడి

హజ్రత్ ఆయిషా (ర) బిగ్గరగా 'ఓ నా కుమారుల్లారా! ఇటు రండి. అల్లాహ్‌కు భయపడండి. ప్రళయదినాన మీ కర్మల గురించి జవాబు చెప్పుకోవలసి ఉందనే విషయం మరువకండి" అని అన్నారు. అయినా వారు ఆమె మాటలు ఖాతరు చేయకుండా ముందుకు వస్తూనే ఉన్నారు. వాళ్ళు అలా ముందుకు వచ్చి హజ్రత్ ఆయిషా (ర) గారి ఒంటెపై దాడి చేస్తూవుంటే ఆమె, "ప్రజలారా!

ఉస్మాన్ హంతకులు, వాళ్ళ అనుచరులను శపించండి" అని అరిచి చెప్పారు. ఆమెతో సహా బస్రావాళ్ళు కూడా సబాయీలను శపించారు.

హజ్రత్ అలీ(ర) చెవుల్లోకి ఈ శాపనార్థాలు దూరాయి. ఆయన, ఈ గోల ఏమిటీ అని అడిగారు. దానికి ప్రజలు, అయ్యా హజ్రత్ ఆయిషా (ర), ఆమె మద్దతుదారులు ఉస్మాన్ హంతకులను శపిస్తున్నారు అని చెప్పారు. అది విన్న హజ్రత్ అలి (ర) కూడా, ఉస్మాన్ హంతకుల్ని వాళ్ళ మద్దతుదారులను శపించారు.

## జమల్ అనుచరులు

సబాయీలు నలువైపుల నుండి హజ్రత్ ఆయిషా (ర)గారి ఒంటెపైకి విరుచుకుపడ్డారు. కాని ఉమ్ముల్ మోమినీన్ అంటే ప్రాణాలను సయితం అర్పించే బనూజబా తమ మాతృమూర్తి రక్షణ కోసం తమ ప్రాణాలను అర్పించారు. ఒక వ్యక్తి ఒంటె ముకుతాడు పట్టుకొని నిలబడగానే అతడు షహీద్ అయిపొయ్యేవాడు. అతడు అమరగతినొందగానే మరొకడు అతని స్థానంలోనికి వచ్చి నిలబడేవాడు. అతని తరువాత మరొకడు ఆ బాధ్యతను స్వీకరించేవాడు. ఇలా 'బనూజబా' తెగకు చెందిన డెబ్భై మంది అమరగతినొందారు.

జమల్ యుద్ధంలో ముందుకు వచ్చి ఒంటె ముక్కుతాడు పట్టుకునేవాడు, ఉమ్ముల్ మోమినీన్ హజ్రత్ ఆయిషా (ర) గారికి నేను ఫలానా వాడను. ఫలానా వాని కుమారుణ్ణి అని తెలియజేసేవాడు. అలా పట్టుకునేవారిలో అబ్దుల్లా బిన్ జుబైర్ (ర) కూడా ఉన్నారు. ఆయన ఒంటె ముకుతాడు పట్టుకున్నప్పుడు ఏమీ మాట్లాడలేదు. అప్పుడు హజ్రత్ ఆయిషా (ర) ఆయనతో నీవెవరివి, మాట్లాడ వేమిటి? అని అడిగారు. అప్పుడు ఆయన నేను మీ మేనల్లుణ్ణి అని సమాధానం ఇచ్చారు.

అప్పుడామె అయ్యో! అస్మా తనయుడవా? అన్నారు. అస్మా (ర), హజ్రత్ ఆయిషా (ర)గారి అక్కగారు. ఈలోపు అద్దీ బిన్ హాతిమ్, మాలిక్ బిన్ ఉష్తర్ కలిసి ఒంటె దరిదాపుల్లోకి రానేవచ్చారు. దాడి మొదలయి రక్తపాతం జరిగింది.

హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ జుబైర్ (ర) ఇలా అంటారు:

"జమల్ యుద్ధంలో నా శరీరంపై ముప్ఫై ఏడు గాయాలయ్యాయి. ఆనాటి యుద్ధంలాంటి యుద్ధం నేనెప్పుడూ చూళ్ళేదు. ఇటు మేము అటు ప్రత్యర్థులు ఎవ్వరూ అపజయంపాలు కాకుండా నిలబడి యుద్ధం చేస్తూనే ఉన్నాము. అయితే చివరికి మేము అపజయానికి చేరువ అయ్యాం. ఒంటె ముక్కుతాడు మా చేతి నుండి జారిపోయింది. అప్పుడు హజ్రత్ అలి (ర) 'బిగ్గరగా, ఒంటెను జిబహ్ చేసేయండి, ఒంటె జిబహ్ అయిపోతే అందరూ చెల్లాచెదరై పోతారు' అని చెప్పారు. ఒకతను ఒంటెను గాయపరిచి క్రిందపడ వేశాడు. హజ్రత్ అలీ(ర), అంబారీని ఎత్తేయమని దానిపై గుడారం వేయమని ముహమ్మద్ బిన్ అబూబక్ర్‌ను ఆదేశించారు. ఇంకా ఉమ్ముల్ మోమినీన్ హజ్రత్ ఆయిషా (ర) ఏమైనా గాయపడ్డారో ఏమో చూడమని కూడా చెప్పారు. ముహమ్మద్ బిన్ అబూబక్ర్ ఆ గుడారంలో తలదూర్చాడు ఆమె యోగక్షేమాలు తెలుసుకోవాలని.

హజ్రత్ ఆయిషా (ర) కోపంగా, "ఎవ్వడివిరా నువ్వు! నీ నాశనం గాను" అని అన్నారు.

"నేను మీ బంధువునే" అని బదులిచ్చాడు ముహమ్మద్ బిన్ అబూబక్ర్.

"ఖస్ అమియా (అంటే అస్మా బిన్తె అమీస్) కొడుకువా?" అడిగారు ఆయిషా (ర).

"అవును, నా తల్లిదండ్రులు మీకై అర్పితం. నేను అతన్నే. అల్లాహ్ దయవల్ల మీరు క్షేమంగానే ఉన్నారు" అన్నాడు ముహమ్మద్ బిన్ అబూబక్ర్.

## హజ్రత్ అమ్మార్ బిన్ యాసిర్ (ర)

యుద్ధం ముగిశాక హజ్రత్ అలి (ర) ఓ వర్గాన్ని ఉద్దేశించి, "హతుల నడుమ నుండి హజ్రత్ ఆయిషా (ర) గారి అంబారీని ఎత్తుకొని రండి" అని ఆదేశించారు. ఖాఖాల (ర), జఫర్ బిన్ హారిస్ అప్పటికే అంబారీని ఒంటెపై నుండి క్రిందికి దింపి ప్రక్కన పెట్టారు. హజ్రత్ అలి (ర) ఆదేశాన్ని శిరసావహించి

ముహమ్మద్ బిన్ అబూబక్ర్ కొంతమందిని వెంటబెట్టుకొని అంబారీ దగ్గరికి చేరి అందులోకి తన చేతిని ప్రవేశపెట్టాడు.

**హ(జత్ ఆయిషా(ర)** : ఎవరు నువ్వు?

**ముహమ్మద్ (ర)** : మీ ఉత్తమ సోదరుడు.

**హ(జత్ ఆయిషా (ర)** : లేదు, ఆజ్ఞను ఉల్లంఘించిన సోదరుడివి.

**అమ్మార్ బిన్ యాసిర్ (ర)** : అమ్మా! ఈ రోజు మీ పుత్రులు చేసిన యుద్ధం ఎలా ఉంది?

**హ(జత్ ఆయిషా (ర)** : నీవెవరివి?

**అమ్మార్ (ర)** : మీ ఉత్తమ పుత్రుణ్ణి.

**హ(జత్ ఆయిషా (ర)** : నేను నీకు అమ్మను కాను.

**అమ్మార్ (ర)** : ఎందుకుకారు, మీరేమీ అనుకోవద్దు.

**హ(జత్ ఆయిషా (ర)** : మీరు నెగ్గారని గర్విస్తున్నారు. మీలా ఎవరూ ఇతరులకు నష్టం కలిగించలేదు. మీకూ నష్టం వాటిల్లింది. దైవసాక్షి! ఇలాంటి మనస్తత్వంగల వాళ్ళు ఎప్పుడూ సఫలురు కాలేరు.

ఈ సంభాషణ అనంతరం అంబారీ ఎవరూ లేనిచోట సురక్షితంగా ఉంచబడింది. హ(జత్ ఆయిషా (ర) గారి అంబారీ రెక్కలు మొలిచిన పక్షిలా గోచరిస్తోంది.

## ఆయిన్ బిన్ జబీయా దుష్ప్రవర్తన

అంబారీని ప్రక్కకు పెట్టిన తరువాత ఆయిన్ బిన్ జబీయా అనేవాడు నెమ్మదిగా దాని దగ్గరికి నడిచి అందులోనికి తొంగిచూశాడు.

**హ(జత్ ఆయిషా (ర)** : ఎవరు నువ్వు. నీపై అల్లాహ్ శాపం పడుగాక.

**ఆయిన్** : (గట్టిగా) దైవసాక్షి! నేను ఈరోజు హుమైరాను చూడగలిగాను.

**హ(జత్ ఆయిషా (ర)** : అల్లాహ్ నీ రహస్యాన్ని బహిరంగపరచుగాక. నీ చేతులు నరకుగాక, నిన్ను నగ్నం చేయుగాక.

ఈ సంఘటన జరిగిన కొన్నాళ్ళకే ఆయిన్ బస్రాలో హత్య చేయబడ్డాడు. అతణ్ణి ఉరికంబంపై ఎక్కించారు. అతని చేతులు కూడా నరకబడ్డాయి. బనూ అజ్ద్‌కు చెందిన ఓ శిథిలగృహంలో ప్రజలు అతణ్ణి నగ్నంగా చేసి అతనిపై బాణాల వర్షం కురిపించారు.

## హజ్రత్ ఆయిషా (ర) సన్నిధిలో హజ్రత్ అలీ (ర)

ముహమ్మద్ బిన్ అబూబక్ర్ (ర), అమ్మార్ బిన్ యాసిర్ (ర) అంబారీ తాళ్ళు విప్పదీసి దాన్ని ఒక ప్రక్కన పెట్టిన తరువాత ముహమ్మద్ అంబారీలో తన చేతిని పోనిచ్చి మీ సోదరుడు ముహమ్మద్ అని చెప్పాడు.

**హ\జ్రత్ ఆయిషా (ర)** : అంటే నిందితుడయిన నా సోదరుడా?

**ముహమ్మద్** : సోదరీ! మీరు గాయపడలేదు గదా?

**హ\జ్రత్ ఆయిషా (ర)** : నీకు నా గాయంతో పనేమిటీ?

**ముహమ్మద్** : అలా అంటే నేను పూర్తిగా మార్గభ్రష్టుణ్ణయిపోతాను.

**హ\జ్రత్ ఆయిషా (ర)** : కాదు, సన్మార్గం పొందినవాడివే.

ఆ తరువాత హ\జ్రత్ అలీ (ర) ఆమె సన్నిధికి వచ్చి "ఓ నా మాతృమూర్తి! తమరెలా ఉన్నారు?" అని అడిగారు.

**హ\జ్రత్ ఆయిషా (ర)** : అల్‌హమ్దులిల్లాహ్ ! నేను క్షేమమే.

**హ\జ్రత్ అలీ (ర)** : అల్లాహ్ మిమ్మల్ని మన్నించుగాక.

**హ\జ్రత్ ఆయిషా (ర)** : అల్లాహ్ మిమ్మల్ని కూడా మన్నించుగాక.

యుద్ధం ముగిశాక హ\జ్రత్ ఆయిషా (ర) పర్దాలోనికి వెళ్ళిపోయారు. అందరికంటే ముందు ఖాఖాఅ బిన్ అమ్ర్ ఆమె సన్నిధిలో హాజరయ్యారు. ఉమ్ముల్ మోమినీన్‌కు సలాం చేశారు.

**ఉమ్ముల్ మోమినీన్ (ర)** : నేను నిన్న ఇద్దరిని చూశాను. వారు కత్తులు తీసుకొని నా ముందు తలపడ్డారు. వాళ్ళు ఫలానా గీతం పాడుతూ ఉన్నారు. వారెవరో మీకు తెలుసా?

**ఖాఖాఅ (ర)** : తెలుసు. వారిలో ఒకడు 'మీరు మమతలేని మాతృ మూర్తుల'ని అన్నాడు. దైవసాక్షి! అతనికంటే అసత్యపరుడు మరొకడు ఉండడు. మాకు తెలుసు మీరు ఎంతో పుణ్యవతులు. అయినా మీ ఆదేశాల్ని ఎవరూ పాలించడంలేదు.

**హ|జత్ ఆయిషా (ర)** : అయ్యో, నేను ఇరవై సంవత్సరాలకు పూర్వమే చనిపోయి ఉంటే బాగుండేది.

ఖాఖాఅ (ర), హ|జత్ ఆయిషా (ర) నుండి సెలవు తీసుకొని హ|జత్ అలీ(ర) వద్దకు వెళ్ళారు. హ|జత్ ఆయిషా (ర) ఇలా అడిగారని అన్నారు.

**హ|జత్ అలీ (ర)** : అయితే ఆ ఇద్దరు ఎవరై ఉంటారు?

**ఖాఖాఅ (ర)** : వారిలో ఒకడు మీ అనుచరుడు అబూహాలా.

**హ|జత్ అలీ (ర)** : అయ్యో! నేను ఈ సంఘటనకు ఇరవై సంవత్సరాలకు పూర్వమే చనిపోయి ఉంటే బాగుండేదే అని విచారం వెలిబుచ్చారు.

మొత్తానికి హ|జత్ ఆయిషా (ర), హ|జత్ అలీ (ర) ఇద్దరూ ఒకే మాట అన్నారు.

ముహమ్మద్ బిన్ అబూబక్ర్ (ర), అమ్మార్ బిన్ యాసిర్ (ర)లు ఒంటె క్రిందపడిన తరువాత హ|జత్ ఆయిషా (ర) దగ్గరికి వెళ్ళారు. అంబారీ తాళ్ళను తెగ్గొట్టి దాన్ని ఓ పక్కన పెట్టారు. ఆ తరువాత హ|జత్ అలి (ర) ఆమెను బ|స్రా తీసుకొని వెళ్ళమని ఆదేశించారు. వీరిద్దరు ఆమెను బ|స్రా తీసుకొనివెళ్ళి అబ్దుల్లా బిన్ ఖల్ఫ్ అల్ ఖజాయి ఇంట్లో ఉంచారు.

## జమల్ యుద్ధం మృతులు స్వర్గస్థులు

రాత్రి చీకటిలో, గాయపడ్డవారిలో ఎవరెవరైతే నడువగలిగి ఉన్నారో వాళ్ళు బ|స్రా చేరారు. హ|జత్ ఆయిషా (ర), తన వెంట, హ|జత్ అలీ(ర) వెంట మొత్తం ఎంతమంది ఉన్నారో వారిలో ఎంతమంది హతులయ్యారు, ఎందరు మిగిలారు, ఇంకెంతమంది జాడ తెలియడంలేదో అడిగి తెలుసు కున్నారు.

ఆమె అబ్దుల్లా బిన్ ఖల్ఫ్ ఇంట విడిదిచేసి ఉన్నప్పుడు ప్రజలు ఆమె చుట్టూ మూగారు. ఆమె ముందు ఎవరైనా ఒకరి మరణం గురించి ముచ్చటిస్తే "అల్లాహ్ వారిని కరుణించుగాక" అని ఆమె అనేవారు. ఆమె అనుచరుల్లో ఒకరు, అల్లాహ్ వారిని ఎలా కరుణిస్తాడు అని అడిగారు. దానికి హజ్రత్ ఆయిషా (ర.జి) "దైవప్రవక్త (సఅసం) ఫలానా వ్యక్తి స్వర్గానికి వెళతాడు, ఫలానా వ్యక్తి స్వర్గంలోకి ప్రవేశిస్తాడు అని ప్రవచించారు" అని అన్నారు.

## పాపాల మన్నింపు

హజ్రత్ అలి అన్నారు : దైవప్రవక్త (స) పై అవతరించిన ఆయత్‌లన్నింటి లోను ఈ ఆదేశం అవతరించినప్పుడు ఆయన ఎక్కువ సంతోషపడ్డారు:

"వమా అసాబమ్ మిమ్ ముసీబతిన్ ఫబిమా కసబత్ అయిదీకుమ్ వ యగ్ఫిరు అన్ కసీర్." (మీకు ఏ కష్టం కలిగినా అది మీ కర్మల ఫలితమే. అల్లాహ్ చాలావరకు క్షమిస్తాడు).

ఈ ఆయత్ అవతరించినప్పుడు దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు:

"ముస్లిములపై ఈ ప్రపంచంలో ఏ ఆపద వచ్చిపడినా అది వారి పాపాల వల్ల వచ్చేదే. వాటిలో చాలా పాపాల్ని అల్లాహ్ క్షమిస్తాడు. ప్రపంచంలో అతనికి ఏ కష్టం ఎదురైనా అది అతని పాప పరిహారానికి, మన్నింపునకు కారణం అవుతుంది. ప్రళయంనాడు దానికి ఎలాంటి శిక్షపడదు. ఏదైతే అల్లాహ్ ఇహ లోకంలో మన్నించాడో అది మన్నించబడ్డదే. ఎందుకంటే అల్లాహ్ ఒకదాన్ని మన్నించిన తర్వాత దానికి శిక్ష వేయడు."

## మదీనాకు తిరుగు ప్రయాణం

హజ్రత్ ఆయిషా (ర) మదీనా తిరిగి వెళ్ళడానికి సిద్ధమయ్యారు. అప్పుడు హజ్రత్ అలి (ర) ఆమె ప్రయాణానికి కావల్సిన వాహనం, దారి భత్యం వగైరాలు సమకూర్చారు. బస్రాలోనే ఉండాలని నిర్ణయించుకున్నవారు తప్ప మక్కా నుంచి వచ్చినవారంతా ఆమె వెంట బయలుదేరారు. బస్రాకు చెందిన ప్రముఖ స్త్రీలు నలభై మందిని కూడా వారి వెంట పంపే ఏర్పాటు చేశారు హజ్రత్ అలి (ర).

బయలుదేరే రోజు రాగానే హజ్రత్ అలి (ర), హజ్రత్ ఆయిషా (ర) సన్నిధికి హాజరై వారిని సాగనంపడానికి నిలబడి ఉన్నారు. ప్రజలంతా అక్కడికి వచ్చేసిన తరువాత హజ్రత్ ఆయిషా (ర) బయటకు వచ్చి ఇలా పలికారు.

"నా పుత్రులారా! తొందరపాటుతో మనం ఒకరికి వ్యతిరేకంగా ఒకరు కాలుదువ్వాము. ఇకనుండి మన మధ్య ఉన్న భేదాభిప్రాయాల మూలంగా మనలో ఎవరూ ఒకరిపై ఒకరు దౌర్జన్యం చేసుకోవద్దు. దైవసాక్షి! నాకూ అలీకి నడుమ భేదాభిప్రాయం ఉన్నమాట నిజమే. అయితే అది అత్తా అల్లుళ్ళ నడుమ ఉండే భేదాభిప్రాయం మాత్రమే. యదార్థం చెప్పాలంటే అలి (ర) ఎంతో మంచిమనిషి."

ఆ తరువాత హజ్రత్ అలి (ర) ప్రజలనుద్దేశించి, "దైవసాక్షి! ఉమ్ముల్ మోమినీన్ నిజం పలికారు. నాకూ ఆమెకు నడుమగల భేదాభిప్రాయం అలాంటిదే. హజ్రత్ ఆయిషా (ర) ఇహపరాల్లోనూ దైవప్రవక్త (స)కు సతీమణే."

## హజ్రత్ అమ్మార్ (ర), ఉమ్ముల్ మోమినీన్ (ర) సన్నిధికి

హజ్రత్ అమ్మార్ బిన్ యాసిర్(ర), ఉమ్ముల్ మోమినీన్ హజ్రత్ ఆయిషా (ర) సన్నిధికి వచ్చి "మీచేత పరదా పాటించే ప్రమాణం తీసుకోబడింది. ఈ ప్రమాణం దానికి ఎంత వ్యతిరేకం?" అని అడిగారు.

"ఎవరు? అబుల్ యఖ్జానా మాట్లాడేది?" అడిగారు హజ్రత్ ఆయిషా(ర).

"అవును" అన్నారు అమ్మార్ (ర)

"నాకు తెలుసు, మీరు సత్యం పలికేవారని" అన్నారు ఆయిషా (ర).

"మీ నోట నా గురించి ఈ మాట చెప్పించిన దైవం ఎంతో ప్రశంసనీయుడు" అన్నారు హజ్రత్ అమ్మార్ (ర).

ఉమ్ముల్ మోమినీన్ హజ్రత్ ఆయిషా (ర) 36 హిజ్రీ శకం, రజబ్ మాసం మొదటి వారంలో శనివారం నాడు బస్రా నుండి బయలుదేరారు.

ఆమెను సాగనంపడానికి హజ్రత్ అలి (ర) కాలినడకన ఎన్నో మైళ్ళ వరకు వెళ్ళారు. తన కుమారులకు, ఒక రోజు వరకు ఆమె వెంట వెళ్ళి తిరిగి రమ్మని చెప్పి వెనక్కి తిరిగారు.

హజ్రత్ ఆయిషా (ర) బస్రా నుండి మక్కాకు బయలుదేరారు. మర్వాన్ బిన్ హకమ్, అస్వద్ ఆమెను మధ్యలోనే వదలి మదీనా వెళ్ళిపోయారు. ఆమె హజ్ కాలం ముగిసేదాకా మక్కాలోనే ఉండి ఆ తరువాత మదీనా తిరిగి వచ్చారు.

(ఈ వివరాలన్నీ తారీఖె తబ్రీ నుండి గ్రహించబడ్డాయి).

## మదీనాలో హజ్రత్ ఆయిషా (ర)

హజ్రత్ ఆయిషా (ర) తన స్వంత ఇంటికి, తన స్వంత నగరానికి వచ్చేశారు. తేజోవంతంగా, యథాతథంగా ఉంది మదీనా నగరం. ఎటుచూసినా దైవప్రవక్త (స) కోసం దరూద్, సలాములు పఠించే కోలాహలం ఎప్పటిలాగే ఉంది. ఎలాంటి మార్పులేదు. మదీనావాసులు హజ్రత్ ఆయిషా (ర) ఆగమనానికి సంబరపడుతున్నారు.

"ఓ మాతృమూర్తీ! మీ ఎడబాటు వల్ల మేమెంతో తల్లడిల్లిపోయాం. మీ కోసమే మా ఎదురుచూపులు. మీ పవిత్ర నోటితో ప్రవక్త (స) ప్రవచనాలు వినడానికి ఆతురత పడుతున్నాం."

"అమ్మా! నీ ఉనికి మాకు ఓ వరం. అది మా హృదయాలకు స్వాంతన చేకూర్చేది. మేము నీ కుటీరం దగ్గరకు వచ్చి దరూద్, సలాములు సమర్పించే వాళ్ళం. నీ దీవెనెలు గైకొనేవాళ్ళం."

"అమ్మా! నీ ఎడబాటు సహించలేనిది. మమ్మల్ని వదిలి ఇంకెక్కడికి వెళ్ళకు. మేము నీ సేవచేయడానికి ఎప్పుడూ సిద్ధంగా ఉంటాం."

విశ్వాసుల మాతృమూర్తి (రజి) తన సంతానాన్ని ఇలా సముదాయించారు:

"నా కుమారులారా! మీ కోసమే నేను ఇంటి నుండి బయటకు వెళ్ళాను. సమాజ సంస్కరణ తాపత్రయమే నన్ను బస్రాకు తీసుకెళ్ళింది. ఇక నేనెక్కడికీ వెళ్ళను. జీవితాంతం ఇక్కడే ఉండిపోతాను. దైవప్రవక్త (స)గారి ప్రవచనాల్ని

మీకు వినిపిస్తాను. ఆయన సచ్చరితాన్ని లోకానికి చాటుతాను. ఆయన గుణగణాలను ఎరుకపరుస్తాను. ఇక నేనెక్కడికి వెళ్తాను? వెడితే దైవం దగ్గరికే."

## అమ్మార్ బిన్ యాసిర్ (ర) షహాదత్

జమల్ యుద్ధ జ్వాలలు ఇంకా చల్లారకముందే 'సఫ్ఫైన్'లో తిరుగుబాటు బయలుదేరింది. తిరుగుబాటు వర్గం హ(జత్ అలి (ర.జి)కు వ్యతిరేకంగా యుద్ధానికి కాలుదువ్వారు. ఆయన కూడా వారిని ఎదుర్కొనడానికి బయలు దేరారు. భయంకర యుద్ధం జరిగింది. హ(జత్ అమ్మార్ బిన్ యాసిర్ (ర) తిరుగుబాటు దారుల చేతుల్లో అమరగతి నొందారు. ఉస్మాన్ (ర)గారి హంతకులు జలగల్లా, హ(జత్ అలి(ర) వెంటపడ్డారు. సఫ్ఫైన్ యుద్ధంలో అమీరుల్ మోమినీన్ హ(జత్ అలి(ర)గారి సైన్యమే పైచేయిగా ఉంది. అయితే ఉస్మాన్ (ర) హంతకుల పట్టుదల ఆ విజయాన్ని కాస్త అపజయంగా మార్చింది. చివరికి ఈ హంతకులే 'ఖారిజీలు'గా మారి హ(జత్ అలి (ర)కి వ్యతిరేకంగా తిరుగుబాటు లేవదీశారు. హ(జత్ అలి (రజి) వాళ్ళ తిరుగుబాటును కఠినంగా అణచివేశారు.

## హజ్రత్ అలి (ర) షహాదత్

ఓ రాటుదేలిన ఖారిజీ అబ్దు(రహ్మాన్ బల్‌హీమ్, హ(జత్ అలి (ర)ని హత్య చేయడానికి కాచుకొని ఉన్నాడు. అతడు అదను చూసి కూఫాలో హ(జత్ అలి (ర)పై దాడిచేసి ఆయన్ను షహీద్ చేశాడు.

హ(జత్ అలి (ర) హత్య తరువాత అక్కడివారు వచ్చి హ(జత్ ఆయిషా (ర)గారికి ఈ వార్త అందజేశారు. ఆమె వారిలో ఒకరిని అడిగారు, "అబ్దుల్లాహ్! నేను అడిగేవాటన్నటికి ఉన్నది ఉన్నట్లు సమాధానం ఇస్తావా?" అని.

"ఎందుకు ఇవ్వను ఉమ్ముల్ మోమినీన్!" అని బదులిచ్చాడా వ్యక్తి.

హ(జత్ అలి (ర)ని హత్యచేసిన వాళ్ళెవరు, అసలు జరిగిందేమిటి వివరించమని అడిగిన మీదట ఆ వచ్చినవారు హ(జత్ ముఆవియా (ర), హ(జత్ అలి (రజి)ల నడుమ జరిగిన సంధి, దానికి ఖారిజీల వ్యతిరేకత, హ(జత్ అలి

(ర) వారికి నచ్చజెప్పడానికి ప్రయత్నించడం, వారు ఒప్పుకోకపోవడం వగైరా విషయాలు పూసగ్రుచ్చినట్లు వివరించారు.

ఇది విన్న హజ్రత్ ఆయిషా (ర) ఇలా అన్నారు: "అల్లాహ్ హజ్రత్ అలి (ర.జి)ని కరుణించుగాక. ఆయనకు ఏదైనా విషయం నచ్చితే "సదఖల్లాహు వరసూల్" (అల్లాహ్ ఆయన ప్రవక్త నిజం చెప్పారు) అనేవారు. ఇరాక్ వాళ్ళు ఆయన గురించి అబద్ధమాడారు. ఆయనపై అపనింద మోపారు. ఉన్నవిలేనివి ఆయనపై కల్పించి చెప్పారు." (ముస్నద్ అహ్మద్)

ఇప్పుడు మనం హజ్రత్ ముఆవియా (ర)గారి రాచరిక హయాంలో అడుగు పెడుతున్నాం. ఉమ్ముల్ మోమినీన్ హజ్రత్ ఆయిషా (ర) గారి జీవితంలో కొన్ని ఘట్టాలను మీకు చూపించదలిచాం.

## హజ్రత్ హసన్ బిన్ అలి (రజి)

హజ్రత్ అలి (ర)గారి కుమారుడు హజ్రత్ హసన్ (ర) హిజ్రీ శకం 49లో హజ్రత్ ముఆవియా కాలంలోనే మదీనాలో పరమపదించారు. హజ్రత్ ఆయిషా (ర) కుటీరంలో దైవప్రవక్త (స), హజ్రత్ అబూబక్ర్, హజ్రత్ ఉమర్(రజి) ఖననం అయిఉన్నారు. ఓ మూల మరో గోరీ కోసం స్థలం ఉంది. హజ్రత్ హసన్ (ర) తన శవాన్ని ఆ ఖాళీ స్థలంలో ఖననం చేయమని, ఎవరైనా అడ్డుచెబితే వారితో పోట్లాడే అవసరంలేదని తన తమ్ముడికి వసియ్యత్ చేశారు.

హజ్రత్ హసన్ (ర) మరణించిన తరువాత ఆయన చేసిన వసియ్యత్ ప్రకారం హజ్రత్ హుసైన్ (ర) నిర్ణీత స్థలం కోసం హజ్రత్ ఆయిషా (ర) అనుమతి కోరారు. ఆమె సంతోషంగా అనుమతించారు. మర్వాన్ అనే అతనికి ఈ విషయం తెలిసి అతడు, "హుసైన్ (ర), ఆయిషా (ర) అబద్ధమాడుతున్నారు. హసన్ (ర) అక్కడ ఖననం కావడానికి వీలులేదు. హజ్రత్ ఉస్మాన్‌ని ఆ ఖననవాటికలో ఖననం చేయనీయలేదు. ఇప్పుడు హసన్ (ర) ఆయిషా (ర) ఇంట్లో ఎలా ఖననం చేయబడతాడు?" అని అన్నాడు. (ఇస్తియాబ్)

ఇటు హజ్రత్ హుసైన్ (ర) వెంట మొత్తం బనూహాషిమ్ తెగవారు, అటు మర్వాన్ వెంట బనూఉమయ్యా తెగవారు ఆయుధాలు చేబూని బయటకు

వచ్చారు. రక్తపాతం జరిగిపోయేదే. అంతలో హజ్రత్ అబూహురైరా (ర) వచ్చి మధ్యలో నిలబడి ఉద్రిక్తతను చల్లార్చారు. ఆయన మర్వాన్‌ను ఉద్దేశించి, "మనవడు తాత ప్రక్కన సమాధి అవుతుంటే మధ్యన మీకెందుకు?" అని అడిగారు. ఆ తరువాత ఆయన హజ్రత్ హుసైన్ (ర)గారితో "హజ్రత్ హసన్ (ర) విల్లు ప్రకారం ఎలాంటి అడ్డంకులు వచ్చినా పోరాటానికి దిగకండి అని తేలింది. ఎందుకీ గొడవ పోనీయండి" అని అన్నారు. మొత్తానికి జనాజా జన్నతుల్‌బఖీ లోనికి తేబడింది. అక్కడే హజ్రత్ ఫాతిమా (ర) సమాధి ప్రక్కన ఖననం జరిగింది.

## హజ్ర్ బిన్ అద్దీ (ర) షహాదత్

హజ్రత్ హజ్ర్ బిన్ అద్దీ (ర) ఖిలాఫత్ పరిరక్షకుల్లోను, హజ్రత్ అలి (ర) గారి విశ్వసనీయులైనవారిలోనూ ఒకరు. ఎంతో పుణ్యాత్ముడు, దైవభీతి కలవాడు. హజ్రత్ అలి (ర) షహాదత్ తరువాత ఆయనపై కడగండ్లు విరుచుకు పడ్డాయి. కూఫా మస్జిద్‌లో ఎప్పుడైనా హజ్రత్ అలి (ర)ను ఎవరైనా తూలనాడితే ఆయన నిలబడి తూలనాడేవానికి వ్యతిరేకంగా హజ్రత్ అలి (ర)గారి గుణగణాలు ప్రస్తుతించేవారు. అమీర్ ముఆవియాకు, ఆయన పరిపాలనకు హజ్రత్ హజ్ర్(ర) గారి ఈ ధోరణి నచ్చలేదు. మొదట ఆయనపై తిరుగుబాటు నేరం మోపబడింది. ఆ తరువాత ఆయన్ను, ఆయన అనుచరులను బంధించి అమీర్ ముఆవియా (ర) దగ్గరికి పంపడం జరిగింది. ఈ వార్త హజ్రత్ ఆయిషా (ర)గారికి అందిన వెంటనే ఆమె ముఆవియా (ర)కు ఓ ఉత్తరం రాస్తూ హజ్ర్ బిన్ అద్దీని, ఆయన అనుచరుల్ని వదిలిపెట్టమని సిఫార్సు చేశారు.

హజ్రత్ ఆయిషా (ర) ఈ సిఫారసులను అబ్దుర్రహ్మాన్, హారిస్‌ల ద్వారా అమీర్ ముఆవియా దగ్గరకు పంపారు. వీరు ఆయన దగ్గరికి చేరేలోపే వారు చంపబడ్డారు. అప్పుడు అబ్దుర్రహ్మాన్, 'ముఆవియా! మీ నాన్న అబూసుఫ్యాన్‌గారి సహనాన్ని మీరు ఎప్పుడు వదిలేశారు?" అని అడిగారు. జవాబుగా "ఎప్పుడు నుండేమిటి? మీలాంటి సహనశీలురు నన్ను వదిలివేసినప్పటి నుండి, సుమయ్య కుమారుడు చెప్పింది నేను చేశాను" అన్నాడు ముఆవియా (ర).

ముఆవియా (ర) హజ్ చేసిన తరువాత హజ్రత్ ఆయిషా (ర) గుమ్మం ముందు నిలబడి లోపలికి పోయే అనుమతి కోరారు. ఆమె అనుమతినిచ్చారు. ఆయన వచ్చి కూర్చున్న తరువాత ఆమె ఇలా అన్నారు:

"ముఆవియా! మీ హత్య కోసం నేను ఎవరినైనా ఇక్కడ దాచి ఉంచలేదని ఎలా అనుకున్నారు మీరు?"

"నేను వచ్చింది శాంతి గృహంలోనికి కదా" అన్నారు ముఆవియా.

"హజ్రిని, ఆయన సహచరుల్ని హతమార్చడంలో మీకు కాస్తయినా దైవభయం అడ్డురాలేదా?" అని అడిగారు హజ్రత్ ఆయిషా (రజి).

"నేను వారిని హత్య చేయలేదు. కూఫావాళ్ళే ఆయనకు వ్యతిరేకంగా సాక్ష్యాలిచ్చారు. వాళ్ళే ఆయన్ను, ఆయన సహచరుల్ని చంపారు" అన్నారు ముఆవియా (ర).

మరో ఉల్లేఖనంలో ఇలా ఉంది: హజ్రత్ ఆయిషా (ర), ముఆవియా (ర)ను మీ సహనం హజ్ర్ విషయంలో ఎటుపోయింది? అని అడగ్గా "ఉమ్ముల్ మోమినీన్! అప్పుడు నాకు సలహా ఇచ్చేవాడు ఎవరూ నా ప్రక్కన లేడు అందుకని" అన్నారు ముఆవియా (ర).

కూఫా నగరానికి లభించిన మొట్టమొదటి అవమానం హజ్రత్ హసన్ బిన్ అలి (ర)గారి మరణం ద్వారా అని ప్రజలు అనుకునేవారు. హజ్రత్ హసన్ (రఅన్) బిన్ అలి (ర)కి విషప్రయోగం చేయబడింది. ఆ విషప్రభావం వల్లే ఆయనకు మరణం సంభవించింది.

## కూఫా వాసులు

కూఫావాసుల గురించి హజ్రత్ ఆయిషా (ర) ఇలా అనేవారు, "దైవసాక్షి! ముఆవియా(ర)కు కూఫా వాళ్ళల్లో ఏమాత్రం అభిమానం మిగిలి ఉంది అని తెలిసి ఉంటే హజ్రిను వాళ్ళముందే పట్టించి సిరియాలో హతమార్చేవారుకారు. కాని గుండెలు నమిలిన హిందా కుమారుడు ఇక ప్రజలు లేరనుకొని ఆలా

చేశాడు. దైవసాక్షి! ధైర్యం, పౌరుషంగల అరబ్బు ధనవంతులకు కూఫా నిలయంగా ఉండేది ఒకప్పుడు."

## యువరాజు నియామకంపై నిరసన

ముఆవియా (ర) తన కుమారుడు యజీద్‌ను తన వారుసుడిగా నియమించదలిచారు. 'మర్వాన్' ఆయన తరఫున మదీనాకు గవర్నరు కాబట్టి అతడు బహిరంగంగా యజీద్ పేరును ప్రకటించారు. హ(జత్ ఆయిషా (ర) సోదరుడు నిలబడి దాన్ని వ్యతిరేకించారు. మర్వాన్ ఆయన్ను బంధించడానికి ప్రయత్నించగా ఆయన పరుగెత్తి హ(జత్ ఆయిషా (ర) ఇంట్లో చొరబడ్డారు. మర్వాన్ లోనికి ప్రవేశించే ధైర్యం చెయ్యలేదు. ఎటూ పాలుపోక, ఎవరి గురించైతే "వల్లజీ ఖాల లివాలిదైహి ఉస్సిలకుమా" అనే ఆయత్ అవతరించిందో ఆ వ్యక్తి ఇతనేకదా' అని పెద్దగా అరిచాడు. హ(జత్ ఆయిషా (ర) చాటు నుండి జవాబిస్తూ "మా కోసం అల్లాహ్ ఎలాంటి ఆయత్‌ను అవతరింపచేయలేదు. కేవలం నా నిర్దోషిత్వాన్ని నిరూపించే ఆయత్ తప్ప" అన్నారు. (బుఖారి)

## హ(జత్ ఆయిషా (ర) పరలోక పయనం

ఉమ్ముల్ మోమినీన్ హ(జత్ ఆయిషా సిద్దీఖా (ర) హి(జీ శకం 58 రమజాన్ మాసంలో వ్యాధి(గస్తులైనారు. కొన్ని రోజుల వరకు అలాగే మంచంపై పడి ఉండగా ప్రజలు ఆమె క్షేమసమాచారాలను అడిగిపోయేవారు. అందరికీ తను క్షేమంగానే ఉన్నానని బదులిచ్చేవారు.

ప్రజలు అలా ఆమె దగ్గరకు వచ్చి ఆమెను మెచ్చుకుంటూ ఉంటే ఆమె, అయ్యో! నేను రాయినయిపోతే ఎంత బావుణ్ణు లేక అడవిలోని ఓ మూలిక అయిపోతే ఎంత బాగుండును అని అనేవారు.

హ(జత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (ర) ఉమ్ముల్ మోమినీన్ హ(జత్ ఆయిషా(ర) సన్నిధికి హాజరై, "ఉమ్ముల్ మోమినీన్! తమరు దైవప్రవక్త (స)కు ప్రియసతీమణి.

అల్లాహ్ మీ ద్వారానే ఖుర్ఆన్‌లో తయమ్ముమ్ అనుమతి నొసిగాడు. మీ కీర్తి ప్రతిష్టల కోసం అల్లాహ్ ఖుర్ఆన్‌లో ఆయత్‌లను అవతరింపజేశాడు. ఈ ఆయత్‌లు ప్రతిరోజు మస్జిద్‌లలో పఠించబడుతున్నాయి" అని అన్నారు.

ఈ పొగడ్తకు ఆమె(ర), "అబ్బాస్! మీ పొగడ్తలు ఆపేయండి. దీనికంటే నేను అసలు పుట్టకపోతేనే బాగుండేది" అని సెలవిచ్చారు.

(ముస్తదిరక్కల్ హాకిమ్, ముస్నదె అహ్మద్)

ఉర్వా బిన్ జుబైర్ (ర) ప్రకారం, హజ్రత్ ఆయిషా (ర) ఆయనతో ఇలా అన్నారు: "నన్ను నా సవతుల దగ్గర్నే ఖననం చేయండి. దైవప్రవక్త(స) సమాధి దగ్గర ఖననం చెయ్యొద్దు. నేను నా పొగడ్త గురించి మెచ్చను." (బుఖారి)

హిజ్రీ 58, రమజానుల్ ముబారక్ 17వ తారీఖు రాత్రి విత్ర్ నమాజు తరువాత ఆమె పరమపదించారు.

ఆమె మరణవార్త వినగానే ముస్లింలు తమ తమ ఇండ్ల నుండి బయటకు వచ్చేశారు. జనాజాలో పాల్గొన్న వారి గురించి, రాత్రి సమయాల్లో ఇంత పెద్ద జనసమూహం ఎక్కడ కనబడలేదని ప్రజలు చెప్పుకున్నారు. హజ్రత్ అబూహురైరా (ర) ఆమె జనాజా నమాజు చేయించారు. ఆమె చేసిన వసీయత్ ప్రకారం ఆమెను జన్నతుల్ బఖీలోనే ఖననం చేశారు.

## హజ్రత్ ఆయిషా (ర) గారి సచ్చరితం

హజ్రత్ ఉమ్మెదర్ర (ర) ప్రకారం హజ్రత్ ఆయిషా (ర) దగ్గరికి ఓసారి లక్ష దిర్హంలు కానుకగా వచ్చాయి. ఆమె వాటన్నిటిని దానం చేశారు. ఆరోజు ఆమె ఉపవాసం ఉన్నారు. ఉమ్మెదర్ర (ర), హజ్రత్ ఆయిషా (ర)ను, "ఈ ధనంలో మీ ఖర్చు కోసం ఏ భాగం లేదా? కనీసం ఓ దిర్హం మాంసమయినా కొని ఉపవాసం విరమించకపోయారా?" అని అడిగారు. ఆ మాటకు జవాబుగా హజ్రత్ ఆయిషా (ర), "మరి ఆ విషయం అప్పుడు గుర్తు చెయ్యకపొయ్యావా? నేను అలా చేసి ఉండేదాన్ని కదా" అని అన్నారు. (ఇబ్నె సఅద్, అసాబా)

హ(జత్ ఆయిషా (ర) ఇలా ప్రవచిస్తున్నారు:

"ఓసారి నేను కొత్త చొక్కా తొడిగాను, దాన్ని చూసుకొని నేను మురిసి పోతుంటే మా నాన్నగారు అబూబక్ర్ (ర.జి), 'ఏమిటీ చూసుకుంటున్నావు? అల్లాహ్ నీ వైపు చూడ్డం లేదు' అన్నారు. 'ఎందుకు?' అని నేనడిగాను."

"దైవదాసునికి ప్రాపంచిక భోగభాగ్యాల వల్ల గర్వం ఏర్పడితే అల్లాహ్‌కు ఆ దాసుని ఎడల విముఖత కలిగి ఆ భాగ్యాన్ని వదిలేసేదాక అతని వైపు చూడడు. ఈ విషయం నీకు తెలియదా?" అన్నారు మా నాన్నగారు.

నేను వెంటనే ఆ చొక్కాను తీసేసి దానం చేసేశాను. అప్పుడు నాన్నగారు ఈ దానం ఆ పాపానికి పరిహారం కావచ్చు" అని అన్నారు.

## దాతృత్వం

ఇమామ్ మాలిక్ (రహ్మాలై) ఉల్లేఖనం ప్రకారం, ఓ పేదవాడు హ(జత్ ఆయిషా (ర)ను చేయిజాపి దానం అడిగాడు. అప్పుడామె ఉపవాసం ఉన్నారు. వారి ఇంట్లో ఒక్క రొట్టె తప్ప మరేమీ లేదు. ఆ రొట్టెనే అతనికి ఇచ్చెయ్యమని ఆమె తన సేవకురాలిని పురమాయించారు. దానికి ఆ సేవకురాలు, దాన్ని ఇచ్చేస్తే ఇక మన దగ్గర ఉపవాసం విరమించడానికి ఏమీ మిగలదు? అన్నది. ఆ రొట్టెను ఇచ్చెయ్యమని మళ్ళీ చెప్పారు ఆమె. సేవకురాలు ఆ రొట్టెను బిచ్చగానికి ఇచ్చేసింది. సాయంత్రం అయిన తరువాత ఎప్పుడూ ఎలాంటి కానుక పంపని ఒకాయన జిబహ్ చేసి ఓ మేకను దాని తొడలతో సహా పంపించాడు. అప్పుడు హ(జత్ ఆయిషా (ర.జి) ఆ దాసీని పిలిచి, "ఇదిగో ఈ మాంసం తిను. ఇది ఆ చిన్న రొట్టె కంటే ఎంతో శ్రేష్ఠమైనది" అని చెప్పారు.

ఇమామ్ మాలిక్ (రహ్మాలై) ఉల్లేఖనం ప్రకారం, ఓ పేదవాడు హ(జత్ ఆయిషా (రజి) గారిని భోజనం అడిగాడు. ఆమె దగ్గర ఓ ద్రాక్షపండు మాత్రమే ఉంది. సమీపంలో ఉన్న ఒకతడ్ని పిలిచి, ఇదిగో ఈ ద్రాక్షపండు తీసికెళ్ళి ఆ పేదవాడికి ఇచ్చెయ్యి అని చెప్పారు. ఆ వ్యక్తి ద్రాక్షపండును చూసి ఆశ్చర్యం ప్రకటించగా "ఏమిటీ అలా చూస్తున్నావు. ఈ ద్రాక్షలో ఎన్ని అణువులున్నాయి.

అంటూ జిల్‌జాల్ సూరాలోని ఈ ఆయత్ పఠించారు - "ఫమంయ్‌యామల్ మిస్ఖాల జర్రతిన్ ఖైరంయరహ్" (ఎవరైతే అణుమాత్రం పుణ్యం చేసుకుంటాడో దాన్ని అక్కడ (పరలోకంలో) చూస్తాడు."

కసీర్ బిన్ ఉబైద్(ర) ఇలా అంటారు: నేను ఉమ్ముల్ మోమినీన్ హ(జత్ ఆయిషా (ర) సన్నిధిలో హాజరవగా ఆమె నాతో "నేను ఈ అతుకు వేసుకున్న దాకా కొంచెం ఆగు" అన్నారు. నేను ఆమె ఆదేశం మేరకు కొంచెం సేపు ఆగాను. ఆ తరువాత నేను ఆమెను అడిగాను, "ఉమ్ముల్ మోమినీన్! ఒకవేళ నేను బయటకు వెళ్ళి మీరు చేస్తున్నది వారందరికి చెబితే మిమ్మల్ని పిసినారి క్రింద లెక్కకట్టరా?" అని. నా మాటకు బదులుగా ఆమె "నీ యిష్టం వచ్చినట్లు చెయ్యి. ఎవరయితే పాత వస్త్రాన్ని ధరించరో వారికి క్రొత్త వస్త్రం విలువే తెలియదు" అన్నారు. (బుకారి ఫిల్ అదబ్)

ఓసారి ఓ బాలిక కాళ్ళకు గజ్జెలు కట్టుకొని హ(జత్ ఆయిషా (ర) గారి దగ్గరకు రాగా గజ్జెలతో నా దగ్గరకు రాకు. ఈ గజ్జెల్ని తెంపెయ్యి అన్నారామె. ఒకామె దానికి కారణం అడగ్గా, "ఏ ఇంట లేక ఏ బిడారంలో గంట మ్రోగుతుందో అక్కడికి దైవదూతలు రారని దైవప్రవక్త (స) ప్రవచించారని" ఆమె బదులిచ్చారు. (ముఅత్తా)

హఫ్సా బిన్తె అబ్దుర్రహ్మాన్ బిన్ అబూబక్ర్ (హ(జత్ ఆయిషా (ర) గారి సోదరుని కుమార్తె) ఓ రోజు పలుచని ఓణి వేసుకొని అత్తగారి దగ్గరికి వచ్చారు. హ(జత్ ఆయిషా (ర) ఆ ఓణిని చూడగానే లాగి దాన్ని చించివేశారు. ఆ తరువాత, "నీకు తెలియదు అల్లాహ్ నూర్ సూరాలో ఏ ఆదేశాల్ని జారీ చేశాడో" అని ఓ ముతక వస్త్రపు ఓణీ తెప్పించి ఆమెకిచ్చారు.

## యతిప్రాసలతో కూడిన దుఆలు

ఇబ్నె అబీ సాయిబ్ (తాబయీ) మదీనా నగరానికి చెందిన హితబోధకుడు. ఆయన దుఆ చేసేటప్పుడు ఆ దుఆ యతిప్రాసలతో శబ్దాలంకారాలు కలిగి ఉండేది. సమయం సందర్భం లేకుండా ఎల్లప్పుడు హితబోధ చేయడానికి సిద్ధంగా

ఉండేవారు. హ(జత్ ఆయిషా (ర) ఆయనతో, "నీవు నాకు మూడు విషయాల గురించి వాగ్దానం చెయ్యాలి. లేకుంటే శక్తి నుపయోగించి నిన్ను అలా చేసేటట్లు చేస్తాను" అన్నారు. అది విన్న ఆయన, "అవేమిటో సెలవీయండి అన్నారు. అప్పుడు హ(జత్ ఆయిషా (ర) ఇలా అన్నారు:

"దుఆలో పలికే మాటల్లో యతి(ప్రాసలు, శబ్దాలంకారాలు లేకుండా ఉండాలి, దైవ(ప్రవక్త (స) గాని, ఆయన అనుచరులుగాని అలా ఎప్పుడూ చేయలేదు. వారానికి ఒకసారి మాత్రమే బోధ చేయాలి. అలా వీలుపడని పక్షంలో వారానికి రెండుసార్లు, లేదా మూడు సార్లు హితబోధ చేయండి. (ప్రజల్ని దైవ (గంథం ఎడల వెగటు కలిగేటట్టు చెయ్యొద్దు. (మూడో విషయం ఏమంటే) (ప్రజలు కూర్చున్న చోటికివచ్చి వారి మధ్యలో కూర్చోవడంగాని, వారు మాట్లాడే విషయానికి బదులు మీ హితబోధ (ప్రారంభించడంగాని చెయ్యొద్దు. వాళ్ళు హితబోధను కోరినప్పుడే హితబోధ చెయ్యాలి. (ముస్నదె అహ్మద్)

## అప్పు తీర్చే సంకల్పం

ఉమ్ముల్ మోమినీన్ హ(జత్ ఆయిషా (ర.జి) దైవమార్గంలో ఖర్చు పెట్టడానికి అధికంగా అప్పు తీసుకునేవారు. నీకు అప్పు తీసుకునేటంత అవసరమొచ్చిందా అని (ప్రజలు అడగ్గా, ఎవరికైతే అప్పు తీర్చే తలంపు ఉంటుందో అల్లాహ్ అతనికి సహాయపడతాడు. నేను అల్లాహ్ సహాయాన్నే వెదుకుతున్నాను అని అన్నారు ఆమె. (ముస్నదె అహ్మద్)

## నిరాడంబరం

దైవ(ప్రవక్త (స) మరణానంతరం హ(జత్ ఆయిషా (ర) భోజనం తెప్పించుకుని 'నేను ఎప్పుడూ కడుపునిండా భుజించను' అని అనగా ఓ శిష్యుడు ఎందుకు అని అడిగాడు. దానికామె, నాకు దైవ(ప్రవక్త (స) పరమపదించినప్పటి కాలం జ్ఞాపకం వస్తోంది. దైవసాక్షి! ఆయన రోజుకు రెండు పూటలా ఎప్పుడూ కడుపునిండా రొట్టెగాని, మాంసంగాని భుజించలేదు" అన్నారు. (తిర్మిజి)

ఆమె దగ్గర ఒకే ఒక జత బట్టలు ఉండేవి. దాన్నే ఆమె మాటిమాటికి ఉతికి తొడిగేవారు. (బుఖారి)

## బంగారపు ఉంగరం

ఒక్కొక్కప్పుడు రంగువేసిన బట్టలు తొడిగేవారు. అప్పుడప్పుడు నగలు కూడా ధరించేవారు. మెడలో యమన్ దేశంలో ప్రత్యేకంగా తయారైన తెలుపు నలుపు కలిగిన బిళ్ళల హారం ఉండేది. వ్రేళ్ళకు బంగారపు ఉంగరాలు తొడిగేవారు. (బుఖారి)

## శిలువ శిల్పాలున్న దుప్పటి

ఓసారి ఓ మహిళను, శిలువ బొమ్మలు చిత్రించబడివున్న దుప్పటి కప్పుకొని రాగా చూశారు. చూడగానే 'ఈ దుప్పటి తీసెయ్యి. దైవప్రవక్త (స) ఇలాంటి బట్టల్ని చూడగానే చించిపారేసేవారు' అని గద్దించారు. (ముఅత్తా)

మదీనాలో బరీరా పేరుగల ఓ బానిస స్త్రీ ఉండేది. ఆమె యజమానులు ఆమెను 'ముకాతిబ్' చేశారు (అంటే నీవు ఇంత డబ్బును కూడగడితే నిన్ను స్వతంత్రురాలిగా చేస్తాం అనడం) ఆ డబ్బు కోసం ఆమె ప్రజల సహాయం కోరింది. హజ్రత్ ఆయిషా (ర)కు ఈ విషయం తెలిసి మొత్తం ధనాన్నిచ్చి ఆ బానిసను స్వతంత్రురాలిగా చేశారు. (బుఖారి ముస్లిమ్, ముస్నదె అహ్మద్)

తమీమ్ తెగకు చెందిన ఓ బానిసమహిళ ఆమె దగ్గర ఉంటూ ఉండేది. దైవప్రవక్త (స) నోట, ఈమె హజ్రత్ ఇస్మాయీల్ (అ) సంతతిలోని స్త్రీ అని తెలిసి ఆయన చెప్పినట్లు ఆమెను స్వతంత్రురాలిగా చేశారు.

## తరావీహ్ నమాజ్

హజ్రత్ ఆయిషా (ర) రమజాన్ నెలలో తరావీహ్ నమాజ్ ఎంతో శ్రద్ధతో చదివేవారు. ఆమె దగ్గర జమా అనే ఓ బానిస ఉండేవాడు. అతడు ఇమామ్‌గా నిలబడి ముందు ఖుర్ఆన్‌ను ఉంచి చదివేవాడు. ఈమె అతని ముక్తదీ (అనుకరించేవారు)గా ఉండేవారు. (బుఖారి, ముఅత్తా)

## పరదా

ఇస్హాక్ (తాబయీ) అంధులు. ఆయన ఉమ్ముల్ మోమినీన్ హజ్రత్ ఆయిషా(ర) గారి సన్నిధికి హాజరైనప్పుడు ఆమె పరదా పాటించారు. ఆయన ఉమ్ముల్ మోమినీన్ (ర)తో, నేను గ్రుడ్డివాణ్ణే కదా. నేను మిమ్మల్ని చూడలేను కదా? నా దగ్గర మీరు పరదా పాటించడం ఏమిటి? అని అడిగారు. అప్పుడు హజ్రత్ ఆయిషా (ర) మీరు నన్ను చూడకపోయినా నేను మిమ్మల్ని చూడగలను కదా అని జవాబిచ్చారు. (ఇబ్నె సఅద్)

## చాష్త నమాజు

ఉమ్ముల్ మోమినీన్(ర) చాష్త నమాజును క్రమం తప్పకుండా చేసేవారు. ఆమె (దాన్ని గురించి), 'మా తండ్రిగారు సమాధి నుండి లేచి వచ్చి నన్ను ఈ నమాజు చేయవద్దని వారించినా నేను ఆగను' అన్నారు. (ముస్నదె అహ్మద్)

## అర్ఫానాటి రోజా

హజ్రత్ ఆయిషా (ర) వేసవి రోజుల్లో అర్ఫానాడు రోజా పాటించారు. వేసవితాపం వల్ల ఆమె తలపై చన్నీళ్ళు చిలకరించబడుతున్నాయి. (ఆమె సోదరుడు) అబ్దుర్రహ్మాన్ బిన్ అబూబక్ర్ (ర) ఆమెతో, ఈ వేసవిలో రోజా అంత అవసరం లేదు, ఇఫ్తార్ చేయండి (రోజాను భంగపర్చండి) అని అనగా, నేను దైవప్రవక్త (స) నోట 'అర్ఫా నాటి రోజా ఆ సంవత్సరంలో జరిగిన పాపాల లన్నిటిని మన్నింపజేస్తుంద'ని విన్నాను. అలాంటప్పుడు నేను ఎలా ఈ రోజాను భంగపర్చగలను? అని అన్నారు. (ముస్నదె అహ్మద్)

## నమాజు చేసే తీరు

ఖాసిం బిన్ ముహమ్మద్ బిన్ అబూబక్ర్ ఇలా అంటారు: ఉదయం ఇంటి నుండి బయలుదేరగానే నేను హజ్రత్ ఆయిషా (ర) గారి ఇంటికి వెళ్ళి ఆమెకు సలామ్ చేయడం నా అలవాటు. ఆ అలవాటు ప్రకారం నేను ఓ రోజు ఆమె ఇంటికి వెళ్ళాను. అప్పుడామె నిలబడి నఫిల్ నమాజు చేస్తున్నారు. ఆ

నమాజులో మాటిమాటికి "ఫమన్నల్లాహు అలైనా వవఖానా అజాబస్సమూమ్" అనే ఖుర్ఆన్ ఆయత్ చదివి రోదిస్తున్నారు. ఆమె సలాము చెప్పి నమాజు పూర్తి చేస్తారేమో అని నేను నిలబడి నిరీక్షించాను. అలా ఎంతోసేపు నిరీక్షించి విసిగిపోయి అలానే వదిలేసి నా పనిమీద బజారుకు వెళ్ళిపోయాను. తిరిగి వచ్చి చూసినా, ఆమె అదే విధంగా రోదిస్తున్నారు. (సిఫతుస్సప్వాహ్)

## జిహాద్ మైదానంలో

హజ్రత్ అనస్ (ర.జి) ఉవాచ: నేను జిహద్యుద్ధంలో హజ్రత్ ఆయిషా (రజి), ఉమ్మెసలీమ్ (ర)లు తమ కాళ్ళ ఆభరణాలు కనపడేటట్లు కుచ్చిళ్ళు పైకి దోపి తమ తమ నీటి సంచుల్ని వీపులపై మోస్తూ దాహోర్తులైన యోధులకు నీరు త్రాగిస్తూ ఉండగా చూశాను. అలా వారు తమ నీటితిత్తులను మాటిమాటికి నింపి తీసుకొని రావడం తిరిగి వెళ్ళడం మామూలైపోయింది. (బుఖారి)

## స్వర్గవాసులు

హజ్రత్ ఆయిషా (ర) గారితో ఒకతను దివ్యఖుర్ఆన్లోని ఈ ఆయత్ భావాన్ని అడిగాడు. "సుమ్మ అవురస్ నల్ కితాబ్.... జాలిక హువల్ ఫౌజుల్ కబీర్" (ఫాతిర్-32)

**అనువాదం:** తిరిగి మేము వారసులుగా చేశాము ఎవరినైతే మేము (ఈ వారసత్వం కోసం) మా దాసుల నుండి ఎన్నుకున్నామో, ఇప్పుడు వారిలో ఒకడు తనపై జులుం చేసుకుంటున్నాడు. మరొకడు మధ్యరకం వాడు. ఇంకొకడు అల్లాహ్ అనుమతితో సత్కార్యాల వైపునకు పురోగమిస్తున్నాడు. ఇదే అన్నిటికంటే మిన్న అయిన శుభం. (ఫాతిర్ - 32)

జవాబుగా హజ్రత్ ఆయిషా (ర.జి) ఇలా అన్నారు: కుమారా! ఈ మూడు రకాల మనుషులు స్వర్గంలో ప్రవేశించేవారే. ఇందులో సత్కార్యాల వైపునకు పురోగమించినవారు దైవప్రవక్త (స) గారి కాలంలోనేమరణించిన సహాబీలు. ఆయన వారికి స్వర్గప్రవేశ శుభవార్తనందించారు. ఇక మధ్యరకంవారు,

దైవప్రవక్త(స) గారిని పూర్తిగా అనుకరిస్తూ మరణించినవారు. మూడో తరగతివారు జాలిమ్‌లు (తమపై అన్యాయం చేసుకున్నవారు) అంటే మీలాంటివారు మాలాంటివారు అని అర్థం.

(తియాసి-మస్నదె ఆయిషా (ర) - సీరతె ఆయిషా (ర) సులైమాన్ నద్వి)

## భూమి తగాదా

అబూసల్మా బిన్ అబ్దుర్రహ్మాన్ (ర) బిన్ ఔఫ్ గారికి కొందరితో ఓ భూమి తగాదా ఉండేది. హజ్రత్ ఆయిషా (ర) గారికి ఈ విషయం తెలిసి ఆయన్ను పిలువనంపి నచ్చజెపుతూ, "అబూసల్మా! ఆ భూమిని వదిలేసెయ్యి, ఓ జానెడు భూమి కోసం ఎవరైనా దౌర్జన్యం చేస్తే దాని పర్యవసానంగా (పరలోకంలో) ఏడు భూగోళాల బరువు అతని మెళ్ళో వేయబడుతుంది అని దైవప్రవక్త (స) ప్రవచించారు" అని అన్నారు.

## ముఆవియా పేర లేఖ

ఓ మదీనా వాసి కథనం ప్రకారం, ముఆవియా బిన్ అబూసుఫ్యాన్ (ర) ఉమ్ముల్ మోమినీన్ హజ్రత్ ఆయిషా (ర) గారికి, నాకు ఏదైనా క్లుప్తమైన బోధ చెయ్యండి అని లేఖ రాశాడు. హజ్రత్ ఆయిషా (ర) ముఆవియాకు తిరుగు లేఖ ఇలా రాశారు.

అస్సలాము అలైకుమ్ - అమ్మాబాద్!

నేను దైవ ప్రవక్త(స) ఇలా ప్రవచిస్తూ ఉండగా విన్నాను- "ఎవరైతే ప్రజలను బాధించి కోప్పడి (అంటే అప్రసన్నులుగా చేసి) కేవలం అల్లాహ్ ప్రసన్నత కోరుకుంటాడో అలాంటి వాడికి ప్రజల యాతనల నుండి వారి క్రోధం నుండి రక్షించడానికి అల్లాహ్ చాలు. మరెవరైతే అల్లాహ్‌ను అప్రసన్నుడిగా చేసి ప్రజలను ప్రసన్నులుగా చేయ ప్రయత్నిస్తాడో అల్లాహ్ ఆ వ్యక్తిని ప్రజలకే అప్పజెప్పేస్తాడు" (తిర్మిజి)

అస్సలాము అలైకుమ్.

# ఖుర్ఆన్ దర్పణంలో

హజ్రత్ ఆయిషా (ర) గురించి దైవ దివ్యఖుర్ఆన్‌లో అనేక ఆయత్‌లు అవతరించాయి. ఇది ఈమె దైవభక్తిని, ప్రవక్త (స) ఎడల ఆమె అణుకువను తెలియజేస్తున్నాయి. అహ్జాబ్ సూరాలో ఆమె ఉన్నతమైన స్థాయిని సూచిస్తూ ఈ ఆయత్‌లు అవతరించాయి.

"ప్రవక్త భార్యలారా! మీరు సామాన్య స్త్రీల్లాంటి వారు కారు".

"మీలో ఎవరైతే అల్లాహ్, ఆయన ప్రవక్త ఆజ్ఞలను శిరసావహించి సత్కార్యాలు చేస్తారో వారికి మేము ఇతోధిక ఫలితాన్నిస్తాము. పైగా వారికోసం మేము మంచి ఉపాధిని సిద్ధంచేసి ఉంచాము."

"మీరు ఇండ్లలోనే ఉండిపొండి. అజ్ఞానపు కాలంనాటి అలంకరణలను ప్రదర్శిస్తూ బయట తిరగకండి. నమాజు స్థాపించండి. జకాత్ చెల్లించండి. అల్లాహ్, ఆయన ప్రవక్త (స) ఆజ్ఞల్ని పాటించండి".

"మీరు మీ గృహాల్లో వినిపించబడుతున్న (ఖుర్ఆన్) ఆయత్‌లను, తత్వజ్ఞానాన్ని జ్ఞప్తియందుంచుకోండి. నిశ్చయంగా అల్లాహ్ అత్యంత సున్నితమైన విషయాలను సయితం గ్రహించేవాడు, సర్వం తెలిసినవాడూను."

"ప్రవక్త (స) ఇంటి వారైన మీ నుండి సకల అశుద్ధతలను దూరం చేసి మిమ్మల్ని పరిపూర్ణంగా పరిశుద్ధులుగా చేయడమే అల్లాహ్ సంకల్పం."

"నిశ్చయంగా ఏ స్త్రీలు, ఏ పురుషులైతే ముస్లిములో, మోమిన్‌లో, ఆజ్ఞాపాలకులో, సత్యసంధులో, సహనంగలవారో, అల్లాహ్ ఎదుట మోకరిల్లే వారో, దానం చేసేవారో, ఉపవాసాలు పాటించేవారో, తమ మర్మాంగాలను రక్షించుకునేవారో, అల్లాహ్‌ను అధికంగా స్మరించేవారో, వారి కోసం అల్లాహ్ మన్నింపు, గొప్ప ప్రతిఫలం సిద్ధపరచి ఉంచాడు."

"ప్రవక్తా! నీ భార్యలతో, కుమార్తెలతో, విశ్వసించిన ఇతర స్త్రీలతో వారు తమ తలలపై దుప్పటి కొంగు కప్పుకోవాలని చెప్పు."

# హజ్రత్ ఆయిషా (ర) ప్రస్తావన - హదీసుల్లో

హజ్రత్ ఆయిషా (ర) ఉల్లేఖనం : దైవప్రవక్త (సఅసం) నన్ను పిలిచి "ఆయిషా! జిబ్రీల్ (అ) నీకు సలాం చెబుతున్నార"ని అన్నారు. నేనందుకు "వఅలైకుముస్సలాము వరహ్మాతుల్లాహి వబరకాతుహు" అంటూ ఆ సలామును ఇంకా పొడిగించే ప్రయత్నం చేశాను. దానికి దైవప్రవక్త (స) "చాలు సలాం ఇక్కడికే సరిపోయింది" అన్నారు. అప్పుడు హజ్రత్ జిబ్రీల్ (అ) "రహ్మాతుల్లాహి వ బరకాతుహు అలైకుం యా అహ్లిల్‌బైత్!" అని సమాధానమిచ్చారు.

(తిబ్రాని ఫిల్ అవ్‌సత్)

దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారని హజ్రత్ అబూ మూసా అష్అరి ఉల్లేఖిస్తున్నారు: పురుషుల్లో అనేక మంది శ్రేష్ఠులైనవారు ఉన్నారు. కాని స్త్రీలలో, మరియమ్ బిన్తె ఇమ్రాన్, ఫిర్‌ఔన్ భార్య ఆసియా తప్ప ఎవరూ లేరు. ఇక ఆయిషా(ర) గారి శ్రేష్ఠత స్త్రీలందరిలో ఎలాంటిదంటే భోజనపదార్థాలన్నిటిలో సరీద్ అనే పదార్థం ఎలాంటిదో అలాంటిది. (ముస్లిమ్, బుఖారి)

హజ్రత్ ఆయిషా (ర) వ్యాధిగ్రస్తురాలైనప్పుడు హజ్రత్ ఇబ్నెఅబ్బాస్ (ర) ఆమెను చూడ్డానికి వచ్చి, ఉమ్ముల్ మోమినీన్! మీరు దైవప్రవక్త (స), హజ్రత్ అబూబక్ర్ (ర)లు ఉన్న చోటికి పయనం అవుతున్నారు" అని అన్నారు. (బుఖారి)

(జమల్ యుద్ధానికి ముందు) హజ్రత్ అమ్మార్(ర) తనకు ప్రజలు మద్దతు ప్రకటించేందుకు హజ్రత్ హసన్ (రజి)ని కూఫా పంపారు. అప్పుడు హజ్రత్ అమ్మార్(ర) ప్రసంగిస్తూ ఇలా అన్నారు:

"నాకు బాగా తెలుసు, ఆమె (హజ్రత్ ఆయిషా (రజి) ఇహలోకంలోను, పరలోకంలోను దైవప్రవక్త (సఅసం) సతీమణే. అయితే అల్లాహ్ మిమ్మల్ని హజ్రత్ అలి (రజి), హజ్రత్ ఆయిషా (రజి)లలో ఎవరిని అనుసరిస్తారు అన్నదాన్ని పరీక్షిస్తున్నాడు. (బుఖారి)

హజ్రత్ ఆయిషా(ర) ప్రవచనం ప్రకారం, ఆమె తన సోదరి హజ్రత్ ఆస్మా (ర) దగ్గర ఓ కంఠహారం బదులు తీసుకున్నారు. కాని అది కనబడకుండా

ఎక్కడో పోయింది. కాబట్టి దైవప్రవక్త (స) తన అనుచరుల్లో చాలామందిని దాన్ని వెదకమని పంపించారు. (అలా వెదకడంలో) నమాజు వేళయింది. కొందరు వుజూ చేయకుండానే నమాజు చేశారు. ఆ తరువాత నీరు లభించనందుకు అలా చేశామని దైవప్రవక్త (సఅసం)తో విన్నవించుకున్నారు. ఆ సందర్భంలోనే తయమ్మమ్ ఆయత్ అవతరించింది. (బుఖారి)

## ప్రియ సతి

హజ్రత్ అమ్ర్ బిన్ ఆస్ ఇలా అంటున్నాను: "నేను దైవప్రవక్త (స) సన్నిధికి వెళ్ళి "దైవప్రవక్తా! ప్రజలలో అందరికంటే మీకు ఎక్కువ ప్రియమైన వారెవరూ? అని అడిగాను. దానికి దైవప్రవక్త (సఅసం) హజ్రత్ ఆయిషా(ర) అని సమాధానమిచ్చారు. ఆ తరువాత నేను, పురుషుల్లో అందరికంటే మీకు ఎక్కువ ప్రియమైన వారెవరూ అని అడగ్గా, ఆమె తండ్రి (అంటే హజ్రత్ అబూబక్ర్-ర) అని సమాధానమిచ్చారు." (తిర్మిజీ)

## హజ్రత్ ఆయిషా (ర) గారి పొగడ్త-సహాబా (ర)నోట

హజ్రత్ అబ్దుల్లా బిన్ జుబైర్ (ర) ఉల్లేఖనం: నేను (నా పిన్నమ్మ) హజ్రత్ ఆయిషా (ర), (మా అమ్మ) హజ్రత్ అస్మా (ర) కంటే దాతృత్వంలో ఎవ్వరిని మించగా చూళ్ళేదు. వీరి దాతృత్వపు తీరు పరస్పరం వ్యతిరేకం. హజ్రత్ ఆయిషా (ర) కొంచెం కొంచెం కూడబెడ్తూ మొత్తం ఒకేసారి పంచి పెట్టేవారు. కాని హజ్రత్ అస్మా (ర) చేతికి వచ్చినదాన్ని వెంటనే ఇతరులకు దానం చేసేవారు. (బుఖారి ఫిల్ అదబుల్ మఫ్రద్)

ఓ రోజు హజ్రత్ ముఆవియా(ర) ఓ సభికుణ్ణి అడిగారు, ప్రజల్లో అందరికంటే గొప్ప పండితుడెవరని. 'అమీరుల్ మోమినీన్! ఆ పండితుడు మీరే' అన్నాడా వ్యక్తి. అప్పుడాయన-

"కాదు. దైవంపై ఓట్టేసి అడుగుతున్నాను ఎవరు చెప్పు" అని నిలదీశారు. అప్పుడా వ్యక్తి "అలా అయితే (నిజానికి) ఆ వ్యక్తి ఉమ్ముల్‌మోమినీన్ హజ్రత్ ఆయిషా (ర.జి)యే" అని చెప్పాడు. (ముస్తదకుల్ హాకిమ్)

హజ్రత్ ముఆవియా ఇలా అంటారు: దైవసాక్షి! నేను హజ్రత్ ఆయిషా(ర) లాంటి పరిశుద్ధమైన, స్వచ్ఛమైన భాషా ప్రావీణ్యంగల, తెలివిగల వక్తను చూడలేదు. (తిబ్రాని)

ఖాసిం బిన్ ముహమ్మద్ బిన్ అబూబక్ర్ (ర) ఉల్లేఖనం : హజ్రత్ ఆయిషా (రఅన్) ధార్మిక తీర్పులివ్వడానికి తమ యావజ్జీవితాన్ని అంకితం చేశారు. హజ్రత్ అబూబక్ర్ (ర), హజ్రత్ ఉమర్ (ర), హజ్రత్ ఉస్మాన్ (ర) గార్ల (ఖిలాఫత్) కాలం, ఆ తరువాత తన మరణం వరకు ఆమె ధార్మిక తీర్పులు ఇచ్చేవారు. అల్లాహ్ ఆమెను కరుణించుగాక. ఎల్లప్పుడు నేను ఆమె దగ్గరే ఉంటూ వచ్చాను. నాపై ఆమె దయ ఎల్లప్పుడూ ఉండేది. (ఇబ్నెసఅద్)

ఖుబైసా బిన్ జుహైబ్ ఉల్లేఖనం : హజ్రత్ ఆయిషా (ర) అందరిలో కెల్లా గొప్ప పండితురాలు. ఆమె కంటే గొప్పవారైన సహాబీలు సయితం సమస్యల్ని గురించి అడగడానికి ఆమె దగ్గరకు వచ్చేవారు. (ఇబ్నె సఅద్)

అబూసల్మా బిన్ అబ్దుర్రహ్మాన్ బిన్ ఔఫ్ ఉల్లేఖనం : దైవప్రవక్త (స) గారి సంప్రదాయాన్ని హజ్రత్ ఆయిషా (ర) కంటే బాగా ఎరిగినవారిని నేను చూడలేదు. ఏదైన సలహా కావాలంటే ఆమె కంటే మేలైన సలహా ఇచ్చేవారు, ఆయత్ అవతరణ నేపథ్యాన్ని ఎరిగినవారు, భాధ్యతల నెరిగినవారు ఎవరూలేదు. హజ్రత్ ఆయిషా వాటన్నిటిని గురించి బాగా తెలిసినవారు. (ఇబ్నెసఅద్)

## మస్రూఖ్ తాబయీ

విధుల గురించి ఆయిషాకు బాగా తెలుసా? అని మస్రూఖ్‌ను ఒకతను అడిగాడు. దానికి ఆయన ఇలా సమాధానమిచ్చారు: "అవును, నా ప్రాణం ఎవరి గుప్పిటలో ఉందో ఆ దైవం సాక్షి! నేను స్వయంగా చూశాను. ఎందరో వృద్ధులు, గొప్ప గొప్ప సహాబీలు హజ్రత్ ఆయిషా(ర) గారిని 'ఫరాయిజ్' (విధులు) గురించి అడిగి తెలిసికొనేవారు." (ఇబ్నెసఅద్)

## మహ్మూద్ బిన్ లుబైద్

ప్రవక్త (స) శ్రీమతులు ప్రవక్త(స) హదీసుల్ని బాగా గుర్తుంచుకునేవారు. అయితే హజ్రత్ ఆయిషా, (ర) ఉమ్మెసల్మా (ర)ల లాగాకాదు. హజ్రత్ ఉమర్(ర), హజ్రత్ ఉస్మాన్(ర) గార్ల ఖిలాఫత్ కాలంలో హజ్రత్ ఆయిషా (రజి) ఫత్వాలు (ధార్మిక తీర్పులు) ఇచ్చేవారు. చివరికి ఆమె (ఫత్వాలు ఇస్తూనే) పరమపదించారు. అల్లాహ్ ఆమెను కరుణించుగాక. హజ్రత్ ఉమర్ (ర), హజ్రత్ ఉస్మాన్ (ర)లతో సహా గొప్పగొప్ప సహబీలు సైతం ఆమె దగ్గరికి మనుషుల్ని పంపి, దైవప్రవక్త సంప్రదాయాలను గురించి తెలుసుకునేవారు. (ఇబ్నెసఅద్)

## తల్హా కుమార్తె ఆయిషా

హజ్రత్ తల్హా (ర.జి) గారి కుమార్తె ఆయిషా ఇలా అంటారు: "ప్రతి పట్టణం నుండి ప్రజలు హజ్రత్ ఆయిషా (ర) దగ్గరకు వచ్చేవారు. వృద్ధులు నాకూ ఆమెకు ఉన్న పరిచయం మూలంగా నన్ను కలుసుకోవడానికి వచ్చేవారు. యువకులు నాతో సోదరసంబంధాలు నెలకొల్పుకునేవారు. ప్రజలు నాకు కానుకలు పంపేవారు. ప్రతి ఊరు నుండి లేఖలు రాసేవారు. నేను హజ్రత్ ఆయిషా (ర)తో పిన్నమ్మా! ఈ ఫలానా వ్యక్తి లేఖ రాశారు, ఫలానా కానుక వచ్చింది అని విన్నవించుకుంటే ఆమె, "దానికి జవాబు రాయి, బదులుగా నువ్వు ఏదైనా (ఓ కానుక) పంపించు అని చెప్పేవారు". (బుఖారి)

## అహ్నఫ్ బిన్ ఖైస్

నేను హజ్రత్ అబూబక్ర్ (ర), హజ్రత్ ఉమర్ (ర), హజ్రత్ ఉస్మాన్ (ర), హజ్రత్ అలి (ర), ఇంకా ఆనాటి ఖలీఫాలందరి ప్రసంగాలు విన్నాను కాని హజ్రత్ ఆయిషా (ర) నోట వెలువడే మాటల్లో ఉన్న ఔన్నత్యం, విశిష్టతలు మరెవరి మాటల్లోను కనబడలేదు. (ముస్తదరకుల్ హాకిమ్)

## ఇమామ్ జుహ్రీ

హజ్రత్ ఆయిషా (ర) అందరికంటే గొప్ప పండితురాలు, గొప్ప గొప్ప సహాబీలు సైతం ఆమెను (సమస్యల గురించి) అడిగేవారు. ఒకవేళ పురుషులందరి

జ్ఞానంతో పాటు ప్రవక్త ఇతర భార్యలందరి జ్ఞానం ఒక చోట చేరిస్తే వారందరి లోకి హ(జత్ ఆయిషా (ర) జ్ఞానమే మిన్న అవుతుంది. (ఇబ్నె సఅద్)

## ఉర్వా బిన్ జుబైర్

ఖుర్ఆన్ ఫరాయిజ్ (ధార్మిక విధులు) హలాల్-హరామ్, ఫిఖహ్, కవిత్వం, వైద్యశాస్త్రం, అరబ్బుల వంశవృక్షాల జ్ఞానాల్లో హ(జత్ ఆయిషా(ర) కంటే మిన్న అయిన వారిని నేను చూడలేదు. (ఇబ్నెసఅద్)

## ఖుర్ఆన్ ఆయత్‌ల వ్యాఖ్యానం

'బఖరా' సూరాలోని కొన్ని ఆయిత్‌ల వ్యాఖ్యానం. "వహువ అలద్దుల్ ఖిసామ్" అనే ఆయత్ గురించి:

దైవప్రవక్త(స) ఇలా ప్రవచించారని హ(జత్ ఆయిషా (రజి) ఉల్లేఖించారు- మనుషులందరిలో కెల్లా ఎక్కువగా అల్లాహ్‌కు అసహ్యం కలిగించేవాడు, ఆయనకు పరమశత్రువు ఎవరంటే ప్రజలతో పోట్లాడే స్వభావం కలవాడే. (తిర్మిజీ)

"దుష్కర్మలు చేసేవారికి దాని ఫలితం ఇవ్వబడుతుంది" అనే ఆయత్ గురించి హ(జత్ ఉమయ్యా (ర) హ(జత్ ఆయిషా(ర)ను అడిగారు. దానికి హ(జత్ ఆయిషా ఇలా జవాబు చెప్పారు:

ఈ ఆయత్ గురించి నేను దైవప్రవక్త (స)ను అడిగినప్పటినుండి ఎవరూ దీని అర్థం ఏమిటని నన్నడగలేదు. నేను దీన్ని గురించి అడిగినప్పుడు దైవప్రవక్త (సఅసం) ఇలా సెలవిచ్చారు: "ఇది దైవం, తన దాసునికి ప్రపంచ యాతనల ద్వారా శిక్షించడం, ఉదాహరణకు జ్వరం, బాధ వగైరాలు. చివరికి తన డబ్బు జేబులో పెట్టుకొని (మరిచి) కనబడక కంగారు పడడం కూడాను. (ఈ చిన్న బాధ కూడా అతని చిన్న చిన్న పాపాలను పోగొట్టడానికి కారణభూతమవుతుంది.) ఇలా కష్టాల ద్వారా దేవుడు తన దాసుని పాపాలకు అతడ్ని శిక్షిస్తాడు. చివరికి ఆ దాసుడు తన చిన్న చిన్న పాపాల నుండి ప్రక్షాళింపబడి కొలిమి నుండి బయలుపడిన శుద్ధమైన బంగారంలా బయటకు వస్తాడు." (తిర్మిజీ)

హజ్రత్ ఆయిషా (ర) ఉల్లేఖనం ప్రకారం, ఎప్పుడైతే దైవప్రవక్త (స) గారిని, ఫఅమ్మల్లజీన ఫీఖులూబిహిమ్ బైగ్..... ఎవరి మనస్సుల్లో అనుమానం, లోపం ఉందో వాళ్ళు 'ముతషాబిహాత్' (అనుమానాన్ని పుట్టించే ఆయత్‌లు) కలహాన్ని కుట్రల్ని పన్నే ఉద్దేశ్యంతో వెంటబడతారో) గురించి అడిగితే ఆయన (ఆయిషా! నీవు వాళ్ళను చూడగానే గుర్తించు లేక వారి గురించి ప్రజలకు తెలియజెయ్యి) అని చెప్పారు. ఇలా ఆయన మూడు సార్లు పలికారు. (తిర్మిజీ)

"లాతుద్రికుహుల్ అబ్సార్...." (అన్‌ఆమ్ సూరా)

హజ్రత్ మస్రూఖ్ ఇలా అంటున్నారు. "నేను హజ్రత్ ఆయిషా(ర) గారి ముందు దిండుకు ఆనుకొని (కూర్చుని) ఉండగా ఆమె నన్ను ఉద్దేశించి "అబూ ఆయిషా! (మస్రూఖ్‌గారి మరో పేరు) మూడు మాటల్లో ఏ ఒక్క మాట గురించి చెప్పినా అది అల్లాహ్‌పై గొప్ప అపవాదు వేయడంలాంటిదే. (మొదటిది) ముహమ్మద్ (సఅసం) తన ప్రభువు అయిన అల్లాహ్‌ను చూశారు అని ఎవరైనా అంటే అతడు అల్లాహ్‌పై పెద్ద అపవాదు మోపినట్లే. (ఎందుకంటే అల్లాహ్‌ను, ఏ కళ్ళూ గాంచలేవు కాని ఆయన తన కళ్ళతో చూడగలడు. ఆయన అతి సూక్ష్మమైన వాడు, సర్వం తెలిసిన వాడూను) ఇంకా అల్లాహ్ ఇలా అంటున్నాడు. "ఏ మానవ మాత్రుడూ అల్లాహ్‌తో సంభాషించడం సాధ్యం కాదు. వహీ ద్వారా లేక పరదా చాటు నుండి తప్ప. "నేను (మస్రూఖ్) దిండుకానుకొని ఉన్నవాడల్లా ఆమె మాటలు విని లేచి నిటారుగా కూర్చుని, ఉమ్ముల్ మోమీనీన్! ఆగండి నన్ను చెప్పనియ్యండి. త్వరపడకండి (వినండి) 'వలఖద్‌ఆహునజ్లతన్ ఉఖ్రా' (నిశ్చయంగా ఆయన్ను మరోసారి కూడా చూశాడు.) 'వలఖర్‌రాహుల్ బల్ ఉఫఖిల్‌ముబీన్' (నిశ్చయంగా ఆయన్ను స్పష్టమైన దిగ్మండలంపై చూశాడు) అని అల్లాహ్ తన గ్రంథంలో అనలేదా? అని నేనామెను అడిగాను."

(నా ప్రశ్నకు సమాధానంగా) హజ్రత్ ఆయిషా (ర) ఇలా అన్నారు: దైవసాక్షి! అందరికంటే ముందు నేనే దైవప్రవక్తను దీన్ని గురించి అడిగాను. ఆయన, నాకు "ఆ కనబడిన వ్యక్తి జిబ్రీల్ (అస). నేనాయన్ను ఆయన అసలు స్వరూపంలో రెండుసార్లకంటే ఎక్కువ చూడలేదు. (కాబట్టి పైన చెప్పిన రెండు

ఆయత్‌ల భావం, దైవప్రవక్త (స) అల్లాహ్‌ను చూసినట్లు కాదు) నేను ఆయన్ను ఆకాశం నుండి దిగివస్తూ ఉండగా చూశాను. ఆయన విశ్వరూపం భూమి నుండి ఆకాశంలో ఉన్న స్థానాన్నంతా నింపి వేసింది" అని చెప్పారు.

(అపవాదుకు సంబంధించిన రెండోమాట), దైవప్రవక్త (స) తనపై అల్లాహ్ అవతరింపజేసిన దానిలో కొంచెం దాచి ఉంచారు అని అన్నవాడు అల్లాహ్‌పై పెద్ద అభాండం వేసినవాడవుతాడు. ఎందుకంటే అల్లాహ్ తన గ్రంథంలో 'బల్లిగ్ మా ఉన్జిల ఇలైక్ మిర్రబ్బిక్' (నీ ప్రభువు తరపు నుండి నీపై అవతరించబడిన దాన్ని ప్రజలకు అందజేయి) అని చెప్పాడు.

(ఇక మూడో మాట ఏమిటంటే), దైవప్రవక్త (స) రేపు జరిగే సంఘటన గురించి (భవిష్యత్తు) ఎరుగుదురు అని ఎవరైనా అంటే అతడు అల్లాహ్‌పై గొప్ప అభాండం వేసినవాడవుతాడు. ఎందుకంటే, 'భూమ్యాకాశాల్లో ఉండే వారెవరూ పరోక్షాన్ని గురించి తెలుసుకోలేరు' అని అల్లాహ్ తన గ్రంథంలో పేర్కొన్నాడు. (తిర్మిజి)

## అహ్జాబ్ సూరా

"యా అయ్యుహన్నబియ్యు ఖుల్ లి అజ్వాజిక్...." (ప్రవక్తా! నీ భార్యలతో ఇలా చెప్పు- మీరే గనక ప్రాపంచిక జీవితాన్ని, దాని భోగభాగ్యాలను కోరితే, రండి మీకవి ఇచ్చి మంచిగా పంపిస్తాను. వాటికి బదులు మీరు అల్లాహ్‌ను, ఆయన ప్రవక్తను, పరలోకగృహాన్ని కాంక్షిస్తే, మీలో పుణ్యాత్ములయినవారి కోసం గొప్ప ప్రతిఫలం సిద్ధం ఉంది.)

ఈ ఆయత్ వ్యాఖ్యానం చెప్పే హదీసు ఇది వరకే చెప్పడం జరిగింది.

## నజ్మ్ సూరా

మస్రూఖ్ (ర) నజ్మ్ సూరా గురించి ఇలా అంటారు:

నేనే హజ్రత్ ఆయిషా (ర) దగ్గరికి వెళ్ళి, దైవప్రవక్త ముహమ్మద్ (స) తమ ప్రభువును చూశారా? అని అడిగాను. దానికి ఆమె మీరు అడిగిన విషయం

వల్ల నా రోమాలు నిక్కపొడిచాయి అని అన్నారు. అప్పుడు నేను, ఆగండి అని **"లఖద్ రఆ మిన్ ఆయాతి రబిహిల్ కుబ్రా"** (సందేహం లేదు! నీవు నీ ప్రభువు యొక్క గొప్ప సూచనలు చూశావు) అనే ఆయత్ చదివాను.

అప్పుడు హజ్రత్ ఆయిషా(ర) ఇలా అన్నారు: ఈ మాట నిన్ను ఎక్కడకు తీసుకుని వెడుతుంది? (అంటే నీవు ఈ ఆయత్ నుండి ఎంత తప్పుడు అర్థాన్ని తీస్తున్నావు లేక తప్పుగా అర్థం చేసుకున్నావు. ఆయన జిబ్రీల్ (స)ను చూశారు. ఎవరైనా మీతో ముహమ్మద్(స) తన ప్రభువును చూశారు లేక ఆయనకు ఇవ్వబడ్డ ఆదేశాల్లో ఏదైనా దాచారు, లేక ఆ అయిదు విషయాలు వేటి గురించైతే అల్లాహ్‌కే బాగా తెలుసో (ప్రళయం ఎప్పుడు రానుందో, వర్షం ఎప్పుడు కురుస్తుందో మొదలైనవి) అన్నవాడు అల్లాహ్‌పై పెద్ద అపనిందను మోపాడు. ఆయన చూసింది జిబ్రీల్ (అ)ను. జిబ్రీల్‌ను ఆయన అసలు స్వరూపంలో రెండు మార్లు చూశారు. ఒకమారు సిద్రతుల్ ముంతహా దగ్గర, మరోమారు మక్కానగర ప్రదేశం (జియాద్)లో అప్పుడు జిబ్రీల్‌కు ఆరు వందల రెక్కలున్నాయి. ఆ రెక్కలు దిగ్మండలాన్ని కప్పేశాయి.

## ముమ్తహినా సూరా

మోమిన్ స్త్రీలు హిజ్రత్ చేసి దైవప్రవక్త (స) సన్నిధికి వచ్చినప్పుడు దైవప్రవక్త (స) "యా అయ్యుహన్నబియ్యు ఇజ్ జా అకల్ మోమినాతు యు బాయినుక్..." అనే ఆయత్ ప్రకారం వారిని పరీక్షించేవారని హజ్రత్ అయిషా (ర) అన్నారు.

(**భావం:** ఓ ప్రవక్తా! మీ వద్దకు మోమిన్ స్త్రీలు వచ్చి మేము అల్లాహ్‌కు ఎవరిని సాటి కల్పించము, దొంగతనం చెయ్యము, వ్యభిచారం చెయ్యము, సంతానాన్ని సంహరించము, కావాలని ఎవరిపై అపనిందలు మోపం, ధార్మిక విషయాల్లో మీ ఆజ్ఞల్ని ఉల్లంఘించం అనే విషయాలను గురించి నీతో బైత్ చేస్తే వాళ్ళ చేత బైత్ (ప్రమాణం) చేయించు. వారి పాపక్షమాపణ కోసం అల్లాహ్‌ను ప్రార్థించు. నిశ్చయంగా అల్లాహ్ మన్నించేవాడు, కరుణామయుడు.)

"మోమిన్ స్త్రీలలో ఈ ప్రమాణం చేసేవారు ధార్మిక ప్రమాణం చేసినట్లే, ఆ స్త్రీలు ఈ విషయాలను అంగీకరించి ప్రమాణం చేసిన తరువాత దైవప్రవక్త (స) వారితో 'పొండి, నేను మీ నుండి బైత్ తీసుకున్నాను' అనేవారు. దైవసాక్షి! ప్రవక్త మహనీయులు ఎప్పుడూ (బైత్ తీసుకోవడంలో దైవసాక్షి) ఏ స్త్రీ చేతినీ తాకలేదు. దైవప్రవక్త (స) కేవలం నోటితోనే బైత్ తీసుకునేవారు. దైవసాక్షి! దైవప్రవక్త (స) స్త్రీల నుండి దైవేచ్ఛకు వ్యతిరేకంగా ఎప్పుడూ బైత్ తీసుకోలేదు. ప్రవక్త మహనీయుల చేయి ఏ స్త్రీ చేతిని తాకలేదు." అని హ(జత్ ఆయిషా (ర) ప్రవచించారు. (ముస్లిం)

## ఇన్షిఖాఖ్ సూరా వ్యాఖ్యానం

హ(జత్ ఆయిషా (ర), దైవప్రవక్త (స) ఇలా ప్రవచించినట్లు నేను విన్నానని ఉల్లేఖిస్తున్నారు: "ఎవరి లెక్కా పత్రం శోధించబడుతుందో అతడు అంతమైనట్లే." (అంటే ప్రళయం నాడు అల్లాహ్ ఎలా లెక్క అడగాలో అలా అడిగితే ఇక అతనికి తప్పించుకునే మార్గమే ఉండదు.) అని దైవప్రవక్త (సఅసం) అనగా, దైవప్రవక్తా! అల్లాహ్ (తన గ్రంథంలో) **"ఫ అమ్మామన్ ఊతియ బియమీనిహి"** (కాబట్టి ఎవరి కుడిచేతిలో అతని కర్మపత్రం ఇవ్వబడుతుందో అతని నుండి లెక్క తేలిగ్గా గైకొనబడుతుంది) అన్నాడు కదా అని హ(జత్ ఆయిషా(ర) అడిగారు. దానికి జవాబుగా దైవప్రవక్త (స) "ఇలా ఇది (వారి కర్మలను) వారి ముందు ఉంచడం లాంటిది." అని ప్రవచించారు. (తిర్మిజీ)

## అల్లాహ్‌కు ఇష్టమైనది

హ(జత్ ఆయిషా (ర) ఇలా ప్రవచిస్తున్నారు: "(ఓ రోజు) దైవప్రవక్త (స) నా ఇంటికి వచ్చినప్పుడు నా దగ్గర ఓ స్త్రీ కూర్చుని ఉంది. ఆమె ఎవరని ఆయన నన్నడిగారు. ఈమె ఫలానా స్త్రీ (ఖౌలా బిన్తె తవీత్), ఈమె రాత్రంతా నమాజు చేస్తుంది అని ప్రతీతి అన్నాను. అప్పుడు దైవప్రవక్త (స) (ఆ స్త్రీని ఉద్దేశించి) వద్దు! నీలో శక్తి ఉన్నంతమటుకే ఆరాధన చెయ్యి, దైవసాక్షి! అల్లాహ్ అలసిపోడు, నీవే అలసిపోతావు. అల్లాహ్‌కు ఇష్టమైన 'దీన్' (ఆరాధన) ఏదంటే ఎల్లప్పుడు నిలకడగా చేసే ఆరాధనే. (బుఖారి, ముస్లిమ్)

## కారుణ్య దూతలు

హజ్రత్ ఆయిషా (ర) ఇలా ప్రవచించారు: "ఓ మారు నేను దైవప్రవక్త(స) కోసం ఓ దిండును నింపాను. దానిపై అచ్చు వేయబడ్డ చిత్రాలు ఉన్నాయి. ఆయన వచ్చి రెండు దర్వాజాల నడుమ నిలబడ్డారు. ముఖారవిందపు రంగు మారిపోయి ఉంది. దైవప్రవక్తా! నా వల్ల ఏమైనా తప్పు జరిగిందా? అని అన్నాను. దానికి, ఈ దిండేమిటి అని అడిగారు ఆయన. ఈ దిండును తమరు తలపెట్టి సేదతీర్చుకుంటారని తమ కోసమే నేను తయారు చేశాను అని విన్నవించు కున్నాను. అప్పుడాయన ఇలా ప్రవచించారు:

"ఏ ఇంట్లో చిత్రపటం ఉంటుందో ఆ ఇంట్లో కారుణ్య దూతలు ప్రవేశించరు అని నీకు తెలియదా? ఎవరైతే చిత్రాలను గీస్తారో వారు ప్రళయంనాడు యాతనలకు గురిచేయబడతారు. (ఆనాడు) నీవు దేన్నయితే తయారు చేశావో అందులో ప్రాణం పొయ్యి అని ప్రశ్నించబడతాడు (ఆ చిత్రకారుడు)". (బుఖారి)

## అల్లాహ్ శాపం

హజ్రత్ ఆయిషా (ర) ఇలా ప్రవచించారని సఫియా బిన్తె షైషీబా, ఉల్లేఖిస్తున్నారు. "అన్సార్ తెగకు చెందిన ఓ అమ్మాయి పెళ్ళయింది. ఆ తరువాత ఆమె వ్యాధికి గురై తల వెంట్రుకలు రాలడం ప్రారంభించాయి. ఆమె ఆ వెంట్రుకలను అతికించడానికి ప్రయత్నం చేశారు. (అంటే ఆ వెంట్రుకలతో సవరం కట్టి జడవేయ ప్రయత్నించారు) దాన్ని గురించి ఆమె దైవప్రవక్త(స)ను అడిగితే "అల్లాహ్ వెంట్రుకల్ని అతికించే స్త్రీని, ఆ వెంట్రుకలను అతికించుకునే స్త్రీని శపించాడు" అని దైవప్రవక్త (సఅసం) చెప్పారు. (బుఖారి)

## నరకాగ్ని నుండి ఆచ్ఛాదన

ఉర్వా బిన్ జుబైర్ (ర) ప్రకారం హజ్రత్ ఆయిషా(ర) ఇలా అన్నారు:

ఒక స్త్రీ తన కుమార్తెలు ఇద్దరిని తీసుకొని నా దగ్గరకు అడుక్కోవడానికి వచ్చింది. అప్పుడు నా దగ్గర ఒక ఖర్జూరం తప్ప ఇంకేదీ లేదు. నేను ఆ

ఖర్జూరాన్నే ఆమెకు ఇచ్చేశాను. ఆమె ఆ ఖర్జూరాన్ని తన ఇద్దరు కుమార్తెల్లో చెరిసగం చేసి ఇచ్చింది. తరువాత ఆమె వెళ్ళిపోయింది. దైవప్రవక్త (స) వచ్చిన తరువాత ఈ విషయం ఆయనకు చెప్పాను. అప్పుడాయన "ఎవరైతే యుక్తవయస్సు వచ్చిన తన కుమార్తెలకు ఏదైనా ఇచ్చినా, వారిపై కనికరం చూపినా ఆ పుణ్యకార్యం అతని కోసం నరకాగ్ని నుండి ఆచ్ఛాదనగా పనిచేస్తుంది" అని ప్రవచించారు. (బుఖారి)

## పొరుగువారి పట్ల ప్రవర్తన

హజ్రత్ ఆయిషా (ర) దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారని ఉల్లేఖిస్తున్నారు:

"జిబ్రయీల్ (అ) ఎల్లప్పుడూ నాకు పొరుగువాని గురించి వసియ్యత్ (బోధ) చేస్తూ ఉండేవారు. చివరికి, పొరుగువాడ్ని నా వారసునిగా చేసేస్తారా అనే అనుమానం వచ్చేది నాకు". (బుఖారి)

హజ్రత్ ఆయిషా (ర) దైవప్రవక్త (స)ను ఇలా అడిగారు. "దైవప్రవక్తా! నాకు ఇద్దరు పొరుగు వారున్నారు. వారిలో నేను ఎవరికి కానుక పంపించేది" అని. అప్పుడు దైవప్రవక్త (స) "వారిలో ఎవరి ద్వారం నీ ద్వారానికి దగ్గర ఉంటుందో అతనికి కానుక పంపించు" అని ప్రవచించారు. (బుఖారి)

## మమకారం

హజ్రత్ ఆయిషా (ర) ఇలా ప్రవచించారని ఉర్వా బిన్ జుబైర్ (ర) ఉల్లేఖించారు:

"ఓ పల్లెటూరి వ్యక్తి దైవప్రవక్త (స) సన్నిధికి వచ్చి మీరు చిన్న పిల్లలను ముద్దాడుతారు. మేమలా చేయం" అని అన్నాడు. దానికి దైవప్రవక్త (సఅసం), "అల్లాహ్ మీ హృదయాల నుండి మమకారాన్ని తీసివేస్తే నేనేం చేయగలను?" అని అన్నారు. (బుఖారి)

## స్త్రీల జిహాద్

హజ్రత్ ఆయిషా (ర) దైవప్రవక్త (స)ను ఇలా అడిగారు: "దైవప్రవక్తా! మేము జిహాద్ (ధర్మయుద్ధాన్ని)ను అన్ని సత్కర్మల కంటే శ్రేష్ఠమైనదని తలుస్తాం.

మరి మేమెందుకు, జిహాద్‌లో పాల్గొనకూడదు?" దానికి దైవప్రవక్త (స) "మీకు శ్రేష్ఠమైన జిహాద్, హజ్ మాత్రమే" అని ప్రవచించారు. (బుఖారి)

ఈసాలెసవాబ్ గురించి హజ్రత్ ఆయిషా(ర) ఉల్లేఖనం:

ఒకతను దైవప్రవక్త (స) సన్నిధికి వచ్చి, "దైవప్రవక్తా! నా తల్లి ఆకస్మాత్తుగా చనిపోయింది. ఎలాంటి హితబోధ చేయలేకపోయింది. ఆమె మాట్లాడ కలిగి ఉంటే తప్పకుండా దానధర్మాలు చేసేది (చేయమని చెప్పి ఉండేది). నేను ఆమె తరఫున దానం చేస్తే ఆ పుణ్యం ఆమెకు లభిస్తుందా? అని అడిగాడు. జవాబుగా దైవప్రవక్త (సఅసం) "లభిస్తుంది" అన్నారు. (ముస్లిమ్)

## సమాధి పరీక్ష

హజ్రత్ అస్మా (ర) ఉవాచ: దైవప్రవక్త (స) కాలంలో సూర్యగ్రహణం పట్టినప్పుడు నేను హజ్రత్ ఆయిషా (ర) దగ్గరకు వెళ్ళాను. అప్పుడామె నమాజు చేస్తున్నారు. నేను, ఏమిటి ప్రజలు (వేళగాని వేళలో) నమాజు చేస్తున్నారు అని అన్నాను. ఆయిషా(ర) (నా మాటలు విని) తలతో ఆకాశం వైపు సైగ చేశారు. ఏదైనా గుర్తు (సూచన) ఉందా? అని నేను అడిగాను. ఆమె అవును అన్నారు. (ఆ తరువాత నేను నమాజులో లీనమైపోయాను.) దైవప్రవక్త(స) నమాజులో చేసిన సుదీర్ఘ ఖియామ్ (నిలబడ్డం) వల్ల నాకు తల తిప్పనారంభించింది. (బలహీనత ఏర్పడింది.) నా ప్రక్కనే నీటితో నిండిన తోలుతిత్తి ఉంది. దాన్నుందుకొని తలపై లేక ముఖంపై నీళ్ళు చల్లుకోనారంభించాను. చివరికి దైవప్రవక్త (స) నమాజు పూర్తి చేశారు. అప్పటికి సూర్యగ్రహణం కూడా విడిపోయింది. ఆ తరువాత దైవప్రవక్త (స) ప్రజలను ఉద్దేశించి ప్రసంగించారు. మొదట దైవాన్ని స్తుతించారు. (ఆ తరువాత ఇలా అన్నారు:)

"ప్రజలు ఇదివరకు ఎన్నడూ చూడని దాన్ని ఇప్పుడు తమ స్థానంలో (అంటే నమాజు చేసే ప్రదేశంలో) ఉండి చూశారు. చివరికి స్వర్గాన్ని, నరకాన్ని కూడా. దైవవాణి ద్వారా నాకు తెలియచేయబడిన విషయం ఏమిటంటే, గోరీల్లో కూడా మిమ్మల్ని పరీక్షించడం జరుగుతుంది. ఆ పరీక్ష 'మసీహ్ దజ్జాల్' ఫిత్నా

(పరీక్ష) లాంటిది. మీ ముందు నన్ను (అంటే నా రూపం) తీసుకొని వచ్చి, ఈ వ్యక్తి గురించి నీకేం తెలుసు? అని అడుగుతారు. మోమిన్ (విశ్వాసి) అయితే ఆయన ముహమ్మద్ (సఅసం), ఆయన మా వద్దకు రుజుమార్గం, ఆధారాలు తెచ్చిన దైవప్రవక్త, మేము ఆయన బోధనలను స్వీకరించాము. ఆయన్ను అనుసరించాం, అని అంటాడు. ఇలాంటి ప్రశ్నా సమాధానాలు మూడు సార్లు జరుగుతాయి. మృతుని సమాధానాలు విని ప్రశాంతంగా పడుకో. నీవు ఈ వ్యక్తిని విశ్వాసించావని మాకు ముందే తెలుసు. ఇక హాయిగా పడుకో అని అతనితో చెప్పబడుతుంది.

మృతుడు మునాఫిక్ (కపట విశ్వాసి) అయితే (దైవదూతలు అడిగే ప్రశ్నకు, "నాకు తెలియదు ఈయన ఎవరో. నేను ప్రజలు చెప్పగా విని వారు చెప్పిందాన్ని వల్లెవేశాను అంతే" అంటాడు." (ముస్లిమ్)

# నికాహ్

"నికాహ్ (వివాహం) బహిరంగంగాను, మస్జిద్‌లలోను చేయండి. దఫ్ (డప్పు) వాయించి చేయండి" అని దైవప్రవక్త (స) ప్రవచించారని హజ్రత్ ఆయిషా (ర) ఉల్లేఖించారు. (తిర్మిజి)

దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారని హజ్రత్ ఆయిషా (ర) తెలిపారు:

"ఏ నికాహ్ (వివాహం) కనీస (అతి తక్కువ) ఖర్చుతో చేయబడుతుందో ఆ నికాహ్ శుభప్రదమైనది." (బైహఖి)

# కానుక

హజ్రత్ ఆయిషా (ర) దైవప్రవక్త(స) ప్రవచనాన్ని ఇలా ఉల్లేఖించారు:

"పరస్పరం కానుకలు ఇచ్చి పుచ్చుకోండి. కానుకలు హృదయ కాపట్యాలను అంతం చేస్తాయి." (తిర్మిజి)

హజ్రత్ ఆయిషా (ర) ఇలా ఉల్లేఖించారు: "దైవప్రవక్త (స) కానుకలను స్వీకరించేవారు. బదులుగా కానుకలను ఇచ్చేవారు కూడా." (బుఖారి, తిర్మిజి)

## ఒకరి చెడును ప్రస్తావించడం

హజ్రత్ ఆయిషా(ర) ఉల్లేఖనం: "ఒకరి (చెడుల) గురించి ప్రస్తావించ డాన్ని నేను కోరను. దానివల్ల నాకు ఇది, ఇది లభించినాసరే" (అంటే ఎన్ని ప్రయోజనాలు కలిగినా సరే, నేను ఒకరి చెడును గురించి ప్రస్తావించను అని)" దైవప్రవక్త (స) ప్రవచించారు.

## ఒకరి లోపాన్ని ఎత్తిచూపడం

హజ్రత్ ఆయిషా (రజి) దైవప్రవక్త (సఅసం)తో "దైవ ప్రవక్తా! సఫియా ఇలాంటి స్త్రీ" అంటూ తన చేతులతో చూపెట్టారు. (అంటే ఆమె ఎత్తు కొంచెం తక్కువ). ఇది విన్న దైవప్రవక్త (స) "ఆయిషా! నీవు అన్న మాటను ఒకవేళ సముద్ర జలంలో కలిపినా కలిసిపోతుంది" (అంటే చాలా కఠినమైన మాటని అర్థం) అన్నారు. (తిర్మిజి)

## మూడు ప్రదేశాలు

హజ్రత్ ఆయిషా (ర) ఉల్లేఖనం: ఓసారి నేను నరకం జ్ఞాపకం వచ్చి ఏడ్వనారంభించాను. దైవప్రవక్త (స) అది గమనించి "నిన్ను ఏడ్పించిన విషయం ఏమిటీ?" అని అడిగారు. "నాకు నరకం జ్ఞాపకం వచ్చింది. దాని భయమే నన్ను ఏడ్పించింది. రేపు ప్రళయంనాడు మీరు మీ ఇంటివారిని గుర్తుంచు కుంటారా? అని అడిగాను నేను. అప్పుడు దైవప్రవక్త (స) ఇలా తెలిపారు: "మూడు ప్రదేశాల్లో మాత్రం ఎవరూ ఎవరినీ గుర్తుంచుకోలేరు. అవి:

1. కర్మలు తూచబడేటప్పుడు, తమ కర్మలు బరువైనవా తేలికైనవా అని తెలియనంతవరకు.

2. కర్మల పత్రం చేతికి అందేటప్పుడు, మోమిన్ కర్మల పత్రం అతని కుడిచేతిలో ఉంచబడినప్పుడు అతను ఆనందంగా, చదవండి నా కర్మల పత్రాన్ని అని ఇతరులతో అంటాడు. తన కర్మపత్రం కుడిచేతిలోనా, ఎడమ చేతిలోనా లేక వీపు వెనుకభాగం నుండి ఇవ్వబడుతుందా? అనే విషయం తేలనంతవరకు.

3. పుల్‌సిరాత్ (వంతెన)పై. అది నరకంపై ఉంచబడినప్పుడు, (దానిపై నుండి నడవమని ఆదేశించబడినప్పుడు) (అబూదావూద్)

## స్త్రీ, పురుషుల హక్కులు

హజ్రత్ ఆయిషా (ర) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త ఇలా ప్రవచించారు: "స్త్రీపై అన్నిటికంటే పెద్ద హక్కు ఆమె భర్తది. అదే విధంగా పురుషునిపై అన్నింటికంటే పెద్ద హక్కు అతని తల్లిది." (ముస్తదకుల్ హాకిమ్)

## దజ్జాల్ గుర్తులు

హజ్రత్ ఆయిషా (ర) ఇలా ఉల్లేఖించారు:

"నా ఇంటి గుమ్మంలోకి ఓ యూద స్త్రీ వచ్చి "నాకు భోజనం పెట్టండి, అల్లాహ్ మీకు మసీహ్ దజ్జాల్ ఫిత్నా (పరీక్ష) నుండి, సమాధి ఫిత్నా నుండి రక్షిస్తాడు" అన్నది. నేను ఆమెను దైవప్రవక్త (స) వచ్చే వరకు ఆపి ఉంచాను. దైవప్రవక్త (స) వచ్చిన తరువాత, ఆ యూద స్త్రీ గురించి చెబుతూ భోజనం అడిగి (దజ్జాల్ ఫిత్నా గురించి) దుఆ చేసిందని చెప్పాను. ఇది విన్న దైవప్రవక్త (స) లేచి నిలబడ్డారు. తన రెండు చేతులెత్తి దజ్జాల్ ఫిత్నా, సమాధి ఫిత్నా గురించి దైవాన్ని శరణు వేడారు. ఆ తరువాత ఆయన ఇలా సెలవిచ్చారు:

"ప్రపంచంలో ఎందరు దైవప్రవక్తలు వచ్చారో వారంతా దజ్జాల్ ఫిత్నా గురించి తమ తమ సమాజాలను భయపెట్టారు. నేనిప్పుడు ఇంకా ఏ ప్రవక్త చెప్పని విషయం చెప్పి భయపెడుతున్నాను. చూడు, దజ్జాల్ చెవిటివాడు. అల్లాహ్ చెవిటివాడు కాడు. దజ్జాల్ నొసటిపై 'కాఫిర్' అని రాయబడి ఉంటుంది."

ఆ తరువాత ఆయన సమాధి పరీక్ష గురించి చెబుతూ "నా గురించి మిమ్మల్ని (సమాధిలో) పరీక్షించడం జరుగుతుంది. ఈ పరీక్షలో విశ్వాసి సఫలం అవుతాడు. అవిశ్వాసి విఫలమవుతాడు" అని అన్నారు. (అహ్మద్, బైహఖి)

## ఆయిషా! భయపడకు

హజ్రత్ ఆయిషా (ర) దైవప్రవక్త (స)తో ఇలా విన్నవించుకున్నారు: "దైవప్రవక్తా! మీ ఉమ్మత్ (అనుచర సమాజం) ప్రజలు సమాధులలో పరీక్షించబడతారు (కదా). నేను బలహీనమైన స్త్రీని. అప్పుడు నా పరిస్థితి ఎలా ఉంటుంది?" దానికి దైవప్రవక్త (స), "అల్లాహ్ విశ్వాసులకు సరైన సమాధానమిచ్చే భాగ్యాన్ని, నిలకడను ప్రసాదిస్తాడు. కాబట్టి నీవేమీ భయపడవద్దు" అని సెలవిచ్చారు. (బజార్)

